## సదాశివ సమారంభాం


గురు దకిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ ఆఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రానుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖



మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# జానపద నృత్యకళ

## (Janapada Nrutyakala)

(1986లో శ్రీకృష్ణ దేవరాయ విశ్వవిద్యాలయం నుంచి పిహెచ్ డి పట్టా పొందిన
సిద్ధాంత వ్యాసం Thesis awarded of the Degree of Ph D
from the Sree Krishnadevaraya University in the year 1986)


**డాక్టర్ చిగిచర్ల కృష్ణారెడ్డి**
**Dr. Chigicherla Krishna Reddy**



ప్రచురణ :

**జానపద యువకళాకారుల సంఘం**
(రిజిష్టర్డ్ 245/88)
సుబ్బరావుపేట (పోస్టు)
ధర్మవరం మండలం, అనంతపురం జిల్లా.

---

ఈ గ్రంథం తెలుగు విశ్వవిద్యాలయంవారి ఆర్థిక సహాయంతో
ముద్రింపబడింది.



పుట్టింది , సుబ్బరావుపేట 1954 జులై 25

చదివింది సుబ్బరావుపేట - ధర్మవరం - అనంతపురం

వృత్తి . తెలుగు అధ్యాపక వృత్తి - 10-8-1981 నుండి 15-5-1987 వరకు శ్రీ వై యస్ రాజారెడ్డి డిగ్రీ కళాశాల - పులివెందుల, కడప జిల్లా 16-5-1988 నుండి తెలుగు విశ్వవిద్యాలయం లలితకళా పీఠంలోని జానపద కళల శాఖలో అధ్యాపక వృత్తి.

జీవిత ధ్యేయం : రాయలసీమ జానపద కళారూపాల సేకరణ, కళారూపాల ప్రచారం, జానపద కళాకారులకు సహాయపడటం

ముద్రిత గ్రంథాలు : 1. ధర్మవరం తాలూకా జానపదగేయాలు
2. గ్రామీణ సంస్కృతి (అనంతపురం జిల్లా జానపద గేయాలు)
3. జానపద కళారూపం - చెక్కభజన
4. జానపద నృత్యకళ

అముద్రిత గ్రంథాలు . 1. జానపద కళారూపం —ఉరుములు
2. ,, —కోలాటం
3. ,, —గొరవయ్యలు
4. తిమ్మమ్మ మర్రిమాను బుర్రకథ
5. రాయలసీమ జానపద కళారూపాలు
6. జానపదుల ఆటపాటలు

# ఆశీస్సులు

డాక్టర్ చిగిచర్ల కృష్ణారెడ్డిగారిని నేను చాలా కాలంగా ఎరుగుదును రెడ్డిగారు పదహారణాల జానపదుడు. పుట్టింది, పెరిగింది పల్లెసీమ అగుటవలన కృష్ణారెడ్డిగారు ఆడగలడు పాడగలడు జానపదుల సంగీత సాహిత్యములను, ఆచార వ్యవహారములను శ్రమించి పరిశోధించిన దిట్ట కోలాటము, చెక్కభజన లాంటి జానపద నృత్యములను ప్రదర్శించి ప్రజాహృదయాలకు దగ్గరగా తీసుకవెళ్తున్న పరిశోధకులలో రెడ్డిగారొకరు వీరు ఇదివరకే గ్రామీణుల సంస్కృతీ సౌరభములను వ్యాపింపచేశారు జానపదుల గేయములలోని మధురిమలను రుచి చూపించారు చెక్కభజనలోని జానపదుల కళాసొగసులను విరజిమ్మి పాఠకలోకమునకు అందించారు.

ప్రస్తుతము "జానపద నృత్యకళ" అను గ్రంథమును ఆంధ్ర సాహితీ ప్రపంచమునకు అందించుచున్నారు. జానపదుల నృత్యభంగిమలను, కొన్ని జానపదుల నృత్యములను ముఖ్యంగా రాయలసీమ మండలములోని నృత్యాలను పరిచయము చేస్తున్న ప్రథమ గ్రంథమిది. జానపద విజ్ఞానకాంతులను ప్రసరింపజేస్తూ, ఇంకా కృషి చేస్తూ జానపద కళాసరస్వతిని ఇంకెన్నో అలంకారములతో అలంకరింపజేయగలడని ఆశిస్తున్నాను. అందుకై రెడ్డిగారిని ఆశీర్వదిస్తూ ఆ పరాత్పరుడు దీర్ఘాయురారోగ్యములను ప్రసాదించగలడని కోరుకుంటున్నాను.

ఇంతటి ఉత్తమ గ్రంథాలను పాఠకలోకమునకు అందించినందులకు కృష్ణారెడ్డిగారిని హృదయపూర్వకముగా అభినందించుచున్నాను

ఆచార్య బిరుదురాజు రామరాజు
చిక్కడపల్లి, హైదరాబాదు

# శుభాశీస్సు

బిరుదు పట్టాల జోలికి, భేషజాల పాలికి పోకుండా జానపద వాఙ్మయోద్ధారకులు ఎందరో మహానుభావులు సలిపిన కృషికి ఫలితంగా తెలుగునాట జానపద కళా క్షేత్రంలో ముక్కారు పంటలు పండుతున్నవి పరిసర రాష్ట్రాలలోను, పరాయి సీమలలోను ఈ ముఖంగా సాగుతున్న పరిశోధనా పద్ధతులను ఆకళింపు చేసుకొని తమదైన ప్రతి భావాన్ని విభవాన్ని జోడించి మన యువ పరిశోధకులు త్రివిక్రమ క్రమంలో పరిక్రమిస్తున్నారు. "అహం పూర్వ మహం పూర్వ" మ్మని పోటాపోటీలు పడి పరాక్రమిస్తున్నారు ఇట్టి వారిలో ఏతత్కృతికర్త డాక్టర్ చిగిచర్ల కృష్ణారెడ్డి ఒకరు శాస్త్రీయమైన అవగాహనను మరింతగా పెంపొందించుకొని, ఇతోఽధిక సాధన సంపత్తిని సమకూర్చుకుని డా॥ రెడ్డి ఉదాత్త కృషీవలురై ఉద్యమిస్తారని ఆశిస్తున్నాను

నవంబరు 1, 1989
హైదరాబాదు

ఆచార్య తూమాటి దొణప్ప

# ఆశీస్సు

జానపద వాఙ్మయ కళారంగాలతో విడదీయలేనంతగా ముడిపడ్డ వ్యక్తి డా॥ చిగిచర్ల కృష్ణారెడ్డి పరిశోధనం, అధ్యాపనం, ప్రయోగం — ఈ మూడు విభాగాల్లో కృష్ణారెడ్డి జానపదుల జీవితాల్నే ఎన్నుకున్నాడు తెలుగు విశ్వవిద్యాలయ అధ్యాపకుడుగా కూడా వీటితో ప్రగాఢ బంధం పెంచుకున్నాడు

కృష్ణారెడ్డి ప్రచురిస్తున్న 'జానపద నృత్యకళ' కేవలం ఇంతవరకున్న సామగ్రిమీద ఆధారపడింది కాదు అతడు స్వయంగా సేకరించిన ఎన్నెన్నో పల్లెపాటలు ఈ పుస్తకంలో పీట వేసుకున్నాయి.

కృష్ణారెడ్డికున్న ఈ జానపద వాఙ్మయ జిజ్ఞాస మరింత ఎదిగి మరికొన్ని మౌలిక రచనలకు దారి తీస్తుందని ఆశిస్తున్నాను ఇదే నా ఆశీస్సు.

ఆచార్య సి. నారాయణరెడ్డి

# శుభాకాంక్ష

డాక్టర్ చిగిచర్ల కృష్ణారెడ్డిని నేనెరుగుదును మనిషి వినయశీలి తెలుసుకుందామనే జిజ్ఞాసను కాపాడుకుంటున్న నిత్యవిద్యార్థి

ఆయన ప్రచురించిన 'ధర్మవరం తాలూకా జానపద గేయాలు' గ్రామీణ సంస్కృతి, 'జానపద కళారూపం - చెక్కభజన' అనే పుస్తకాలను చూచాను ఇపుడు తిరిగి ఈ జానపద నృత్యకళల మీద మక్కువ పెంచుకొని, మిక్కిలిగా శ్రమిస్తున్న ఈ యువపరిశోధకునకు తెలుగు విశ్వవిద్యాలయంలో ప్రవృత్తికి అనుగుణమైన వృత్తి లభించడం చక్కటి సంవిధానం విషయగ్రహణం చేసి పరిశీలనాత్మక దృష్టితో దాన్ని విశ్లేషించడమేగాక 'కోల' చేతబట్టి స్వయంగా 'కోలన్నల్ని', చెక్కభజనల్ని మొ॥ వాటిని నడిపించడం ఇతనిలోని ఒక విశిష్టత గొంతెత్తి మధురంగా, జానపద వణితుల్ని చెదరగొట్టకుండా, పైపెచ్చు శ్రద్ధగా వాటిని పరిరక్షించుకుంటూ, పాడగలగడం ఇతని ప్రత్యేకత

ఇక ఈ పుస్తకాన్ని గురించి! నాలుగైదు సంవత్సరాల క్రిందటిదాకా, జానపద సాహిత్యాధ్యయనానికి విద్యార్థి ఎక్కువగా ఇంగ్లీషు హిందీ పుస్తకాలను ఆశ్రయించవలసి వస్తుండేది ఏదో నాలుగైదు పుస్తకాలు తప్ప తెలుగులో కాని, తెలుగు జానపద సాహిత్యాన్ని గురించి కాని, తెలుగు జానపద సాహిత్యాన్ని గురించి కాని, సమాచారం విరివిగా అందేది కాదు.

కాని ఈనాడు జానపద విజ్ఞాన రంగంలో పరిశోధన ముమ్మరంగా సాగుతోంది పరిశోధకులు ఈ రంగంలో ప్రవేశించి వివిధ విషయాల మీద తమ దృష్టిని వ్యాప్తం చేశారు చేస్తున్నారు తొలిరోజుల్లో ఎక్కడో బిక్కుబిక్కుమంటూ ఐచ్ఛిక విషయంగా మాత్రమే పరిమితమయిపోయిన ఈ రంగం, ఈనాడు విశ్వవ్యాప్తిని పొందగలుగుతోంది స్నాతకోత్తర స్థాయితో ప్రారంభించి, పరిశోధక విద్యార్థుల ప్రవేశిక పరీక్షలలో నిలదొక్కుకుని, ముందు ముందు ఉద్యోగిక పరీక్షలలో కూడా తప్పనిసరి స్థానాన్ని పొందే దిటవుతనాన్ని సంతరించుకుంటున్నది

అసలు ఏ మనిషయినా వర్తమానాన్ని ప్రేమిస్తూ, భవిష్యత్తుపై ఆశ పడ్తూ, ఊరుకోవడమేకాక, గతాన్ని తెలుసుకుని పొంగడమూ చేయవలసిన పనే! నీవెవరో తెలిస్తే తప్ప నీవింత ఎత్తుకు ఎదిగిన క్రమువల్ల కలిగే ఆనందలబ్ధి పరిపూర్ణంగా అనుభవయోగ్యం కాదు

జానపద విజ్ఞానాధ్యయనం మనిషికి అతని గతాన్ని అద్దంలో చూపిస్తుంది

పరిశోధకుడు తన పరిశోధనా ఫలాన్ని మూటకట్టి అటకకెత్తకుండా మథించి నలుగురికీ ఈనాడు పంచగలుగుతున్నాడు అందుకు తెలుగు విశ్వవిద్యాలయం వారి ఆర్థిక సహకారం ఒక కారణమని ఇక్కడ చెప్పడం అస్థానపతితం కాబోదు

ఈనాడు తెలుగులో జానపద విజ్ఞానాధ్యయన ఫలాలుగా ఎన్నో గ్రంథాలు వెలువడ్డాయి ఎంతో విస్తృతంగా జరిగిన క్షేత్రకార్యం (Field Work) వలన జానపద గేయాలు, కథలు, ప్రదర్శన కళారూపాలు, గ్రంథస్థం కావించబడ్డాయి. ఇప్పుడు జానపద పరిశోధకులకు, తెలుగులో ఆకర గ్రంథాలకు కొరతలేదు. విశ్లేషించడానికి వీలైన పాఠాలు (Texts) కూడా ఎక్కువగా లభిస్తున్నాయి.

అటువంటి గ్రంథాలలో ఈ జానపద నృత్యకళ ఒకటి. ఇందులో బిగిచర్ల కృష్ణారెడ్డి నృత్యకళకు సంబంధించిన సాంప్రదాయిక కళామూలాలను ఆటవిక మూలాలను వివరించడం జరిగింది మానవ సమాజ చరిత్ర ప్రక్రియలో తొలి భూమిక అడవి మలిభూమిక జానపదం మూడవది నగరం నాగరిక స్థితిలో సంస్కృతి అభివృద్ధి చెందుతున్నప్పుడే మనం ఈనాడు సాంప్రదాయక (Traditional) కళ అంటున్న రూపం అభివృద్ధి చెందింది దీనికి భూమికలైనవి ఆటవిక జానపద రూపాలే ఈ ప్రక్రియాన్ని దృష్టిలో ఉంచుకునే జానపద నృత్యకళను, అక్కడక్కడా తికమక పడకుండా కృష్ణారెడ్డి విశ్లేషించినట్లే తోస్తున్నది. కానీ ఈ విశ్లేషణకి మరింత గాఢత, విపులీకరణ అవసరం

రచయిత, జానపద నృత్య భేదాలలో వ్యష్టి, సమష్టి నృత్యాలను, చక్కగా వింగడించారు నామాలసింగడు, యామయ్యసాములు, లంకిణి నృత్యాలవంటి వ్యష్టినృత్యాలు ఆంధ్రప్రదేశ్‌లో అన్ని ప్రాంతాలకు చెందినవి కావు.

ఆటువంటి ప్రాంతీయ నృత్యభేదాలను వివరించడం బాగుంది సర్కార్ ప్రాంతంలో 'వాలకం'తో పోలిన 'నామాల సింగడు' జ్ఞాపకం ఉంచుకోదగ్గ వ్యష్టి ప్రక్రియాధోరణి ఇందులో నాలుగో అధ్యాయం నిజానికి ఈ గ్రంథానికి ఆముఖంగా ఉండవలసింది ఈ అధ్యాయంలోనే ఔత్తరాహనృత్య కళలతో తులనాత్మకతను చూపించడం జరిగింది తులనాత్మకాధ్యయనం పేర మరింత విపులంగా ఒక అధ్యాయం వెలువడి ఉంటే బాగుండేది

కొన్ని క్రొత్త జానపద నృత్యధోరణుల్ని పరిశోధకుల ముందుకి తెచ్చిన ఈ గ్రంథానికి నా ఆహ్వానం గ్రంథకర్తకు నా శుభాకాంక్షలు

హైదరాబాదు
19-10-89

ఆచార్య నాయని కృష్ణకుమారి

# "జానపద కృష్ణుడు"

"19వ శతాబ్ది చివరిదాకా ఆంగ్ల పల్లీయులకు సొంత కళాసంపద ఉండేది దానికి మూలాలు ఏ గతంలోనో ఉన్నాయి నేటికీ సృజనాత్మకంగా సజీవంగా బ్రతికిన కళాసంపద అది పాటలు- ఆటలూ ఆయా ఋతువుల్లో విందులు- వినోదాలు- నాటకాలు అన్న వ్యావసాయిక వృత్తితో ముడిపడినవి అద్భుత విషయకాలూ (Magical) ఇంత విస్తృత కళాప్రపంచం ఒక్క తరంలో సమూలంగా విధ్వంసం చేయబడింది ఇంగ్లండులో

1870లో వచ్చిన విద్యాశాసనంతో పట్టణవాసుల కనుగుణమైన విద్యావ్యాసంగం పల్లీయుల నెత్తిన రుద్దబడటంతో పల్లీవైభవం కళాసంపద అంతా నాశనమై పోయింది పట్టణ నివాసమే ప్రమాణమై పోయింది. విద్యావ్యాసంగానికి పారిశ్రామిక వ్యాపారవృత్తి పెత్తనం క్రింద వ్యావసాయిక జీవనం పూర్తిగా దెబ్బ తిన్నది 1870-1900 మధ్య జరిగిన ఈ దారుణమైన సంఘటనలో కొంత తెలిసి- కొంత తెలియని తనముగా- జరిగిన నష్టం మాత్రం- ఒక నాగరకతా సంస్కృతి నాశనం కావటం

దీనితోపాటు పట్టణాల్లో ఉన్న పేదవారికీ ఒక జానపద కళాసంపద ఉంది అదీ (Magical) అద్భుతాంశకమే పారిశ్రామిక లోహముష్టికి మతాతీత వ్యవస్థాగామం క్రింద అదీ నలిగిపోయింది 1900 నాటికి అతీంద్రియ శక్తులతో ముడిపడిన Magical- జానపద కళలన్నీ మట్టిలో కలిసిపోవడం జరిగింది. మాజికల్ కళలమీద ఆధునిక నాగరికత అలా తన కసి తీర్చుకొన్నది పల్లీయుల మనస్సులావిధంగా రిక్తగృహాలై పోయాయి.

ఈ కళాసంపద మాజికల్ తప్ప సొంతంతాం కాదు అది సంప్రదాయబద్ధం అంటే కాలమాన తో ముడిపడిన ఆర్తవ- ఋతుసంబంధమైన కృషితో- పండగలతో పబ్బాలతో ముడిపడిన కళ ఈ కళాకారులు పారిశ్రామిక నాగరి

కతలో దోచుకోబడ్డారు వారి సంప్రదాయం గొడ్డలితో నరకబడిన కొమ్మలు-బోదెలై పోయింది తిరిగి ఆ చెట్టు పుష్పించదు

ఈ కళ మాజికల్ తప్ప అలంకారాది శాస్త్ర సామగ్రితో కొలవబడేది కాదు అది కర్మకాండా బద్ధమైనది దీక్షావిధి- (ఇనీషియేషన్) కి సంబంధించింది అతీంద్రియ శక్తులను వికసింప చేయటానికి ఆ ఆటాపాటా వచ్చాయి తప్ప మన సాహిత్య విమర్శాసూత్ర లిక్కడ పనికి రావు వాటికోసం అది పుట్టలేదు అది కల్గించే భావోద్రేకాలు నిత్య జీవితానికి తోడ్పడేవి ఇది వినోద కళలో ఉండదు **The Various and Complicated magic which sorrounds and accompanish the agriculture of a peasant society expresses that societies emotions towards its flocks and herds, its crops and the instrumenls of its labour or rather evoke in its members at each critical point in the calender that emotion, from among all these which is appropriate to the corresponding phase as its annual work—**

మా మాటలన్నీ కళాసూత్రాలన్న గ్రంధంలో R G. కోలింగ్వుడ్ వ్రాసినవే వాటినతడు ఆంగ్లదేశ సంబంధంగా చర్చించాడు. ఇందులో జానపద సంపద కాల/పంచాంగ (Calendar) సంబంధం కావటంవల్ల ఆర్తవ కళ

పై విషయ విశ్లేషణ ద్వారా రెండంశాలు రూఢి అవుతున్నాయి

1 పారిశ్రామిక విద్యావిధానం - నాగరికతవల్ల జానపద కళ మరణించింది.

2. అది మాజిక్ కళ తప్ప వినోదాత్మకం కాదు అలంకారికం కాదు.

కాల సంబంధమనటం వల్ల అది క్రతుకళ (ritualist) తప్ప కావ్య నాటక కళ కాదు అంటే కాలగమనం ద్వారా ఏర్పడుతున్న పండుగలు-పబ్బాలు వీటితో ముడిపడి వ్యావసాయిక జీవన విధానాన్ని ఒక చేత్తో మరొక చేత్తో పద్యాదులను పట్టుకొని నడిచిన కళ జానపద కళ. మత- మతాతీత వ్యవస్థావిభేధం ఇక్కడ చేయటానికి వీల్లేదు.

జీవిత గమన ప్రేరణకు మూలం అవిష్కృత సుప్త చైతన్యం ఇది

జాగ్రచ్చైతన్యంతో సమన్వితమైనపుడు జీవితంలో భౌతికాభౌతికం విభేదం లేదు

“భారతీయ జీవన విధానంలో పర్వదినాలు కీలక స్థానాన్ని ఆక్రమిస్తున్నాయి అవి కాల (Calendar) సంబంధాలు శరన్నవరాత్రులు- చైత్ర నవరాత్రులు సంవత్సర కాలాన్ని రెండు ఆయనాలుగా పక్షాలుగా చీల్చిన బిందువులు కాలమాత- కాలకృష్ణపక్ష ప్రతీక- సృష్టి పూర్వదశకూ ప్రతీక శుక్లపక్ష = వ్యక్త సృష్టికి ప్రతీక హైమవర్ణ దుర్గ ప్రతీక కనుకనే కృష్ణ- శుక్లాష్టమీ తిధులు దేవీతిధులు

**This dark/luminous duality is charactiristic of the Goddess and Central to her myth as cosmic deity. Both aspects are essential tc the cult of Devi and manifest themselves in turn with the waning and waxing of the moon.**

ఏకాదశి తిధులు విష్ణుదేవతాకములైనవి శయన ఏకాదశి ఆషాఢ శుక్లం- ఉత్థాన ఏకాదశి కార్తీకంలో ఇందులో మొదటిది ప్రధానం. అది విష్ణువు ఆద్యాశక్తి గర్భంలోకి ప్రవేశించటానికి ప్రతీక కనుక పు(పూ)రి[1] రథ యాత్రోత్సవం ఆనాడే జరుగుతుంది

కృష్ణజన్మాష్టమి వంటివి దేవీమాసమైన శ్రావణంలో రావటం- ఆ రోజు కాళికాదేవికి ప్రధానం కావటం ఇద్దరి సమైక్యాన్ని సూచిస్తుంది దీపావళి గోవర్ధన పూజా సంబంధం కావటం- రాసక్రీడాదులు- పశుపూజోత్సవాలు- ఈ క్రీడా మండలమంతా- గోపకుల (Pastoral Castes) జీవన విధానంతో ముడిపడినదే ”

ఈ విషయం **The Divine Consort** అన్న పుస్తకంలో **Vawalevills** వ్రాసినది (వివరాలకు ఆ గ్రంథం సంప్రదించాలి)

---

1 ఇది బుద్ధక్షేత్రం. ఆ కాలంలో దీనిపేరు దంతపురి బుద్ధుని దంతాన్ని నిక్షేపించి స్తూపం కట్టారట. అందుచేత అది దండపురి. తరువాత కాలంలో అది వైష్ణవ క్షేత్రంగా మారిపోయింది. అందుచేత అది పురి తప్ప పూరి కాదు.

ఇదంతా పంచాంగ - కాలెండరుతో ముడిపడిన విషయము ఉత్సవాలు - ఆటలు - పాటలు ఈ మండలమంతా జీవనోత్సాహాన్ని కల్పించే కళా జీవన విధానం

ఈ నేపథ్యంలోనే జానపద కళా సంపత్తిని సమీక్షించాలి, తప్ప కావ్య విమర్శ చట్రంలోనో - భౌతిక దృష్టితోనో వివేచించరాదు

అధునిక జానపద నృత్యం కర్మకాండకు సంబంధించింది దానినుండి భరతాదులు రస నాట్యాన్ని మలిచారు ఇది రసరమ్యం ఈ విషయాన్ని సూచిస్తూనే మహర్షి-

ఋగ్వేదం నుండి పాఠ్యాన్ని - సామం నుండి గీతాన్ని యజుస్సులనుండి అభినయాన్ని - అథర్వం నుండి రసాన్ని గ్రహించానని చెప్పిన శ్లోకం యాజ్ఞిక నేపథ్యంలో క్రతువర్తనాధారంగా కావ్య నాట్యం వచ్చిందని చెప్తున్నది. (దీన్ని గురించి డా॥ పాటిబండ మాధవశర్మగారు తమ ఛందః శిల్పంలో అపూర్వంగా వ్యాఖ్యానించారు ) కాళిదాసు మాళవికలో ఇదే విషయాన్ని వ్యాఖ్యానిస్తూ నాట్యం చాక్షుష యజ్ఞమన్నాడు యజ్ఞం కర్మకాండ సంస్కృతికి సంబంధించింది. కనుక భరతనాట్యం పూర్వరూపం యాజ్ఞిక క్రతు నర్తనం అది అతీంద్రియ శక్తులను జాగృతం చేసే ఒక దీక్షా విధి ఆటవిక నృత్యం దీనికి సంబంధించిందే నంటాడు యూంగ్.

ఇక్కడ అన్య విషయమైనా ప్రస్తావించుకోక తప్పదు. గర్డీఫ్ అన్న ఒక పాశ్చాత్య మహాయోగి ఆసియా ఖండంనుండి ఈ క్రతునర్తనాలను పాశ్చాత్య దేశాలకు తీసుకొనిపోయి అవి యోగాభ్యాస ప్రక్రియలని ప్రచారం చేసాడట. ఈ యుగారంభంలో (ఆయనకంటె చాలా ముందున్న వేజమ్ బ్లావట్కీ కాలజ్ఞానం చెప్పిందట ముందు ముందొక పాశ్చాత్య యోగి వచ్చి ఆసియా నాట్య కళ యోగ ప్రక్రియగా ప్రచారం చేస్తాడని. తర్వాత అలాగే జరిగిందట. చూ. కెన్నెత్ వాకర్ రాసిన గర్డఫ్ అన్న గ్రంథం) కనుక భరతనాట్య పూర్వ రూపం క్రతునాటం. రాసక్రీడాదులు - జాయపసేనాని ప్రస్తావించిన దేశి నృత్య భేదాలన్ని జానపదకళలే. క్రతు సంబంధాలే కాక పర్వ, సమన్వితాలే.

ఈ నేపథ్యంలో ఈ గ్రంథంలో ప్రథమాధ్యాయం వ్రాయబడటం చాలా మెచ్చుకోదగ్గ విషయం పుట 9లో చెప బడ్డ అంశం చాలా అందమైనది అంటే గొప్ప నిజం పాశ్చాత్య జానపదకళలో కోల్పోయిన దైవీ స్పృహ భారతీయ కళల్లో అంటే భరతనాట్యంలో క్రతురూపం పోలేదు అదేపైన కాళి దాసన్నమాట లాస్యతాండవ భేదంగా వున్న నాట్య వ్యాఖ్యలో శ్రీమదభినవులు- "కొంచెం లాస్యానికే అమ్మవారు సతోషిస్తుంది ఇంత తాండవానికి అయ్య వారానందపడతారు" అన్నమాట రసనాట్యాన్ని తిరిగి క్రతునర్తనానికి లంకె పెట్టడమే ఈ నాట్యం పవిత్రం అతీంద్రియ స్పృహోన్ముఖమైన మానవ నిర్మాణం కనుకనే భారతీయ కళలన్నిటికీ నాట్యమే మూలం శిల్ప- చిత్రలేఖనాదులకు- సాహిత్యానికి భంగిమలేని శిల్పం భారతదేశంలో లేదు ఉన్న శిల్పం పాశ్చాత్య దేశాల్లో లేదు (అక్కడి తీరుని వేరుగా చూడాలి) కళను వేరుచేసేది భంగిమ ఇందుకే నాట్యమంటే రసమే నన్నాడు రసర్షి గుప్తశ్రీపాదులు అంటే నాట్యం సర్వకళాధారమనీ ఆ నాట్యం శివపార్వతుల నుండి- కృష్ణుని నుండి వ్యాపించిం దని చెప్పటంలో (చూ. పుట 35 గంగాదేవి- విషయం) క్రతు సంబంధాన్ని నాట్యం కాపాడుకోవటమేనని తాత్పర్యం

ఇందుకే గంగావతరణ కథవంటి వాటినీ అభినయించే లక్షణం నాట్యంలో ఉంది భరతార్ణవంలో దీని విషయముంది నాట్యం ఆరాధనా విషయంగానే భారతీయుడు భావించాడనటానికి దేవాలయాల్లో దాని ఉనికినిబట్టి గుర్తించాలి (ఇవ్వాళ నాట్యశాలల్లో దీని ప్రయోగ విషయం క్రతు తత్త్వాన్ని త్రెంచుకొన్న ప్రదర్శన) ఇందుకే బాణుని కథలో బాణుడు తన చేతులను నరికినప్పుడు కృష్ణుడు- శివప్రీతిగా నర్తించాడని హరివంశం చెప్పటం- నర్తనం ఆరాధనా విశేషమనటమే తాత్పర్యమేమంటే నాట్యం రసరమ్యమైనా- అది తన పూర్వ కర్మకాండా స్పృహను కోల్పోలేదని- (ముద్రలు వంటివి యోగంలోను- నాట్యం లోనూ ఉండటం- నాట్యం యోగంగా అభినవ భారతి వ్యాఖ్యానించటం శిల్ప విశేషాలు ఎన్నో దీనికి తార్కాణాలు)

జానపద నృత్య లక్షణాలను ఈ గ్రంథకర్త 51వ పుటలో సరిగ్గానే ఉల్లేఖించాడు కానీ 5వ లక్షణం సరిగా వాగ్బద్ధం కాలేదు. ఆటవిక నృత్యం వారి జీవితంలో ఒక అంశం కాదు వారి జీవిత ఆధారసూత్రం 58వ పుటలో ఈ మాట అన్నాడు వారి జీవితమంతా నాట్యమేనని. నాట్యమంటే భావాల

వ్యక్తీకరణను అభినయం ద్వారా చేయటమేకాక- జీవన విధానాన్ని అతీంద్రియ విషయంగా భావించటం కనుకనే అటవికులు వేటాడే ముందుగా జంతువు బొమ్మను రంగులతో భూమిమీద చిత్రించి- దానిని ఈటెతో క్రుమ్మినట్లుగా వ్రాసి- తర్వాత జంతువును వేటాడుతారట ఒకసారి ఒక పాశ్చాత్యుడొక అడవిలో జంతువును కాల్చి చంపితే ఆ అటవికులతనిని దండించబోయారట. ఈ విషయం యూంగ్ వ్రాస్తూ వారి జీవితమంతా క్రతువే మనకది అర్థంకాని భాష అన్నాడు ఈ ప్రేరణ వారి కదలికలో ఉన్నందువల్ల అది నృత్యం సామూహికత నృత్య ప్రధాన లక్షణం కావటంలో చారిత్రక- మానసిక దృష్టి లున్నాయి వారి జీవితం లభ్రదం కనుక కలిసికట్టుగా జీవించటం జానపద మనస్తత్వంతో వ్యష్టి దృష్టిలేదు జానపదుడ చే గ్రామంలోని వారంతా ఒకే వ్యక్తిగా జీవించటం వాడికి మనస్సుందను ప్రవర్తనకు ప్రేరణ హృదయం. కనుక ఉమ్మడి బ్రతుకు క్రతువు వ్యష్టిజీవనం వారి గ్రామిక నాగరికత నుండి ఏర్పడిన శాపం జానపదుడంటె రాసక్రీడలో నర్తించే ఏ వ్యక్తి వ్యక్తికాక సమష్టి ప్రతినిధి అసమిష్టిభావం జానపదం

అనాటి నృత్యాన్ని ఈ గ్రంథకర్త చెప్పిన తీరులో క్రమవిధానముంది సామాన్యంగా గ్రామీణ సంస్కృతి శక్తి దేవతా సంబంధం గ్రంథ సంస్కృతి పురుష సంబంధం మతాల్లో ఆచార్యమతాలు- పీఠాలు ఇవన్నీ acadamic మతాలు. గ్రంథ ప్రాధాన్యం కలవి అపండితులైన జానపద మతం అనుభవ ప్రమాణం తప్ప గ్రంథప్రమాణం కాదు ఇది అమంత్రకం పూజారులు అబ్రాహ్మణులు ఇది వ్రాత్య/వామ/సంప్రదాయంగా ప్రాచీనులు గుర్తించారు. (అథర్వవేదంలో వ్రాత్య సంప్రదాయం గొప్పదిగా స్తుతింపబడినది) ఇక్కడ తమ ఆహార పానీయాలు శక్తికి నైవేద్యంగా అర్పించబడటం వల్ల కల్లు- మాంసం నివేదన వస్తువులు కావటం acadamic మతాల దృష్ట్యా తప్పు గ్రామీణ సంస్కృతిలో వేదసంస్కృతిలో సిద్ధుష్టాలు కనుక వీరి చేష్టల్లో కామ స్పర్శ ఉండటమూ క్రతు విషయమే. కల్లుకోసం చెట్టుకు పెట్టే కత్తిగీత స్త్రీ మర్మాంగం లాగా ఉంటుందన్న (పు 69) మాట వెనుక మనస్తత్వ శాస్త్ర రీత్యా చాలా విచారణ జరగాల్సి ఉంది. వామాచారంగా పండిత బ్రువులు- acadamic ఆచార్యులు కొట్టిపారవేసిందంతా చాలా శాస్త్రీయమైన విషయంగా ఆధునిక పరిశోధనలు వెల్లడిస్తున్నాయి. ఇందుకే జానపద గేయాల్లో బూతు చోటు

చేసుకున్నది క్రతురూప పర్వదినాల్లో ఉచ్చరించిన బూతు- దేవతార్పితంగా భావించుటవల్ల మనిషి మనస్సులో ఒక కెథారిసిస్ కామభావంలో ఉత్కృష్టతా-[1] ఉత్తీరణీకృతి జరిగి- మనస్సు లోపలి పొరలన్ని క్షాళితాలై మనిషిలో సప్రెషన్ లేకుండా పోతుంది ఏకాదమిక్- మతాల్లో సప్రెషన్ ఎక్కువ సన్యాస బ్రహ్మచర్య వ్రతాది రూపాల్లో అది సంభవిస్తుంది ఇందుకే సన్యాసం గొప్ప దనుకొన్న మత ప్రభావంచేత- అదొక సాంఘిక ఉత్కృష్టతగా భావించినవాడు సన్యసించి- మనస్సులో కోర్కెలన్ని చంపుకోవడం వల్ల- క్షాళనం జరగనందు వల్ల- వాడి తరంలో భవిష్యత్తులో వచ్చినవాడు మహావ్యభిచా రవుతున్నాడు మనం వీణ్ణి దోషిగా భావిస్తాం కానీ ఆ దోషం బలవంతపు [2]సన్యాసాన్ని స్వీక రించి సంఘంలో గొప్పగా చెలామణీ అయినవాడి తాత దోషం ఈనాటి తిరుగు బాటంతా ప్రాచీన సంప్రదాయం పేరున జరిగిన సప్రెషన్- తిరగబడటం ఈ దృష్టితో చూస్తే కామక్రతువు అర్థమవుతుంది కామశిల్ప రహస్యం బోధపడు తుంది. కనుక అమాయక గ్రామీణ సంస్కృతిలో బూతుక్రయ రూపాంశం. పది మంది సంతానాన్ని కని సన్యసించటం- లేదా కామాన్ని జయించాలని ఉపన్యసించటం లాంటి ఆత్మవంచనలక్కడ ఉండవు. వారి సంస్కృతి నేటివారి కర్థం కాదు కారణాలనేకం (1) తంత్రమతంలో వామాచారం లౌకిక కామాన్ని దివ్యకామంగా పరిణమింప చేసిన లక్షణముంది దాని మూలాలు ఈ గ్రామ దేవతోత్సవాల్లో ఉంది. పండితులు దీన్ని నిరసించడానికి కారణం అనుభవంలేని పాండిత్యం దృష్టితో తప్ప అన్యం కాదు **The Devine Consort** అన్న గ్రంథంలో- ఈ విషయానికి సంబంధించిన- (గుడిచౌటిక- అన్న వ్యాసంలో) ప్రస్తావనముంది.

68వ పుటలో ఆనాటి నృత్యమెలా ఒక పండుగతో ముడిపడి ఉందో ఈ గ్రంథకర్త ఒక కథ చెప్పారు. దేవతకు ఎనుబోతును బలివ్వడం వెనుక నున్న కథలో మహిషాసురమర్దిని కథ ఎంత అందంగా దాగి ఉందో భావించాలి

---

1. పర్గేషన్ నీచ మనస్సు ఉచ్చ భావనగా పరిణామం పొందే విధానం - క్రియ రూపకళా లక్షణం.

2. ఇందుకే డా॥ ఆనందకుమార స్వామిగారు 'అధ్యాత్మిక గురువు కావాలను కునేముందు నీకు **Intellective Preparation'** వుండా'లన్నారు.

(ఆ కథా పరమార్థమేమిటో వేరే చూచుకోదగింది) ఎనుబోతును నరకటం దాని కుడికాలును తెగిన తలనోట్లో కుక్కటం - తర్వాత ఆ నెత్తుటితో అమ్మ వారికి బొట్టుపెట్టడం -

పోర్మిహిషున్ నిజాంఘ్రిగల బోటన వ్రేల్తుదమట్టుపెట్టిమున్
పేర్మిదదంగమున్ మెదిచి పెట్టిన నెత్తురు బొట్టువోలె - శ్రీ
తిర్మయ వీక్షణం బలికదేశితమునం గల దుర్గ -

అన్న రామకృష్ణుని పద్యాన్ని గుర్తుకు తెస్తున్నది. రాయలసీమలో చాలా దుర్గాల్లో అనేక స్థలాల్లో ఈ మహిషమర్దిని బొమ్మలు చూచాను.

ఈ కథను ఆసాదివారు 9 రోజులు చెప్పటం నవరాత్రోత్సవాలతో సంబంధించదగ్గ విషయమేమో చూడాలి

అసాది ఉరుములు - కీలుగుఱ్ఱం - కోలాటం - అందులో భేదాలు - వీటి వివరణ ఈ గ్రంథంలో చాలా అద్భుతంగా వ్యాఖ్యానింపబడటం చూస్తే కృష్ణా రెడ్డిని కేవలం పరిశోధనేకాక అందులో జీవించే మనస్తత్వం కలవాడని తెలుస్తున్నది. ఇతడు ఈ జానపద సాహిత్యకళా రంగంలో 4, 5 పరిశోధన గ్రంథాలు ముద్రించాడు.

1) ధర్మవరం తాలూకా జానపదగేయాలు 1984
2) గ్రామీణ సంస్కృతి (అనంతపురం జిల్లా జానపదగేయాలు) 1987
3) జానపద కళారూపం - చెక్కభజన 1989
4) జానపద నృత్యకళ 1989

అముద్రితంగా 5, 6 ఉన్నాయి

1) జానపద కళారూపం గొరవయ్యలు
2) జానపద కళారూపం ఉరుములు
3) జానపద కళారూపం కోలాటం
4) జానపద కళారూపం అసాదులు
5) తిమ్మమ్మ మర్రిమాను - బుర్రకథ
6) జానపదుల ఆటలు

ఇదంతా అతనికి విద్యమీద ఉన్న పరిశోధన దృష్టికంటె అందులో జీవించటాన్ని చిత్రించటం కోసం చెప్పబడింది 1) పరిశోధన వేరు 2) అదే తిండిగా - తపస్సుగా బ్రతకటం వేరు తోలుబొమ్మలాటలు రవీంద్రభారతిలో ప్రదర్శించవచ్చు. కాని పల్లెలో చూసిన ఆనందముండదు ఆ వెన్నెల రాత్రిలో - కిరసనాయిలు దీపాల వెల్తుర్లో తెరమీద బొమ్మలు కదలుతుంటే అమాయక - శైశవ మనస్కుడైన ప్రేక్షకుడు ఆకాశం క్రింద మట్టిలో కూర్చుని చూచే ఆనందాన్ని ఆ వాతావరణాన్ని - మనం రవీంద్రభారతిలో కాని, ఆ సినిమా ప్రేక్షకునిలోగాని సృష్టించలేం. మా కృష్ణారెడ్డి పల్లెలో బ్రతికేవాడు ఆ మనస్సు కలవాడు, కనుకనే ఈ విద్యలో బ్రతుకుతున్నాడు.

ఈ గ్రంథం నాల్గు అధ్యాయాల విభజన కలది చివరిదానిలో జానపద నిర్వచనం భారతదేశంలో ఇతర ప్రాంతాల నృత్యరీతులు ప్రస్తావితాలైనాయి, ఇందులో నృత్యాలవంటివీ చర్చింపబడ్డాయి ఇవ్వాళ మనం టి వి లో వీటిని చూస్తున్నాం నగరవాసులు నేర్చుకొని ప్రదర్శించటం వేరు. అసలు సుగాలీలే ప్రదర్శించటం వేరు.

**ఈ పద్ధతి ఇతర రాష్ట్రాల్లోని నృత్య రీతులు - చాలా బృహద్విషయమైనా వ్రాయదగ్గది ఈ గ్రంథకర్త ఈషత్తుగా స్పృశించాడు. భవిష్యత్తులో వ్రాయగలడని ఆశిస్తాను**

2, 3 అధ్యాయాల్లో చాలావరకు రాయలసీమలోని జానపద నృత్యాలే చర్చింపబడ్డాయనుకుంటాను ఇలాగే ఇతర ప్రాంతాల్లోవి గ్రంథస్థం కావాలి.

ప్రాచీన శిల్ప - వాస్తుకళల్లో ఈ జానపద నృత్యాలు కోలాటం వంటివి - హంపి మొదలైనచోట్ల చిత్రింపబడటం చూస్తే శిష్ట శిల్పికి జానపద నృత్యరీతులు ఎంత ఉత్సాహాన్ని కల్పించాయో తెలుస్తుంది ఈ విషయాలు ప్రథమాధ్యాయంలో గ్రంథకర్త చిత్రించాడు.

48 వ పుటలో తండు - తాండవ-తండా శబ్ద విచారణమున్నది. తాండవానికి - తండా జానపద నృత్యానికి సంబంధం స్థాపిస్తే తప్ప తండు - తండా శబ్ద సాహిత్యాన్ని నిర్ధారించలేం అసలీ 'శబ్దం' చాలా విచిత్రమాయా శక్తి.

ఆఫ్రికా గిరిజనుల్లో ములుంగు - శబ్దముంది దాని భావం సూర్యుడని యూంగ్ వ్రాశాడు వరంగల్లు ప్రక్క ములుగు గ్రామముంది ములుగు పాపయారాధ్యులని కవీ ఉన్నాడు ములుగు = ములుంగు అనగలమా? ఏమో నేను శబ్దశాస్త్రిని కాను

ఈ గ్రంథ రచనలో చాలా గొప్ప విషయమేమంటే ఒక్కొక్క నృత్య కళా వివరణానంతరం ఆ కళాకారుల పేర్లు ఊర్లు పేర్కొనటం పరిశోధకునికి వినయం (Honesty) ఉండాలి

వారినుండి తీసుకున్న విద్యను గూర్చి వ్రాస్తూ వారిని కబళించకూడదు చాలామంది విమర్శకులు కవిని కబళించి త్రేణుస్తూ ఉండటం పరిపాటికదా ఆ పద్ధతి ఇతనిలో లేనందుకు సంతోషిస్తూ ఈ రచనా ధారాప్రవాహం కావాలనీ దానికితడు భగీరథుడు కావాలని కోరుకోవడంలో తప్పేమిటి?

భవతు

**ఆచార్య తుమ్మపూడి కోటేశ్వరరావు**



# భరతవాక్యం

ఈ సిద్ధాంత వ్యాసానికిది భరతవాక్యం (epilogue) అంటే ఏ అంశాన్ని సూచిస్తూ చిగిచెర్ల కృష్ణారెడ్డి తన గ్రంథానికి ముగింపు చెబుతున్నారో ఆ తరవాతి అంశమన్నమాట నాటకంలో సూత్రధారి (గాయకుడు) కదా భరతవాక్యం పలుకుతాడు! పరిశోధనలో పర్యవేక్షకుడిది సూత్రధారి స్థానం కాబట్టి ఈ పని చేస్తున్నాను మా కృష్ణారెడ్డి (కృష్ణ అనటం నా అలవాటు) మంచి గ్రంథాన్ని రచించాడని చెప్పడం కోసం ఈ మాటలు వ్రాయడం లేదు. నిజానికి ఇతరులు కృష్ణలోని కళాతృష్ణను, పరిశోధనాతత్పరతను గుర్తించి ప్రశంసించినపుడే అది నాకూ సంతోషదాయకం ఆచార్యులు తూమాటి దొణప్ప గారు రాయలసీమ కళాకారుడిగా కృష్ణకు ఒక ప్రత్యేకమైన చోటును వారి హృదయంలో చూపించబట్టే మావాడు ఈనాడు ఇంతవాడయ్యాడు వారికి నా తరఫున, మా ఆంధ్రభారతి పక్షాన ధన్యవాదాలు, అలాగే ఈ గ్రంథం మూలరూపాన్ని చూసి తగు మార్పులు చేర్పులు సూచించిన ఆచార్యులు బిరుదురాజు రామరాజు గారికి, ఆచార్య నాయని కృష్ణకుమారి అక్కయ్యకీ నా నమస్కారాలు.

ఎందుకంటే ఈ సిద్ధాంత వ్యాసరచన చేస్తున్నప్పటికి నాకూ, మా కృష్ణకూ ఇద్దరికీ జానపద విజ్ఞానం అంటే తెలిసింది అంతంత మాత్రమే భాషావిజ్ఞానం మీద నాకున్న కమిట్‌మెంటుతో గిరిజనుల మీద పరిశోధన చేస్తూ పోగా పోగా జానపద విజ్ఞానమూలాలు బాగా అర్థమవటంవల్ల ఈ థీసిస్ ఇలా కాదు రాసి వుండాల్సింది అని నాకు తెలిసింది తెలుగు విశ్వవిద్యాలయంవారు నిర్వహించిన వర్క్‌షాపులలోను, దేశంలో ఇతర రాష్ట్రాలలో జరిగిన సదస్సులలో పాల్గొన్న కృష్ణకూ తెలిసింది ఫలితంగా దిద్దుకున్న రూపమే ఈనాడు మీ చేతిలో వున్న జానపద నృత్యకళ

ఈ థీసిస్ చదివినవాళ్ళకి కృష్ణ పడ్డ శ్రమ, కళాకారుడుగా అతని నేర్పు, సహకళాకారులతో కలిసిమెలిసి కళను ప్రదర్శించగల ఓర్పు- అన్ని వర్గాల కళాకారుల నుండీ ప్రతి కళా ప్రయోగానికి సంబంధించిన వైధానికం

(methodology), వాద్యాల తయారీ మొదలు- అందులో వాడే పదజాలందాకా మొత్తం పట్టుకురాగల క్షేత్ర పరిశీలన నైపుణ్యం- ఇవన్నీ తెలుస్తాయి. కాని సిద్ధాంతం కోసం రాగారాగా నాగరికచ్ఛాయ ఉన్న నృత్యాలు- అంటూ కొన్నిటిని ప్రస్తావించాడు అక్కడ మాత్రం కొన్ని సందేహాలు రావటానికి అవకాశం వుంది ఆ ప్రశ్నలను నేనే వేసుకుని ఈ నాలుగు మాటలూ రాస్తున్నాను [1]

భరతుణ్ని నాట్యవేద సంప్రదాయ ప్రవర్తకగా గుర్తించటంలోనే జానపద నృత్యకళ మూలాలున్నాయని నాకు ఇటీవల పరిశోధనల్లో తెలియటంవల్ల ఈ విషయాన్ని రాస్తున్నాను మన సంస్కృతి అంతా జానపదమే అని కాదు నేను రాయబోతున్నదాని కర్థం ఈనాడు శిష్టమని మనం గుర్తిస్తున్న భరతనాట్య సంప్రదాయానికి కూడా జానపద మూలాలున్నాయని చెప్పటమే ఇక్కడి నా ఉద్దేశ్యం అందుకే భారతదేశంలో పండితులు- ధనవంతులు ఆదరిస్తే దానికి శిష్టత్వం; పామరులు, బీదసాదలు ఆదరిస్తే- జానపదమవుతుందని- ఈ పరిగణన శాస్త్రీయమని జానపద విజ్ఞాన పరిశోధకులు ఇప్పటికే గుర్తించి ఉన్నారు. కాని మన దేశంలో జానపద విజ్ఞానం పేరిట సేకరణ జరిగినంతగా విశ్లేషణ జరగ లేదు. భాషావిజ్ఞానం లాంటి శాస్త్రీయ శాఖగా ఇంకా "రూపొద్దుకో"లేదు సాహిత్య శాఖలు జానపద విజ్ఞానానికి చోటిచ్చినా 'సవతి' చూపు మాత్రం పోలేదనే గుర్తించాలి. ఈ దృష్టితో చూసినపుడు అలంకారశాస్త్ర నిష్ణాతులకు అనబడేవారికి- భరత సంప్రదాయం అపభ్రష్టమై జానపద నృత్యాలుగా మారినట్టు అనిపిస్తుంది తప్పా- భరతంలో జానపద మూలాలున్నాయంటే ఒక పట్టాన అంగీకరించ బుద్దెయ్యదు ఇది ఇప్పట్లో మార్చగల్గిన దృష్టి కాదనుకోండి అయినా మనం శాస్త్రీయతా దృష్టితో రాయాల్సింది రాయక తప్పదు

* * *

జానపద నృత్యానికి ప్రధానమైనది 'పని'తో దానికి ఉన్న అవిభాజ్య సంబంధం కాలక్రమంలో ఈ పనే తంత్రం (ఆచారం ritual) గా మారి

1. నేను రెండు నెలల క్రితం రాసి పంపిన పీఠిక పోయింది- తపాలాశాఖ వారి పుణ్యమా ! అని - మరి ఆ మూడ్ రాకపోవటంవల్ల కేవలం అకడెమిక్‌గా ఈ మాటలు రాస్తున్నా D L O. లో పడి వున్న నా పీఠికను భవిష్యత్ పరిశోధకులైనా బయటపెట్టాలి.

పోయింది అంచేత పూజాపునస్కారాది రూపంలో ఏదో ఒక మతాచారంతో నృత్యకళారూపాలు ముడిపడి కనిపిస్తాయి కాని భరతనాట్యం చేసే అమ్మాయికి కాని, నేర్పే గురువుకి కాని భరతం వెనుక కూడా ఇలాంటి 'తంత్రం' ఒకటి వుందని గుర్తించకపోవటంలోనే అది 'కళ'గా మిగిలిపోయి 'శిష్ట' ముద్ర వేసుకొంటోంది. నటరాజస్వామి బొమ్మకు నట్టువాంగానికి గురువుకి నమస్కారాలు చెయ్యటం లేదా అంటే వుండొచ్చు- కాని అదికాదు అసలు భరతనాట్య మూల తంత్రం అసలు ఈ పీఠిక చదివి అలాంటి తంత్రం ఒకటుందని అందరూ గుర్తిస్తే అదే చాలు దీనిద్వారా మనం సాహిత్యాన్ని చూస్తున్న దృష్టిలో ఏ పిసరంత మార్పు వచ్చినా అది మహావిప్లవంగా సంతోషిస్తాను 1

* * *

భరతుడు ప్రవత్తి చేసిన నాట్యం ఒక యజ్ఞం. అందుకే ప్రేక్షా గృహ నిర్మాణాన్ని ఒక బ్రహ్మాండమైన ప్రక్రియగా నిరూపించాడు. తొలుత భూవిభాగాన్ని పరీక్షించాలి అది ఛవుడులేనినేల కృష్ణగౌరవర్ణం కల్గిందీ కావాలి తొలుత భూశోధనం చెయ్యాలి నాగలితో దున్నాలి పుష్యనక్షత్రయుక్తమైన కాలాన్ని చూసుకొని పిష్టరంజనం వున్న శుక్లసూత్రాన్ని పట్టాలి చర్మసూత్రం పనికిరాదు. ఆ దారులో ముడులుండరాదు. సూత్రం సాచిపట్టాలి. మధ్యలో తెగిపోకూడదు. అలా తెగితే ఏమవుతుందో భరతుడు ఇలా చెప్పాడు:

> అర్ధచ్ఛిన్నే భవేత్ సూత్రే స్వామినో మరణం ధ్రువమ్
> త్రిభాగచ్ఛిన్నయా రజ్జ్వా రాష్ట్రకోపో విధీయతే
> ఛిన్నాయాంతు చతుర్భాగే ప్రయోక్తుర్నాశ ఉచ్యతే
> హస్తాత్ ప్రభ్రష్టయా వాపి కశ్చిత్త్వపచయోభవేత్
>
> (నాట్యవేదం శ్లో. 63-68 పు 40)

ఈ 'సూత్రపట్టు' మధ్యలో తెగిపోతే ప్రేక్షాపతి (స్వామి = రాజు) కి

---

1. ఈ దృష్టితో నేను ఇటీవల రాసిన గ్రంథం 'శిష్టసాహిత్యంలో జానపదాంశాలు' అన్నది (1988) ప్రస్తుతం ముద్రణలో ఉంది రామాయణ భారతేతిహాసాలలో కూడా మూలాంశాలు జానపదాలే అని నిరూపించిన గ్రంథమది.

మరణం కలుగుతుంది మూడోవంతు తెగితే రాజ్యానికి అనర్థం నాల్గోవంతు తెగితే ప్రయోక్త (నాట్యాచార్యుడు) కు నష్టం చేతినుంచీ జారిపడితే అనర్థం ఏదో ఒక రూపంలో జరుగుతుంది ఈ విధి నిషేధాల్ని (taboos) అంటారు ఇప్పుడు సూత్రధారుడనే శబ్దం ఎక్కడి నుంచీ పుట్టిందో చూడండి

ఇక్కడ మనకు ప్రధానమైన అంశం భూశోధనం జరపటం వగైరాలు ఎందుకు చేయాల్సి వచ్చిందంటే తొలుత భరతుడు చేసిన నాట్యప్రయోగం విధ్వస్తమయింది అపుడు బ్రహ్మ విశ్వకర్మను పిలిపించి నాట్యమండపాన్ని ఏ దోషాలూ లేకుండా నిర్మించమంటే జరిగిన తంతు ఇది తొలుత చేసిన ప్రయోగం ఎందుకు విఫలమయిందో చూద్దాం

భరతునికి వంద మంది కొడుకులు వారికే భరతుడు నాట్యాన్ని తొలుత నేర్పాడు వారి పేర్లను గమనిస్తే (తండువు - తాండాయని - వితండ్య - తాండ్య) అన్న నాలుగు పేర్లు మాత్రం చాలా చిత్రంగా కనిపిస్తాయి 'తండ' శబ్దం బృంద సూచకం 'తండు'-డు శబ్దంలో కూడా ఇదే వుంది[1] అంటే గిరిజన దశ నుంచి- జానపదుడుగా- వ్యవసాయం చేపట్టి- పంటలు పండించిన దశలో పుట్టినదన్నమాట ఈ భరత నృత్యసంస్కృతి ఈ మాట సాధారణంగానే అంటున్నాను

ఆటవికులకు- గిరిసానువులు- పశువులు ఆధారం అందుకే బంజరాలు ఆనాటినుంచీ ఈనాటిదాకా కొండ చరియల్లోనే నివసిస్తున్నారు ఇదే వారిలో జీర్ణించిపోయిన వ్రజ సంస్కృతి. అందుకే హరివంశంలో శ్రీకృష్ణుడు తన జాతివారు చేస్తున్న ఇంద్రమఖాన్ని కాదని 'గిరి'మఖాన్ని చేయమన్నాడు రైవతకోత్సవం భారతంలో కూడా సుప్రసిద్ధమైన ఘట్టం రైవతం ఒక కొండ దానిచుట్టూ చేరి గోపబృందం బాగా తాగి ఎలా గంతులు వేశారో నన్నయ చాలా అందంగా వర్ణించాడు కూడా.

---

1 బంజారాల సెటిల్‌మెంటులను 'తాండా' అంటారు గ్రామం కన్నా చిన్న మైనవి- సంచార గ్రామాలివి వారిలో బృంద నృత్యమే చాలా ప్రధానం. తాండవంలో మొదట ప్రమథగణాలతో కూడిన బృంద నృత్యమే వుండి వుండాలి.

ఇంద్రోత్సవాన్ని కృష్ణుడు ఎందుకు కాదన్నాడు అంటే కాలక్రమంలో ఆటవికులు కూడా వ్యవసాయం చేస్తూ- జలం కావాలి- కాబట్టి మేఘాలు కావాలి- అంచేత ఇంద్రుడికి పూజ చేశారు ఇంద్రుడి వజ్రాయుధానికి పూజ చేయటమే ఈ ఇంద్రమఖం అది మనకు సంప్రదాయం కాదని వృద్ధులవల్ల 'విందుము' అని కూడా వృద్ధప్రమాణాన్ని ఉదాహరిస్తాడు కృష్ణుడు అంటే వారిని మళ్ళీ పాత ఆచారంవైపు కృష్ణుడు తిప్పాడన్నమాట

ఇప్పుడు భరతునికి బ్రహ్మదేవుడు ఏం బుతున్నాడో చూద్దాం 'ఇదిగో గొప్ప సమయం వచ్చింది ఇది దేవేంద్రుని పతాకోత్సవ సమయం ఇప్పుడు ఈ నాట్యవేదాన్ని ప్రయోగించండి ఈ పతాకోత్సవం 'ధ్వజమఖ(హం)' అనే పేరుతో ప్రసిద్ధంగా వుంది భాద్రపద శుక్ల ద్వాదశినాడు దేవేంద్రుడు అసురుల పైన విజయాన్ని పొందాడట[1]

సరే! భరతునికి పూజ చేసుకోవడానికి సాక్షాత్తు ఇంద్రుడే తన ధ్వజాన్ని (జర్జరం = వజ్రం) ఇచ్చాడు దానికి పూజ జరిగింది ఇంద్రుడు ఎందుకిచ్చాడు! అంటే ఇలా ఇంద్రవిజయాన్ని రాక్షస పతనాన్ని నాట్యంలో చూసి దైత్యులు సంక్షోభం పొంది అదృశ్యరూపులై విఘ్నాలు కల్గించారు సపరివారంగా సూత్రధారుడు విధ్వంసమయ్యాడు దీనికి కారణం ఏమిటా అని ఇంద్రుడు ఆలోచించగా నాట్యమండపం- దుష్టలక్షణ భూయిష్ఠంగా వుండటమే కారణం అని గుర్తించి అపుడు తన వజ్రాయుధంలో అసురుల్ని నిర్జించి తన ఆయుధాన్నే పూజకోసం ఇచ్చాడన్నమాట ఈ ఇంద్రుడే ఉపరిచరవసువుకి కూడా తన ధ్వజాన్ని (వేణుయష్టిని) ఇచ్చాడని భారతం చెబుతోంది దీన్నంతా సమన్వయించుకుని ఆలోచిస్తే వ్యవసాయ సంస్కృతిలోనే భరతవేదం పుట్టిందని సులభంగా అర్థమవుతుంది. ఈ అంశంలో బలరాముడి ఆయుధం 'హలం' (నాగలి) కావటాన్ని సంధానించుకుంటే వజ్రం = ధ్వజం = నాగలిగా ఒక రేఖ గీయవచ్చు శిలప్పదికారంలో ప్రస్తావించపడ్డ 'శక్రసవం' (ఇంద్రోత్సవం)తో ఈ అర్థాన్ని సమన్వయం చేసుకొని యూరోప్ దేశాలలో ఉన్న '**May pole**' ఉత్సవ సంబ

---

1 చూ. నాట్యవేదం పుట 18. ఆట అని ఎక్కడ ప్రయోగిస్తామో అక్కడ 'ఐతిహ్యం' (**legend**) వుందని అర్థం.

రాలతో పోల్చి చూసుకుంటే వ్యవసాయ సంస్కృతి నేపథ్యం భరత సంప్రదాయానికి ఎలా వెన్నెముకగా వుందో తెలియడం లేదూ?

*　　　　*　　　　*

ఈ కారణాలవల్ల నాట్యమండప నిర్మాణం ఒక యజ్ఞం కావాల్సి వచ్చింది ఈ మండపంలోకి జైనసన్యాసుల్ని, వికలాంగుల్ని, బౌద్ధ పరివ్రాజకుల్ని రానివ్వ కూడదట ఆ రాత్రి నానా భోజనపదార్థాలతో 'బలి' జరపాలి తరువాత స్తంభ స్థాపనం చెయ్యాలి ఇందులో చలన- వలన- కంపాలన్న మూడు దోషాలు రాకూడదు స్థాపనం చేస్తున్నపుడు స్తంభం చలిస్తే దేశంలో వర్షాలుండవు వలనం (తిరుగుడు) కలిగితే మృత్యుభయం తప్పదు కంపనం (Shaking) వుంటే ఇతరులవల్ల భయం కలుగుతుంది- నాల్గు వర్ణాలవారికి నాలుగు స్తంభాలు పాతాలి బ్రాహ్మణ స్తంభస్థాపన సమయంలో బ్రాహ్మణులకు గోదానం ఇవ్వాలి ఇతర స్తంభాలు పాతినప్పుడు కర్మకారులకందరికి భోజన సంతర్పణ జరగాలి అప్పుడు రంగపీఠం పక్కన కల్లుకుండ (మత్తవారణి)[1]ను ఉంచాలి ఇంకా ఇలాంటి ఆచారాలు మరికొన్ని ఉన్నాయి

ఇలాంటి నాట్యగృహంలో ఏడుదినాలు జపశీలులైన బ్రాహ్మణులతో గోవులు నివసించాలి తరువాత నాట్యాచార్యుడు కొత్త బట్టలు కట్టుకొని మూడు రోజులు ఉపవాసం వుండి మహాదేవుడి మొదలు భూతపిశాచాది గములదాకా వున్న సర్వ జీవరాసులకూ- అధిదేవతలకు నమస్కరించాలి

ఇట్లా దేవపూజ అయిన పిమ్మట జర్జరాన్ని దించి పూజించాలి ఆ జర్జరంలో సర్వదేవతాగములనూ ఆవాహనంచేసి అయా నైవేద్యాలు సమర్పించాలి మధుపర్కంతో బ్రహ్మను, పాయసంతో సరస్వతిని, కుడుములతో శివవిష్ణు మహేంద్రాదులను, మధుపాయసాలతో విశ్వేదేవతలను, అపూపమోదకాలతో యను మిత్రులను, ఆజ్యక్షీరాలతో పితృపిశాచోరగులను, పక్వాన్న మద్యమాంస ఫలాసవాలతో భూతసంఘాలను అర్చించాలి రక్షోగములను చేపలతోకూడిన అన్నంతోనూ, రాక్షసులకు సురామాంసాలతోనూ ఆరాధించాలి చేపలతో, పిష్టభక్ష్యలతో సరిత్సాగరాలను సేవించాలి

---

1 'మత్తవారణి' భావం స్పష్టం కావటం లేదని వ్యాఖ్యాతలు (చూ నాట్యవేదం పుట. 44)

బ్రాహ్మి, మహేశ్వరి మొదలైన నాట్యమాతృకలకు కూడా అర్చన జరగాలి. ఆ తరువాత ఉదకకుంభాన్ని (నీటికడవ) రంగమధ్యలో ఉంచాలి జర్జరమంత్రాల్ని పఠించి దేవతా సమర్పణం పూర్తి అయ్యాక నాట్యాచార్యుడు ఆ కుంభాన్ని పగలగొట్టాలి ఆ కుండ పగలకపోతే స్వామికి శత్రుభయం పగిలితే శత్రునాశం అంతంలో రంగమండపంలో జ్యోతి వెలిగించాలి వాద్యాలు మోయించాలి. అదొక భయంకర యుద్ధంలా వుండాలి రక్తస్రావం జరగాలి ఇలా కావటం జనపదానికి శ్రేయస్సు [1]

ఇదంతా పల్లెల్లో రూపాంతరాలలో ఇప్పటికీ ప్రతి పండుగతోను, పబ్బం లోనూ ఉన్న ఆచార తంత్రమే కాని రవీంద్రభారతిలో 'నాట్యం' ప్రయోగించే కళాకారులకి మాత్రం ఇది తెలియదు అందుకే వారు శిష్టులుగా మిగిలిపోయారు. ఈ కళ్ళతో ఈ గ్రంథం చదవాలని ప్రార్థిస్తూ సెలవు

అనంతపురం
18-10-89

—హెచ్. ఎస్. బ్రహ్మానంద

1. జానపదమ నేమాట నాట్యవేదంలోనిదే (చూ పు. 67) - జమ్ము మదక మాధవరామశర్మగారి అనువాదాన్ని ఆధారంగానే ఈవిషయాల్ని రాశాను

అక్షరజ్ఞానం లేకపోయినా అక్షయమైన
జానపద కళాసంస్కృతికి పునాదులువేసి
భారతీయ జీవన విలువల్ని ప్రతిబింబింప
చేస్తూ, జాతి జీవనవైఖరిని, ఆధ్యాత్మిక
సాంఘికాచారాల సుగంధాల్ని
తమ నృత్యకళా సంప్రదాయం ద్వారా
ప్రపంచానికి వెదజల్లిన
జానపద కళాకారులకూ—,
జానపద కళలకు ప్రజల హృదయా
లపై పెద్ద పీటనువేసి జానపద
కళావికాసానికి తోడ్పడిన
జానపద కళావిమర్శక శేఖరులకు—
హృదయపూర్వక నమస్సుమాంజలులతో

## సమర్పితం



# విషయసూచిక

# కృతజ్ఞతా కుసుమాంజలి

'జానపద నృత్యకళ'పై ప్రప్రథమంగా పరిశోధన చేయడానికై అవకాశం కల్పించిన శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయానికి, ఆంధ్రభారతికి కృతజ్ఞతలు

నా పరిశోధనకు పర్యవేక్షకులుగా వ్యవహరించడమేగాక పరిశోధనకు ఒక రూపాన్ని కల్పించి నిర్మాణాత్మకమైన సూచనలిచ్చి నన్ను నడిపించి పరిశోధన సఫలీకృతం కావడానికి కారకులూ, గురువులూ అయిన డాక్టర్ హెచ్ హెస్. బ్రహ్మానంద గారికి ..

ఈ వ్యాసరచనా విషయంలో అమూల్య సలహాలనిచ్చి సందేహాలను తొలగించి శిష్యవాత్సల్యంతో ప్రోత్సహించిన ఆంధ్రభారతి అధ్యాపక బృందానికి....

నృత్యాన్ని గూర్చి తమ అమూల్యమైన సలహాలనిచ్చి పరిశోధనకు తోడ్పడ్డ అమృతమూర్తులు కళాప్రపూర్ణ డాక్టర్ నటరాజ రామకృష్ణగారికి ..

నా పరిశోధన వ్యాసంగంలో అడుగడుగునా వాత్సల్యంతో ప్రోత్సహిస్తూ నాలో కొత్త భావాలను నింపడమేగాక వెన్నుతట్టి నడిపిస్తున్న ఆచార్య బిరుదురాజు రామరాజుగారికి, ఆచార్య సి నారాయణరెడ్డిగారికి, ఆచార్య తుమ్మపూడి కోటేశ్వరరావుగారు, ఆచార్య నాయని కృష్ణకుమారిగారికి ఆచార్య పి యశోదా రెడ్డిగారికి

పరిశోధనా సిద్ధాంత గ్రంథానికి న్యాయనిర్ణేతలుగా వ్యవహరించిన తెలుగు దేశపు జానపదబ్రహ్మ ఆచార్య బిరుదురాజు రామరాజుగారికి, రాయలసీమ జానపదబ్రహ్మ ఆచార్య తూమాటి దొణప్పగారికి, ఆచార్య బి నాగయ్యగారికి హృదయపూర్వక నమస్సుమాంజలులు.

ఈ గ్రంథానికి ఆశీస్సులనందించిన ఆచార్య బిరుదురాజు రామరాజు

గారికి, ఆచార్య తూమాటి దొణప్పగారికి, ఆచార్య సి నారాయణరెడ్డిగారికి, ఆచార్య నాయని కృష్ణకుమారిగారికి ఆచార్య తుమ్మపూడి కోటేశ్వరరావుగారికి డాక్టర్ హెచ్ ఎస్ బ్రహ్మానందంగారికి కృతజ్ఞతాభివందనములు

పరిశోధనకు అవసరమైన గేయసాహిత్యాన్ని వినిపించడమేగాక నృత్యాల్లోని వివిధ భంగిమల్ని ప్రదర్శించి వివరించిన జానపద నృత్యకళాకారులకు, కావలసిన గ్రంథాలను సమకూర్చి సహకారాన్నందించిన మిత్రులు డాక్టర్ ఋక్నుద్దీన్, బి నారాయణరెడ్డిగార్లకు, క్షేత్రపర్యటనలో సహకరించిన గ్రామాధికారులకు, జానపద కళాకారులకు, ముఖచిత్రాన్ని తయారుచేయడంలో తన సేవల నందించి తోడ్పడ్డ ప్రముఖ చిత్రకారులు శ్రీ చంద్ర, శ్రీ కాళప్ప గార్లకు, గ్రంథాన్ని ముచ్చటగా ముద్రించి యిచ్చిన శ్రీ లక్ష్మీవేంకటేశ్వర పవర్ ప్రెస్ యాజమాన్యానికి, కార్మిక సోదరులకు హృదయపూర్వక ధన్యవాదములు

—రచయిత

# ఉపోద్ఘాతం

జానపద నృత్యకళ మీద పిహెచ్ డి చేయటం ఇదే మొదలు ముందు వేసిన బాట లేకపోవటంవల్లా, సిద్ధాంతపరంగానూ, విశ్లేషణపరంగానూ చాలా సమస్యల్ని ఎదుర్కొని ఇరవై సంవత్సరాల జానపద రంగానుభవంతో ఐదు సంవత్సరాల పరిశోధన ప్రవేశంతో ఈ గ్రంథాన్ని తయారుచేయగలిగాను

శ్రీ నటరాజ రామకృష్ణగారు మొదలైనవారు ఆంధ్రుల నృత్యకళ మీద చాలా విస్తారంగా వ్రాశారు గిరిజన నృత్యం- జానపద నృత్యం ఇవి శిష్టనృత్య రీతులకన్నా ఎలా భిన్నమో వివరించడాన్ని ఆయన ఒక పనిగా పెట్టుకోలేదు ఇతర గ్రంథాల్లో కూడా ఈ ప్రసక్తి అంతంత మాత్రమే కనిపిస్తోంది అందువల్ల **Joann Wheeler Keallinohomoku, Frojesh Banerji** ల ప్రతిపాదనలను ఆధారంగా గ్రహిస్తూ, నృత్యపరిణామంలో రెండు ప్రధాన దశలున్నాయని ప్రతిపాదించటం జరిగింది (చూ నాల్గవ అధ్యాయం, పుట 198) 1) మౌలిక దశ, 2) అభ్యస్థ దశ వీటి నాధారంగా గిరిజన నృత్యం జానపద నృత్యం కన్నా, జానపద నృత్యం శిష్టనృత్యం కన్నా ప్రాచీనమని గుర్తిస్తూ 'నృత్త - నృత్య - నాట్య' పరిభాషను ఈ దశలతో సమన్వయం చేసేవిగా నిరూపించటం జరిగింది ఇలా జానపద నృత్యంలోని సంధిలక్షణాన్ని (గిరిజన - శిష్ట లక్షణాల్ని రెంటిని కలిగి ఉండటం) గుర్తించాక అసలు జానపద నృత్యం ఎందుకు పుడుతుందో అర్థం చేసుకోవాల్సి వచ్చింది అందుకే ఈ సిద్ధాంత వ్యాసానికి మౌలిక ప్రతిపాదనలన్ని మొదటి అధ్యాయంలో చేశాను ఆ విధంగా ఐదు రకాల నృత్యమూలాలను ప్రతిపాదించటం జరిగింది. ఆంగిక- మానవ పరిణామ సంబంధ- చారిత్రక- పౌరాణిక- నాట్యశాస్త్ర (ఒకటవ అధ్యాయం - పుట 1-46) మూలాలు రెండవ అధ్యాయంలో ఆంధ్రదేశంలో కనిపించే ఆటవిక నృత్యరీతుల్ని సమీక్షించాను.

జానపద నృత్యంలో అనుస్యూతంగా వస్తున్న గిరిజన నృత్యలక్షణాలను గుర్తించటం జరిగింది. మూడవ అధ్యాయంలో జానపద నృత్యభేదాలను గూర్చి

వివరించాను ఈ అధ్యాయం జానపద నృత్యకళను గురించి సమగ్రంగా వివరిస్తుంది ప్రతి నృత్యాన్ని ఈ క్రింది ఆరు అంశాలను ఆధారంగా చేసుకొని వివరించటం జరిగింది

1 నేపథ్యం - ఆహార్యం
2 వాద్యాలు - సంగీతం
3 పాట - రాగం - తాళం (గతి)
4 పల్లవి
5 చరణాల సంఖ్య - నృత్యగతిలో భేదం
6 శ్రోతలు - ప్రతిక్రియ

ఇలా వివరించటంవల్ల రెండు ప్రయోజనాలు సాధించటం ఉద్దేశ్యం.

1 జానపద విజ్ఞానంలో భాగంగా నృత్యాన్ని చూడటం.
2 కేవలం వినోదం కోసం కాకుండా ప్రయోజనవంతమైన కళా రూపంగా నృత్యకళ ఎలా జీవిస్తుందో చెప్పటం.

చివరి అధ్యాయంలో జానపద నృత్యనిర్వచనం, మొత్తం భారతదేశం లోని నాగరక ఛాయలు కల్గిన నృత్యాల్ని గూర్చి వివరించాను.

ఉపసంహారంలో భవిష్యత్తులో చేయతగిన పరిశోధనాంశాలను గుర్తిస్తూ కళారంగానికి మనం ఎలా ఋణపడి ఉన్నామో వ్రాయటం జరిగింది

—రచయిత



# క్షేత్ర పరిశోధన

నా యం ఫిల్ సిద్ధాంత వ్యాసరచన కోసం ధర్మవరం తాలూకాలో పర్యటించిన గ్రామాల్లోనే జానపద నృత్యరీతుల కోసం కూడా పర్యటించాను ప్రతి గ్రామంలోనూ ఆయా కళాకారుల్ని కలిసికొని రోజుల తరబడి వారిదగ్గర విషయాలను సేకరించి వివిధ భంగిమలను గుర్తించి ఆయా సందర్భాలలో వారితోపాటుగా పాల్గొని సేకరించిన అంశాలే ఈ గ్రంథంలో ప్రదర్శించాను వీలైనంతవరకు ఫోటోలను కూడా తీశాను వీటిని ఆయా నృత్యాల దగ్గర పొందుపరచటం జరిగింది

ఆయా ప్రక్రియను గూర్చి చర్చించేటప్పుడే ఆయా కళాకారుల వివరాలు కూడా పొందుపరచటం జరిగింది కీలుగుర్రం, బుర్రకథల కళాకారులు ఈ తాలూకాలో లేరు వేరే ప్రాంతాల నుంచి ఇక్కడికి వచ్చి వాటిని ప్రదర్శిస్తారు కాబట్టి ఆ వివరాలు ఇవ్వలేదు

ధర్మవరం తాలూకాను చెన్నేకొత్తపల్లి, పుట్టపర్తి తాలూకాలుగా విభజించారు ఇపుడు ధర్మవరం తాలూకాలో 105 గ్రామాలున్నాయి వీటిలో బ్రిటిష్ వారి పాలన ప్రకారం మూడు సోత్రిం (శోత్రియం) గ్రామాలున్నాయి (చంద్రాయునిపట్నం - తిరుమలాపురం - కొండమనాయునిపాలెం)

ధర్మవరం, తాడిపత్రి ఫిర్కాలున్నాయి కానీ ఇపుడు మండలాలు రావటంతో మూడు మండలాలుగా ధర్మవరం తాలూకాను విభజించారు (ధర్మవరం - బత్తలపల్లె - తాడిమర్రి)

ఈ తాలూకాలో 80 గ్రామాలున్నాయి 75 కుగ్రామాలున్నాయి ఈ గ్రామాలన్నింటినీ తిరిగాను కుగ్రామాలు కొన్నింటిని తిరిగాను గ్రామాల వివరాలు 1) అప్పరాజుచెరువు-గుమ్మళ్ళకుంట, 2) అగ్రహారం యం - పత్రపల్లి - శివంపల్లి, 3) ఓబుళాపురం-విశ్వనాథపురం-కొడేకండ్ల, 4) కనుబుతూరు-కామిరెడ్డిపల్లి-పోతుకుంట, 5) గొట్లూరు-ఎడన్నపల్లి-గొల్లపల్లి, 6) గరుడనపల్లి-

జలాలపురం, 7) చిగిచర్ల-చింతపల్లి, 8) చిన్నకోట్ల-మొగిలిచెట్లపల్లి, 9) చిన్న చిగుళ్ళరేవు-మర్రిమేకలపల్లి, 10) చెల్లోపల్లి-కాటమకుంట్ల-పత్రాపురం-నల్లబోయిన పల్లి, 11) తుమ్మల-మల్లేనిపల్లి-మాలగుండ్లపల్లి, 12) తాడిమర్రి - జగన్నాథ పురం-బంగారంపేట-మేడిమేకలపల్లి, 13) దంపెట్ల-ఉప్పరపల్లి, 14) ధర్మ వరం-ఓన్నూరు, 15) నిడిగల్లు-నారసింపల్లి 16) పిన్నదరి-భూమరాయునిపేట-ఏకుమాదంపల్లి, 17) పెద్దకోట్ల గుడ్డ పల్లి, 18) పెద్ద చిగుళ్ళరేవు హుసేన్ పురం, 19) బత్తలపల్లి-పోట్లమర్రి-గంటాపురం, 20) మల్లాకాల్వ-తుంపర్తి. 21) మాల్యవంతం-అనంతసాగరం - చీమలనాగేపల్లి - వెంకటగారిపల్లి, 22) ముష్టూరు - సంజీవపురం - లింగారెడ్డిపల్లి - యర్రాయపల్లి, 23) రావులచెర్వు-చిన్నూరి బత్తలపల్లి-ఆకుతోటపల్లి-ధరుంపూర్, 24) రాగంపల్లి 25) రేగాటిపల్లి-ముచ్చురాం-సీతారాంపల్లి, 26) సంగాల-వరదాపురం - సుగాలితాండా-జ్వాలా పురం-తంబాపురం, 27) సుబ్బరావుపేట

ధర్మవరం చరిత్రకు సంబంధించిన విషయాలు ఎన్నో ఉన్నాయి గ్రామ నిర్మాణాన్ని, చెరువు నిర్మించడానికి సంబంధించిన రకరకాల జానపద కథలు కూడా ప్రచారంలో ఉన్నాయి నా "ధర్మవరం తాలూకా జానపదగేయాలు" గ్రంథంలో వివరించాను

—రచయిత



# నృత్యకళాతత్వం

కళారూపంగా నృత్యం ఎప్పుడూ చావదు కళగానే కాకుండా సామాజికమైన ఆచారం(తంత్రం)గా అది పునర్జన్మను పొందుతూనే ఉంటుంది ఎప్పటికప్పుడు ఆనాటి ప్రజల అంతరాత్మల స్పందంగా, నిత్య నూతనంగా బయటపడుతూనే ఉంటుంది

Dancing as an art, we may be sure, cannot die out but will always be undergoing a re-birth, not merely as an art, but also as a social custom It perpetually emerges afresh from the soul of the people

*(Havelock Ellis in the Dance of Life)*

# మనిషిలోని నృత్యశీలత

మనిషిలోని నృత్యశీలత చాలా సహజమైంది. చరిత్ర ఎంత ప్రాచీనమో అంత ప్రాచీనమైంది. కొన్ని కోట్ల సంవత్సరాల మానవ(పరిణామ)చరిత్రలో పరిణమిస్తూ వచ్చిన జీవ పదార్థ నైజం 'నృత్యం'. విశ్వాంతరాళంలోని గోళాల నడుమ ఒక నిర్దిష్ట క్రమ విన్యాసంతో కూడిన గతి చలనం ఉంది. అలా ఏర్పడిందే మనిషిలోని సహజమూ అనభ్యాస్తమూ అయిన 'నృత్యకళ' విశ్వాంతరాళంలో జరిగే ఈ ఖగోళ చలనమే మన కంటికి రేయింబవళ్ళను సృష్టిస్తోంది. కాలంతో ముడిపడిందే మనిషిలోని క్రియాశీలత-అంటే పుట్టిన మొదలు గిట్టేదాకా మానవుడి కార్యకలాపాలన్నీ దీన్ని గుర్తిస్తే మానవుడి జీవితంలోని గతి భిన్న చారిత్రక దశల్లో సామాజిక రంగాల్లో పొందుతూ వచ్చిన ప్రతీకాత్మక ప్రతిఫలనమే 'నృత్యం'గా అర్థం చేసుకోవచ్చు. నడిచేటపుడు రెండు కాళ్ళను ప్రపంచంలోని ఏ మానవుడు ఒకేసారి కదిలించడు. అలా కదిలిస్తే గెంతటం అవుతుంది. కానీ నడక కాదు. ఇక్కడే మానవుడిలోని గతి ప్రథమంగా బయటపడేది. చుట్టూ వున్న ప్రతి జీవరాశిలోనూ ఉన్న కదలికే మనిషిలోని క్రమబద్ధమైన నడకగా పరిణతిని పొందింది. బుద్ధి జీవిగా వికసించడంతో పాటు మానవుడు తన నడకను అధినయంగా మార్చుకోగలిగాడు. కేవలం అంతరికమైన గతికి అభివ్యక్తీకృతిగా వున్న నడక మానవుడిలోని ఆలోచనల్ని ప్రకటించే అభినయమైంది. ఆటవిక జాతుల్లో కనిపించే నృత్యం [నృత్తం] విశ్వాంతరాళంలోని ఖగోళాల గతిలాంటిది. మానవుడు నడుస్తున్నపుడు కుడి కాలును ఎడమ చేతిని, ఎడమ కాలును కుడి చేతిని వేరువేరుగా ఒక్కొక్కసారి ముందుకీ వెనక్కీ ఆడించడం లాంటిది. జానపదుల్లో నాగరికుల్లో కూడా ఈ చేష్టాత్మక అభివ్యక్తి వున్న క్రమంగా మానవుడిలో ఎదిగిన సామాజిక చారిత్రక తాత్త్విక దృక్పథాన్ని ఆవిష్కరించే ప్రయత్నం కూడా కన్పిస్తుంది. ఇక్కడే నడక అభినయంగా మారుతోంది. అందుకే ఆదిమ నృత్యాలంత సహజంగా కాకుండా జానపద నృత్యాల్లో అన్నీ కాకపోయినా కొన్నైనా నేర్చుకోబడుతున్నాయి. కానీ

ఈ నేర్చుకోవటం శిష్ట నృత్య సంప్రదాయాల్లోని శాస్త్ర జ్ఞాన సంపాదనా లాంటిది కాదు నృత్యకళను మొత్తంగా గురువు ద్వారా నేర్చుకోవటం లాంటిది ఇక్కడ శాస్త్రం-ప్రయోగం అన్న తేడా లేదు గురువుతో పాటు శిష్యుడు కూడా వేదం చదివి నేర్చుకోవటం లాంటిది.

---

## పాద సూచికలు

1 రెండు కాళ్ళు ఒకేసారి కదిలించే గుణం పిచ్చుక(గువ్వ)ల్లో ఉంది దీనికి సంబంధించిన కథ ఇలా ఉంది మొదట మనిషికి రెండు కాళ్ళను ఒకే సారి కదిలించే గుణం ఉండిందట. అపుడే గువ్వలు చూసి మనిషి నడకను అవి తీసుకొని మనిషికి మామూలు నడకను ఇచ్చాయట ఆనాటి నుండి జానపదులు ఇళ్ళ ముంగిట ధాన్యాన్ని గువ్వలు తింటున్నా వాటిని అదిలించరు అంతేగాక గువ్వలకోసం తలవాకిట ఉన్న కంకుల్ని వ్రేలాడదీస్తారు

2 అన్ని రకాల నాట్యభేదాల్ని 'నృత్యం' అనే సామాన్య పరిభాష క్రింద ఇక్కడ చర్చిస్తున్నాను భేదాలు తర్వాత పుటల్లో స్పష్టం చెయ్యబడ్డాయి.

# ఒకటవ అధ్యాయం

# నృత్య మూలాలు

## (అ) ఆంగికమూలాలు

ఆంగికం భువనం యస్య
వాచికం సర్వ వాఙ్మయమ్
ఆహార్యం చంద్రతారాది
తం వందే సాత్త్వికం శివమ్ [నాట్యశాస్త్రం]

ఈ సృష్టిలోని జీవరాసుల కదలికలన్నీ పరమశివుని యొక్క ఆంగికాభినయాలు సృష్టిలో వివిధ ధ్వనులన్నీ శివుని యొక్క వాచికాభినయాలు అనంతమైన ఆకాశంలో మెరిసే చంద్రుడు, తారలు అతనికి ఆహార్యాభినయాలు. ప్రకృతిలోని సాత్త్వికాభినయాలు అట్టి మహోత్కృటుడు శివునికి నమస్కరించుచున్నాను.[1]

పై శ్లోకం వివరిస్తున్నది నాట్యం ఎలా పుడుతోంది అన్న విషయాన్ని. ఈ లోకంలోని సర్వ భూతరాశి (సర్వ పదార్థరాశి) శివుని అంగికమైన అభినయం-అంటే అవయవరూప విన్యాసం [2] చైతన్యం పొందే వికారమే 'అంగ'మని పిలువబడుతుంది వికారమంటే ఆకారాన్ని పొందుట తప్ప అంచలి హీనమైంది కాదు అంటే లోకంలోని అన్ని జీవరాసులలోను ఒక దివ్య చైతన్యగతి రూపమైన అభినయం ఉందని అర్థం

మానవునిలోని అవయవాలన్నీ పదార్థ జగత్తునుంచే పుట్టాయి ఒక్కొక్క పదార్థం ఒక్కో భావ ప్రకల్పంగా మనిషిలో జీర్ణించివుంది అందుకే జంతు క్రిమికీటకాదులలో కేవలం గతిచేష్టలుగా వున్న నృత్యశీలత, మనిషిలో సర్వ సమగ్రంగా ఆవిష్కరింపబడుతోంది. ఒకదశలో మనిషి కూడా నాల్గుకాళ్ళున్న పశువే రెండు కాళ్ళమీద నిలబడగల్గినపుడే తక్కిన రెండు కాళ్ళు చేతులుగా

మారాయి. అపుడే మానవుడి మేధ అభివృద్ధిని కూడా పొందింది. తన శరీరంలోని ప్రతి అవయవానికి పదార్థ జగత్తులోని మరి [illegible] పేర్లు ఎప్పుడూ కల్పించుకొన్నాడో [illegible] టాన్ని మనిషి నేర్చుకొన్నాడు. ఈ పరిణామం ఎంతవరకు [illegible] మైన ప్రతిచేష్టకి సంఘటనకి పదార్థానికి కేవలం [illegible] ద్వారా (ముద్రలు) సంకేతాలు ఏర్పరచటం వరకు [illegible] విద్యలో సాధించిన అత్యుత్తమ దశ ఇది. అతిసునిశితమైన మేధస్సంపత్తి గల్గిన ఆధునిక మానవుడు పదార్థాలకు శాస్త్రీయ సంగీతం ఇవ్వగలిగాడు. అందుకే ఈనాడు నాట్యం నేర్చుకొంటున్న వాళ్ళను పరిశీలిస్తే దాన్ని ఒక శాస్త్రంలాగా నేర్చుకొంటున్నారని తెలుస్తున్నది ఉదాహరణానికి కొన్ని ముద్రలు చూద్దాం —

ముష్టి - శిఖరం - సూచీముఖం - పద్మకోశం - బాణం - సర్పశిరం - మృగశీర్షం - సింహముఖం - భ్రమరం - హంసపక్షం - ముకుళం - తామ్రచూడం - త్రిశూలం - చంద్రిక - కపోతం - కర్కటం - [illegible] - [illegible] - శివలింగ - శంఖ - చక్రపాశ - మత్స్య - కూర్మ - నాగబంధ ఇవన్నీ స్పష్టంగా భౌతిక వస్తుసూచకాలే. కానీ ఆయా ముద్రలను నాట్యంలో వాడే సందర్భాలు మాత్రం భిన్నంగా ఉంటాయి. కొన్ని ముద్రల వివరణ చూద్దాం—

**ముష్టి :-** అన్ని వ్రేళ్ళను కలిపి బొటనవ్రేలిని వానిపై నుంచిన యెడల ముష్టి హస్తమవుతుంది (పిడికిలి)

**శిఖర :-** ముష్టి హస్తమందలి బొటనవ్రేలిని [illegible] శిఖరహస్తమవుతుంది.

**కపిత్థం :-** బొటనవ్రేలిమీద తర్జని [illegible] [illegible] వ్రేళ్ళను క్రమంగా వంచిన [illegible] కపిత్థహస్తమవుతుంది.

**కటకాముఖం :-** కపిత్థహస్తమందు మధ్యవ్రేలును కూడా వంచుటచే [illegible] ముఖమవుతుంది.

పై వివరణ చూస్తే మనకు [illegible] ఈ ముద్రలన్నీ [illegible] దశలో పదార్థసూచకాలే అయివుంటాయని. ఈ పదార్థ ప్రతిబింబాలుగా మనిషిలో భిన్న అవయవాలు రూపొందుకొన్నాయి. [illegible] నృత్యానికి [illegible] దొరుకుతుంది. ఉదాహరణానికి రెండు మూడు సందర్భాలు చూద్దాం.

భూమిపైన ఎత్తైన వస్తువు పర్వతం అందుకే ఈ క్రింది శ్లోకంలో భూదేవి స్తనమండలాలుగా పర్వతాలు చెప్పబడ్డాయి—

సముద్ర వసనేదేవీ పర్వత స్థన మండలే
నాట్యం కరిష్య భూదేవి పాదఘాతం క్షమస్వమే[4]

సముద్రాన్నే వస్త్రంగా, పర్వతాలను స్తనాలుగా కల్గిన ఓ భూమాతా నాట్యం చేస్తున్న నా అడుగుల తాకిడిని క్షమించు

ఒక్కొక్క కొండలో అమ్మవారి ఒక్కొ అవయవ సౌందర్యాన్ని దర్శించిన కళాకారులూ ఉన్నారు

సొంపులనీ వదనపు సోమశిల కనుమ
యిరవులెల్ల జేకొనగ నిల్చు నీపతికి
ఒలికి నీ పిఱుదనే గద్దెరాతి కనుమ
మొలనూళ్ళ లతలనే ముంచుకొన్నది
కలయబోక మదినే కట్టు పడ్డది
అలరు పిలుతు దాడి ఒడ్డమునీ పతికి
ఇదివొ నీకెమ్మోవి యెఱ్ఱశిలకనుమ
కదిసి లేజిగురుల గప్పు కొన్నది
వదల కింతకుందల వాకిలైనది
మనసుని బొదికి మాటు వోనీపతికి
కాంతనీ చిత్తమే దొంగల సానికనుమ
యింతటి వేంకటపతికిరవైనది
పంతపు నీ గుబ్బలే గుబ్బలి కొండకనుమ
మంతనాల కనుమాయె మగువ నీ పతికి[5]

పై పాటలో వదనం - సోమశిల కనుమ, పిఱుదు - గద్దెరాతి కనుమ, కెమ్మోవి - ఎఱ్రశిల కనుమ నీ చిత్తం - దొంగలసాని కనుమ, గుబ్బలు - గుబ్బలి కొండ కనుమలుగా పోల్చబడ్డాయి. ఈ కొండలన్నీ రాయలసీమలోని కడప జిల్లాలోనివి కొండల్లోని అందాలన్నీ అమ్మవారిలో అవయవాలుగా చూచి తరించిన కళాకారుడు అన్నమాచార్యులు

ఎండిపోయిన నదిలో శుష్కించిన ఒక తామరకాడ నాధారంగా ఒక నాట్యభంగిమను అక్షరశిల్పంగా మార్చిన కవిపుంగవులూ ఉన్నారు—

అతివృష్టమ్మని వార్ధి గూర్చు నెపకాదౌ యందమిం గూర్చున
న్మతి లంచంబుగ హేమటంకములు మిట్టంబాల్చు సర్వస్వ దే
వతకీ నెత్తిన కేలనా బొలిచె నిర్వారి స్రవంతిస్స యు
శ్ఛ్వసితనే ప్రమచ్ఛద దృశ్యకర్ణికములై యున్నాళ నాళికముల్[6]

నది - స్త్రీ, సముద్రుడు - పురుషుడు, వర్షాకాలం ఆగిపోయింది. నదులు ఎండిపోయాయి. తామరలు వాడిపోయాయి. కాడ కృశించిపోయింది. రేకులు వాడి రాలిపోయాయి. నడుమన కర్ణిక కనిపిస్తోంది. అది ఎలా ఉందంటే మేఘునికి మళ్లీ వర్షం కురిపించమని హేమటంకాలను లంచం చూపిస్తూ నదీమతల్లి ఎత్తిన చేయిలాగా ఉంది.

చంద్రబింబంలో నట్టువకత్తె ముఖసౌందర్యాన్ని చూసిన సౌందర్య పిపాసులూ ఉన్నారు.

'హరిదంభోరుహలోచన ల్గగనరంగాభోగరంగ త్తమో
భర నేపథ్యము నొయ్య నొయ్య సదలింపన్, రాత్రి శైలూషికిన్
వరుసన్ మౌక్తిక పట్టమున్, నిటలమున్, వక్త్రంబునుం దోచెనా
హరిణాంకాకృతి పొల్చె రేకయి, సగంబై, బింబమై తూర్పునన్"[7]

రాత్రి అనే శైలూషిక ఆడుతోంది. ఆమె నాట్యం ఆకాశ మండపంలో నాటకాలలో వేషం వచ్చినపుడు తెరపట్టడం ఆచారం. హరిదంభోరుహలోచనలు తమోభరనేపథ్యాన్ని నొయ్యనొయ్యన సడలించారు. ఆ శైలూషిక ధరించిన మౌక్తిక పట్టము ఆమెనిటలము వక్త్రము క్రమంగా తోచాయి. అవి వరుసగా చంద్రుని రేఖలాగా అర్ధభాగంలాగా, నిండు రూపంలాగా వరుసగా తోచాయి. క్రమాలంకారం.

కిన్నెరసాని తెలుగువారికి 'ఎంకి'లాగే ప్రీతిపాత్రమైంది. అది ఏరు, ఆమె పేరు, ఏటికీ కిన్నెరసానికీ కవిదర్శనం ఎలా అభేదాన్ని గుర్తిస్తుందో చూద్దాం.

తెరటాలలో నుర్వు
తెర దాలులో నీవి

పొరజిలులో కిన్నె
రటుకదలి యిటుకదలి
చిటితరంగాలతో పొటతరంగాలతో
నాటనాలు మొదలెట్టెనే క్రొన్నీటి
తుటుములా కదలాడెనే

సురగాలిలో పొంగు
తరగాలిలో నీటి
తెరడాలులో కిన్నె
రటుపొరలి యిటు పొరలి
పరుగెత్తుసురుగుతో దరులొత్తు నురుగుతో
గల్లుగల్లున మ్రోగినే జల్లు మని
పల్లువల్ విరజిమ్మె నే
తెగపాడుతూ అంద
ముగ నాడుతూ తేనె
వగలోడుతూ కిన్నె
రటువాలి యిటువాలి
తళుకు వాలులతోడ
బెళుకు వాకలతోడ
మలకత్తై నటియించనే తలినీటి
పులకత్తై బుగ్గెత్తనే

లయ పెంచుతూ మధ్య
లయదించుతూ పాట
లయ పెంచుతూ కిన్నె
రటుసోలి యిటుసోలి
తెలినీటి మేనితో తవిరాకు మేనితో
ఒయ్యారములు పోయినే - కిన్నెరా
అయ్యారే యనిపించెనే

ధణ ధంగిణాం ధధోం
గిణ తక్కిణాంమద్దె
లల మ్రోతలై కిన్నె
రటుమ్రోగి యిటుమ్రోగి
చిలులొల్లు సోనలై సిలులొల్కు సోనలై
మృదుతాండవము చేసెనే- వనవీధి
పదుపుపాయలు కట్టెనే[8]

కళాకారులందరూ జగత్తును చైతన్యానికి ఆకారరూపాలుగానే చూస్తారని చెప్పటం కోసమే ఇంత చర్చించాల్సి వచ్చింది. ఈ గుణం మానవుడిలో చాలా సహజమైంది. అందుకే నృత్యశీలం కూడా ఒక బౌతికమైన అవశ్యకంగా పుడుతోంది తప్పా కేవలం విరామకాలంలో సంతోషంకోసం మనిషి నేర్చుకొన్నదిగా కనిపించటంలేదు. ఈనాడు నృత్యం ధనికుల వినోదంకోసం పనికొస్తున్నా అది జానపదుని శ్రమైక జీవనసౌందర్యంగా గుర్తించడంలో విప్రతిపత్తి, లేదు. మానవ పరిణామ చరిత్ర కూడా ఈ అంశాన్నే నిరూపిస్తోంది.

## (ఆ) మానవపరిణామ సంబంధ మూలాలు

ముందు అధ్యాయంలో సూచించినట్టుగా రెండు కాళ్ళమీద నిటారుగా నిలవగల్గి నడవకల్గిననాడే 'నాట్యం' మొదలైంది. తక్కిన రెండు కాళ్ళే హస్తాలుగా పరిణమించాయి. అంటే సుమారు ఐదులక్షల సంవత్సరాల క్రితం అనాటినుంచీ ఈనాటిదాకా మానవజాతి పరిణామక్రమాన్ని గురించి ఆలోచిస్తే, ఎలా వుంటుందో ఎంతంపాటి సత్యనారాయణ గారు ఇలా తెలియజేశారు— "మానవజాతి పరిణామ క్రమాన్ని ఒక గంట చిత్రంగాతీస్తే, అందులో 59 నిముషాలు ఆదిమ దశ నుంచి పైకి పెరగడానికే సరిపడుతుంది. నాగరిక మానవ జీవితం యావత్తు ఒక్క నిముషంలో గడిచిపోతుంది. యంత్రయుగం నుంచి ఈనాటివరకు వచ్చిన అభివృద్ధి ఒకటిన్నర సెకండ్లకన్న వుండదన్నారు. హైమెన్ లేవీ తన "సోషల్ థింకింగ్" అనే పుస్తకంలో[9]

పైన ఆయన గుర్తించిన 59 నిముషాల ఆదిమ జాతుల్లో కనిపించే 'నృత్తంగా' చిర్యాత పుటల్లో ప్రతిపాదించటం జరుగుతుంది. సుదీర్ఘ

మైన మానవపరిణామ చరిత్రలో భాగంగా నృత్త - నృత్య - నాట్య పరిణామం తరువాత అధ్యాయాల్లో విస్తృతంగా చర్చించబడుతుంది,

భారతదేశంలో ఆటవిక - జానపద - నాగరిక జీవితాల మధ్య వైరుధ్యం కన్నా పోలికలే అధికంగా వున్నాయి. పాశ్చాత్య దేశాల్లోలాగా కాకుండా నాగరికత వ్యాపించినా జానపద ఆటవిక జీవితాలు తమ తమ ప్రాచీనతల్ని నిలుపుకొంటూ చాలావరకు అలాగే కొనసాగిపోతున్నాయి. జానపద ఆచారాలు ఎలా పాతబడలేదో అలాగే కళా సంప్రదాయాలు కూడా దాదాపు యథా పూర్వకంగానే సంప్రదాయాలుగా నిలిచిపోయి కన్పిస్తున్నాయి. నృత్య సంప్రదాయాలు అంతే భారతదేశ నైసర్గిక స్థితి ప్రకృతి వాతావరణంలో తేడాలు, కొండలు, నదులు, అరణ్యాలు వీటిచేత ఏర్పడ్డ సామాజిక సంస్కృతి లోని తేడాలు, వీటి కారణంగా భారతదేశంలో ఎక్కడికి అక్కడ ప్రజాజీవితం తెగలు తెగలుగా వారి వారి సాంస్కృతిక పరిధిల్లో మాత్రమే బ్రతుకుతూ పంచపంచలా ప్రాచీనత అర్వాచీనత రెండూ కలగాపులగంగా కనిస్తాయి. అందుకే ప్రాచీనతను సులభంగా మనం పునర్నిర్మాణం కూడా చేయగలుగుతున్నాం. భారతదేశంలోని ఈ విలక్షణ పరిస్థితులను గురించి సుప్రసిద్ధ చారిత్రక విమర్శకులు ఇలా అభిప్రాయబడ్డారు.

1. భారతదేశంలో ప్రకృతిలో లభ్యమయ్యే ఆహారపదార్థాలు అసంఖ్యాకం. ఒక్క జంతువుని కూడా చంపనక్కర లేకుండా భారతదేశ వాతావరణంలో మనిషి సులువుగా బతికెయ్యవచ్చు. ఆదిమ తెగలవారు ఈనాటికి ఇక్కడ కొనసాగుతుండడానికి అదే కారణం అంటాడు డి. డి. కోశాంబి[10]

2. ఈ ఆదిమ తెగలలో కొన్ని విశ్వాసాలూ నమ్మకాలూ పాతుకుపోయి ఉన్నాయి. ప్రారంభంలో జీవితపోరాటానికి అవి ప్రోత్సాహం, వత్తాసునిచ్చాయి. కాని కాలక్రమంలో అవి పెరుగుదలకు ఆటంకకారులయి కూర్చున్నాయి. సాహసం, చొరవ వున్న తెగలు పాత ఆచారాల్ని వదిలేసి వచ్చిన కొత్త అవకాశాల్ని వుపయోగించుకొని సుఖజీవితం వైపు పురోగమిస్తుంటే మిగిలినవారు పాత నమ్మకాల్నీ, మూఢాచారాల్నీ కర్మకాండల్నీ పట్టుకుకూర్చుని, కొత్త మార్గాలవైపు చూడ్డానికి కూడా భయపడ్డారు ప్రకృతివారి అవసరాల్ని దండిగా తీర్చగలగడం

చేతనే వారింతవరకూ మనగలుగుతున్నారు ఈ పిడ్యార స్థితినే కొశాంబి పూర్వ చరిత్ర, సజీవచరిత్ర" అన్నారు [11]

అంటే ఇక్కడ చరిత్ర గతంకాదు ఇంకా నడుస్తున్నదని అర్థం

ఈ సిద్ధాంత వ్యాసంలో నాట్యంకన్నా నృత్యం దానికన్నా నృత్తం ప్రాచీనమన్న విషయాన్ని నిరూపించడానికి ప్రయత్నం జరిగింది మానవ పరిణామంలో ఈ అంశానికి సంబంధించి ఎలాంటి సమర్థన కనిపిస్తుందో చెప్పడానికి ఈ సజీవ చారిత్రక దృష్టి బాగా ఉపయోగపడుతుంది తరువాతి అధ్యాయాల్లో భిన్నమైన కోణాలద్వారా నిరూపించటం జరుగుతుంది ఇక చరిత్ర ద్వారా చరిత్ర పూర్వ మూలాలను నాట్యశాస్త్రం అంతకన్నా ప్రాచీన దశను ఉత్తరోత్తరంగా ఎలా నిరూపిస్తున్నాయో మూడునాలుగు భాగాలలో చూడవచ్చు.

## (ఇ) చారిత్రక మూలాలు

భారతదేశ చరిత్రను ప్రాచ్యపాశ్చాత్య దేశచరిత్రలను పోల్చి చూస్తే నృత్య మూలాలలో కూడా తేడా కనిపిస్తుంది ప్రపంచ నృత్య చరిత్రను గురించి వ్రాసిన వాళ్ళు ఇలా అంటున్నారు—

ప్రపంచమంతటా నృత్యం ఆదిమదశల్లో మత కార్యకలాపాల్లో భాగంగా పుట్టింది ప్రాచీన గ్రీక్ నాగరికతల్లోనూ ఈజిప్సియన్ నాగరికతలోనూ మతపరమైన తంత్రాలన్నీ నాట్యంతో అనుసంధింపబడి వున్నాయి ఈ పద్ధతి వ్యవహార క్రమంలో ఒ నాటి తాంత్రిక ఆచారం మరొక కాలానికి కేవలం అభినయంగా - కళారూపంగా, నాట్యంగా, చిత్రంగా మిగిలిపోయింది ఒకనాటి పురోహితుడే మరోనాటి సూత్రధారి ఆయ్యాడు ఆచారమెలా అద్భుతమైన మానసిక సంసారానికి హేతువైందో అలాగే నాట్యం కూడా అద్భుతమైన రసానుభవాన్ని కల్పించే సాధనమైపోయింది ఈ పరిణామంవల్లా తూర్పుదేశాలలో మతపరమైన స్పృహ ఏ మాత్రం చావలేదు కొత్తకొత్తగా పుడుతున్న నృత్యకళా రూపాల్లో కూడా మత చైతన్యం భిన్న రూపాలతో ప్రవహిస్తూనే వచ్చింది. అందుకే భారతదేశంలో నృత్యం ప్రజల ఆధ్యాత్మిక అనుభవానికి, ఆధ్యాత్మిక జీవితానికి సంబంధించింది మీదు మిక్కిలి ఆ చైతన్య ఉద్దీప్తితోనే కొత్తదనం ఎప్పటికప్పుడు పుట్టుకొస్తోంది.

పాశ్చాత్య దేశాల్లో తంత్రానికి అభినయానికి మధ్యవున్న ఈ సంబంధం తెగిపోయింది జానపద నృత్యంలో కాని శిష్టనృత్యంలో కాని ఆ జాతి జీవనం లోని ఆధ్యాత్మిక స్పృహ కనిపించదు అక్కడ పురాతన నృత్యం మీద వున్న పిచ్చి అభిమానానికి తార్కాణంగానో ఆ స్పృహను కృత్రిమంగా కాపాడుకోవా లన్న ప్రయత్నంలో భాగంగా జానపదనృత్యం కన్పిస్తుంది శిష్ట్య నృత్యంలో నాగరికతా జీవనం ఆధునిక స్పృహ ఈ రెండు కన్పిస్తాయి మనిషి తనలోని భావాలను ప్రతిబింబించడానికి చేసే ప్రయత్నంగానే కన్పిస్తుంది ప్రాచ్యదేశా లలో లాగా భగవంతుడు మతం చైతన్యం వీటి సంబంధం ఎక్కువగా కన్పిం చదు [12]

**లలితకళలు - కళాసూత్రం**

శిల్పం - నృత్యం - సాహిత్యం - చిత్రలేఖనం - సంగీతం వీటినడుమ ఒకే అంతస్సూత్రం భారతదేశంలో ప్రతిపాదించబడినట్లు విష్ణుధర్మోత్తర ప్రమా ణాన్ని ఆధారంగా పండితులంతా చెప్తున్నారు

కపిలా వాత్సాయన్‌గారు "డాన్స్ ఇన్ ఇండియన్ పెయింటింగ్స్" అనే గ్రంథంలో ఇలా చెప్తున్నారు

**నాట్యంలో కానీ, చిత్రంలోకానీ ఆ నేత్రాలు ఆ భావాలు ఆదే అభినయం అంగఉపాంగాలు పరమాద్భుతమైన పరం చిత్రకల్పన చేస్తాయి. ఇక్కడ ఈ రెంటికి సంబంధం ఏమిటి ? ఎలా అవి రెండు కలుస్తున్నాయి. అనే ప్రశ్నకు సమాధానం చూడాలంటే మనం రెండు విషయాల్ని గురించి అర్థంచేసుకోవాలి.**

1. చిత్రనృత్యాలకు సంబంధించిన మౌళికసూత్రాలు.

2. భారతీయ చిత్రకారుల నృత్య పరిజ్ఞానాన్ని ఆధారంగా నృత్యచరిత్ర మూలాలు.

నృత్యచిత్రకళల నడుమ రెండిటా రసమే ప్రధానమైంది భావం అన్ని కళలలోనూ సర్వసాధారణమైంది అంగ ఉపాంగలే ఆయా కళలకు భిన్న మైనవి అంటే సాహిత్యం వాగ్రూపంగా, నృత్యం గతి రూపంగా, శిల్పం వస్తు రూపంగా, సంగీతం శబ్దరూపంగా, ఇవే అంగ ఉపాంగ బేధాలు - బయట

పడ్తున్నాయని అర్థం. చిత్రంలో గీతంలోని అభినయం నృత్యంలోని గతి రెండూ అనుసంధానాన్ని పొందుతాయి. అందుకే ఆయా దేశాలలో ఆయా ప్రాంతాలలో పుట్టిన చిత్రలేఖనలు ఆయా సంస్కృతులలోని నృత్య సంప్రదాయాలను మనకు తెలపగలిగే ఏకైక సాధనాలే చిత్రలేఖనాల ద్వారా భారతదేశంలో వచ్చిన నృత్య పరిణామాన్ని మూడుదశల్లో చెప్పవచ్చని కపిలావాత్స్యాయన్ అంటున్నారు.

(అ) ప్రాక్చారిత్రక దశ
(ఆ) పురాతన దశ
(ఇ) చారిత్రక దశ

ప్రాక్చారిత్రక దశలో మనకు కన్పించే చిత్రలేఖనాల్లో ఎక్కువగా మనకు వేటకు సంబంధించినవే కన్పిస్తున్నాయి. భారతదేశంలో కనిపించే ఆదివాసి జానపద నృత్యాలలో చాలా వాటిలో ఒక సాధారణ బంధం కనిపిస్తుంది. అది పిడిబంధం అంటే సామూహికంగా ఒకరిచేతులు ఒకరు పట్టుకొని వలయాకారంగా చేసే నృత్యమన్న మాట. ఇదే తర్వాత నాట్యశాస్త్రంలోనూ కన్పిస్తుంది.

**శిల్పచిత్రలేఖనాలు**

అమరావతి, నాగార్జునకొండ, అజంతా, ఎల్లోరా, ఖజురహో, బేలూరు, హాలేబీడులలో కన్పించే శిల్పసంపద నృత్యకళకు తార్కాణాలు. అమరావతీ శిల్పాల్లో పిడిబంధాలనే బృందనృత్యాలున్నాయి. ఇక్కడ నలుగురు నాట్యకత్తెలు కలిసిచేసే నృత్యాలున్నాయి. బ్రిటిష్ మ్యూజియంలో భద్రపరచిన అమరావతి శిల్పాల్లో ఒక నృత్య దృశ్యముంది ఒక స్త్రీ వల్లకిని మీటుతుండగా ఇంకొక స్త్రీ వేణుగానం చేస్తోంది. దానికనుగుణంగా ఒక నర్తకి నృత్యం చేస్తోంది.[13]

గుంటూరు జిల్లాలోని 'గోలిశిల్పం'లో ఒక స్త్రీ విపంచిని మీటుతున్నట్లు శిల్పముంది. నాగార్జున కొండలో ముగ్గురు స్త్రీలు బృంద నృత్యం చేస్తున్న శిల్ప దృశ్యముంది.

నృత్యకళ శాతవాహన, ఇక్ష్వాకుల కాలంలో మహారాజుల సంపన్నుల ఆశ్రయంలో వర్ధిల్లింది. అనటానికి నాగార్జునకొండ అమరావతి శిల్పాల్లోని చిత్రాలే నిదర్శనం.

పూర్వ చాళుక్య పరిపాలనలో శివాలయానికి గాను అగ్రహారాన్ని దాన మివ్వటానికి గల ప్రయోజనాలలో తత - ఘన - సుషిర - అవర్ధ - వాద్య - వాదక - గాయక[14] నటకాచార్య విలాసినీ జనాన్ని పోషించటం కూడా ఒకటి

విజయవాడలో అక్కన్న మాదన్న గుహలకు కొద్దిదూరంలో నున్న జమ్మి దొడ్డిలోని మండపస్తంభ 'చూళిక'ల మీద, దూలాలమీద పూర్వచాళుక్య[15] సంప్రదాయానికి చెందిన నాట్యచిత్రా లున్నాయి

హొయసలుల కాలంలోని హలేబీడు, బేలూరు శిల్పాల్లో రామాయణం మనకు దర్శనమిస్తుంది[16]

కాకతీయులు కట్టించిన దేవాలయాల్లో శిల్పాలు అనేకాలు నృత్యశిల్పాల్లో రామప్ప దేవాలయంలోనివి ప్రశస్తాలు, జాయపసేనాని చేత నృత్తరత్నావళిని రచింపచేసిన కాకతీయ గణపతిదేవుని కాలంలో చెక్కబడ్డ శిల్పాలు కావటం వీటి కున్న విశిష్టత

తంజావూరులోని పాలంపేటలో పెద్దదేవాలయంలోని ద్వారా బంధాల మీద, స్తంభాలమీద నృత్య శిల్పాలున్నాయి పాలంపేటలోని రామప్పచెరుంకట్ట తూర్పు చివరనున్న దేవాలయంలోపలి భాగంలో స్త్రీలు మద్దెల వాయిస్తుండగా వివిధ భంగిమలతో నృత్యం చేస్తున్న నాట్యకత్తెల శిల్పాలున్నాయి పడమటివైపు ద్వార బంధాల మీద మృదంగం వాయిస్తున్న స్త్రీల నృత్యశిల్పా లున్నాయి.

వరంగల్లు కోట ద్వార బంధంపై 'రాతిగొడుగు పలకమీద నృత్య శిల్పా లున్నాయి కోటలో స్వయంభూలింగేశ్వర దేవాలయంలో ఒక చిన్న శివతాండవ శిల్పంకూడా వుంది

విజయనగర రాజులకాలంలో అనేక శిల్ప చిత్రలేఖనాలు కాళహస్తి, తిరుపతి, తాడిపత్రి, హంపి మొదలగుచోట్ల నృత్య భంగిమలు అనేకాలు హంపిలో స్త్రీలు కోలాటమేస్తున్న వివిధ భంగిమలన్నాయి అనంతపురం జిల్లా లేపాక్షిలో కుడ్యచిత్రాలలో రకరకాలుగా మనకు కన్పిస్తాయి తాడిపత్రిలో చింతలారాయుని దేవాలయంలోని శిల్పాల్లో నృత్య భంగిమలున్నాయి వాటిలో కోలాట నృత్యాన్ని ప్రతిబింబించేవి చాలా వున్నాయి ఈ జిల్లాలో ప్రతి దేవాలయ గోపురంలోను,

గోడలమీద ఏదో ఒక నృత్య భంగిమున్న కొన్ని శిల్పాలు మనకు దర్శన మిస్తాయి.

ధర్మవరంలో శిథిలమైన ఆనాటి బురుజుల్లో గూటికి కొన్ని నృత్య భంగిమల్ని ప్రదర్శించే శిల్పాలు మిగిలివున్నాయి పెనుకొండ దేవాలయంలో కొన్ని శిల్పాలున్నాయి ఈ శిల్పాలన్నీ దేశంలో అది ఉచ్ఛదశ నందిన నృత్యరీతుల్ని స్ఫురింపచేస్తున్నాయి

## శాసనాలు

దాక్షిణాత్యశాసనాలలో ఇతర కళలతోపాటుగా నృత్యానికి సంబంధించిన ప్రసక్తి కూడా కనిస్తోంది 10వ శతాబ్దానికి ముందు నాటి శాసనాల్లో భారత ప్రసక్తే ఎక్కువగా కనిపిస్తోందని ఆచార్య చిదానందమూర్తిగారు "న్నడ శాసన గళ సాంస్కృతిక అధ్యయన అనే తన గ్రంథంలో తెలిపారు (1970 457) 6, 11 శతాబ్దాల నడుమ వచ్చిన అనేక కన్నడ శాసనాలను గురించి చర్చిస్తూ చిదానందమూర్తిగారు రెండు విషయాలు చెప్పారు

1 భారతనాట్య సాంప్రదాయమే జైన, బౌద్ధ, హైందవ సమూహాలలో ప్రచారంలో ఉండేదని

2. దేవాలయంలో (జినాలయాలలో కూడా) ఒక భాగం నాట్యశాలగా వుండేదని.

ఆచార్య చిదానందమూర్తిగారు 'నాగావిశాసనం' (ఇన్స్క్రిప్షన్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్, జి 63) నుంచి క్రింది భాగాన్ని ఉదాహరించారు. "అనేక కూట కోటి విశాల సాల భంజికారంజి తమున్ నాట్యశాలాలంకరమున్"

రేచెరువుల రామిరెడ్డి పిల్లలమర్రి శాసనంలో దేవాలయం వైంకర్యం చేసే గాయక, మార్దంగిక, నర్తకీ జనాలకు గృహదానం ఇచ్చినట్లుగా వుంది [17]

మైలాంబ పానుగల్లు శాసనం ప్రకారం గాయకులకు నర్తకులకు దాన మిచ్చినట్లు వుంది [18]

ధర్మసాగర శాసనంలో కొన్ని నివర్తనాల భూమిని గాయకులకు అనేక మంది నాట్యగత్తెలకు ఇచ్చినట్లుగా చెప్పబడి వుంది. 'ఒంటరంగం' అనే ఒక అపూర్వవాద్యం ఈ శాసనంలో ప్రస్తావించబడింది [19]

చేబ్రోలు శాసనంలో (కాకతి గణపతిదేవ జాయపసేనాని) పదునాల్గురు ఆసాద త్రైంగు గృహాలు ఇచ్చినట్లుగా చెప్పబడింది[20]

మల్కాపుర శాసనంలో (21) కాకతీయ మహారాణి రుద్రమదేవి దానంగా ఇచ్చిన 'మందారం' అనే గ్రామంలో విశ్వేశ్వర శివాచార్యుడు స్థాపించిన గోళకీమఠ విద్యాస్థానాన్ని, దేవాలయాన్ని పదిమంది నర్తకులకు, మద్దెల వాళ్ళకు ఎనమండ్రుకు, కాశ్మీరదేశీయులైన గాయకునికి, పదునాల్గురు గాయినులకు కూడా నాదనాములలో చతురులైన ఆరుగురికి వృత్తి మాన్యాలు ఇచ్చినట్లు నాట్య సంగీత పోషణ ఏల్పించెరని వుంది

## సాహిత్యంలో నృత్యచరిత్ర

### నన్నయ

ఆదికవి నన్నయ వ్యాసుని ప్రకారమే భారతాన్ని రచించినా ఆనాటి సమకాలీనమైన విషయాలు చొప్పించాడు రైవతకాద్రిని ఏ విధంగా ఆడుతూ పాడుతూ పూజచేశారో ఆదివి, ఆచరంలోని కొండపూజను నృత్యంగా చెప్పిన సందర్భం—

"ప్రభాతంబ వాసుదేవుండు వాసవనందను
నందయుండంబంచి కాంచనరథా రూఢుండై
పురంబునకుం జని పౌరజనప్రధానసమక్షంబున
రైవతక మహోత్సవంబు ఘోషింపం బంచిన—

పొలుపుగఁబూసి గట్టితొడి భూరి విభూతి ప్రకాశితంబుగాఁ
గలయఁగఁ దత్పురీ జనులు కాంస్య మృదంగ ముకుందవేణుకా
హళపటహధ్వనుల్ చెలఁగ నాటలుఁ బాటలు నొప్పనెల్ల వా
రలుఁ జని చేసి రర్చనలు రైవతకాద్రికి నృత్యవంతతోన్[22]

ఆ పురీజనులు అందంగా మైపూతలు పూసుకొని దుకూలాలు ధరించి భూషణాలు తొడిగి ఐశ్వర్యాతిశయంచే మృదంగ - వేణు - కాహళ - పటహాది వాద్య ధ్వనులొప్పార ఆటలాడుచు పాటలు పాడుచు రైవతకాద్రికి చని ఉత్సాహంతో పూజలు గావించిరి.

గిరిజన ఆచారంలో త్రాగటం సహజం తాగి ఆడటం వీరి నృత్యాలలో ఎక్కువ క్రింది పద్యంలో తెలుస్తోంది.

"గురుకుచయుగ్మముల్ గదలఁ గొమ్ముడులందుల పుష్పముల్ పయిం
దొరఁగ నిదాఘబిందువితతుల్ చెదరన్ మదిరా మదంబునం
బరవశలయ్యు నింపెసగఁ బాడుచుఁ దాళము గూడ మెట్టు చుం
దరుణియు లొప్పానాడిరి ముదంబునఁ దమ్మ జనాలి మెచ్చగన్[23]

## నన్నెచోడుడు

లాస్య నృత్యాన్ని నన్నెచోడుడు రతిలీలా వాణకంలో ఒక సందర్భంలో ఇలా వర్ణించాడు.

"గళనాదంబులు మంజుగానములుగాఁ గాంచీ సమ్యక్కింకిణీ
కల నాదంబులు హృద్య వాద్యములుగా గాంతోరుపీఠోన్నత
స్థల సంగమ్ములఁ గామ ధన్నటికుఁ డోలఁగూడ నాడింపగా
లలనా పాత్రములాడి రొప్ప రతిలీలా లాస్యలోలాస్యలై[24]

కంఠనాదాలు మనోహరమైన పాటలుగను మొలనూలు నందలి చిరుమువ్వల ధ్వనులు మనోహరమైన వాద్యాలుగను నారీమణుల **ఊరు(తొడల)** భాగాలు రంగస్థలముగను ఒప్పుచుండ **మన్మథుడనెడు నటకుడు ఆడింపగా రతి** క్రీడ యందు ఆసక్తిగల తరుణీమణులు విలాసముతోకి లాస్యనృత్యం గావించిరి.

## తిక్కన

తో పరిశీలనలో అగ్రగణ్యుడైన తిక్కన నాట్యాచారుడుగా అర్జునుడు (బృహన్నల) విరటుని కొలువులోకి ఎలా వెళ్లాడో క్రింది పద్యంలో తెలిపాడు.

కాళ్ళయొప్పిద మాఁడు కట్టిన జ్యోత్స్నలము చేయంగ సంకుల బాహులంద మెద
లఁగ చుక మగంబు కాంతికిమాటుగా మెద హేమపట్టిక మెఱయ కుంద
వదనంబు కౌమరు భావనఁజేసి నేలుగా నుదుటి పెంపలఁ కలఁపొడువ బడగ
బవదంపు బొత్తుఁజెప్పు రూపసరంగఁ బాపట తలకట్టు భంగిదప్ప

మంచు మఱుఁగుపడిన మార్తాండుడును బోలె
నీఱుగప్పి యున్న నిప్పుఁబోలె

వేషధారియైన విష్ణుండు బోలిన
వ్విరటు కొలువు చేర నరుఁడు వచ్చె[25]

తర్వాత సమకాలీనమైన నాట్యరీతుల్ని ఇలా తెల్పాడు

ఒండు పనులకు నెలవు లేకునికిఁ జేసి
యభ్యసించితి శైశవ మాదిగాఁగ
దండలాసక విధమును గుండలియును
ప్రెక్కణ ము తెలుంగునుఁ బేరణంబు[26]

ఇతర పనులకు నేనర్హుడను కానందున శైశవము (బాల్యం) నుండి దండలాసకం, కుండలి, ప్రెక్కణము, పేరణము నృత్య విద్యల నభ్యసించితి

విశ్రుత వాద్యంబులు మం
జుశ్రుతి సంభావ్యగీత సుగతులు సద్భా
వాశ్రమములుఁ దజ్జన్యర
సాశ్రయములునైన యభినయంబు లెఱుఁగుదున్[27]

ప్రసిద్ధికెక్కిన వాద్యాలు మనోహరమైన శ్రుతులు పాటలందలి సుగతులు భావాశ్రయాలు ఆ భావాలనుండి ఉత్పన్నాలైన రసాశ్రయాలైన అభినయాలు నేనెఱుగుదును

## ఎఱ్ఱా ప్రెగ్గడ

రంగస్థలంమీద కట్టిన తెరను రెండువైపులకు లాగే విషయాన్ని ఎఱ్ఱన నృసింహ పురాణంలో ఇలా తెలుపుతున్నారు.

"సురుచిర తారకాకుసుమ శోభినభోంగణభూమి గాలమ
న్గరువపు సూత్రధారి జతనంబున దిక్పతికోటి ముందటన్
సరసముగ నటింపగ నిశాసతికెత్తిన క్రొత్తతోఁ పుఁటెం
దెరయన నొప్పె సాంధ్యనవదీధితి పశ్చిమదిక్తటంబునన్ (3-78)

నక్షత్రాలనే పుష్పాలచేత అలంకరింపబడిన నభోంగణంలో కాలమను సూత్రధారి, దిక్పాలకుల ముందట సరసంగా నటించుటకు రాత్రి యనెడి నాట్య

కత్తికు ఎత్తినట్టి పెద్దలతోపు రంగు తెరయేమో అన్నట్లు సంధ్యాకాల మందలి అరుణద్యుతి పశ్చిమదిగ్భాగమంన మనోహరమై ఒప్పారెను.

## పాల్కురికి సోమన్న

12వ శతాబ్దివాడైన పాల్కురికి సోమన పండితారాధ్య చరిత్రలో నృత్యాన్ని ఇలా తెలియజేశాడు

భ్రమరులు జాళెముల్ బయనముల్ మెరసి
రమణ పంచాంగ పేరణి యాడువారు
ప్రమథ పురాతన పటు చరిత్రములు
క్రమమొంద బహు నాటకము లాడువారు
లలితాంగరస కళాలంకార రేఖల నద
బహురూప మాడెడు వారు
అమరాంగనలు దివినాడెడు మాడ్కి
సమరంగ గడలపై నాడెడు వారు
అవియద్గతి యక్షులాడెడునట్టి
భారన మోకులపై నాడువారు
భారతాది కథల చీరమరగు
నారంగ బొమ్మల నాడించువారు
కడు నద్భుతంబుగ గంధ సూత్రంబు
ఉదరంగ బొమ్మల నాడించువారు
నారట గంధర్వ యక్ష విద్యాధ
రాదులై పాత్రల నాడించువారు

ఇంకా నృత్యకళకు సంబంధించిన వివరాలు (జానపద నృత్యకళా విషయం) దేశినృత్య భేదాలు వివరిస్తూ శ్రీశైలంలో శివరాత్రి మహోత్సవంలో శైవసంబంధమున్న దేశినృత్యాలు ఇలా తెల్పాడు.

1 పెపి మాటింగు
2 కోడ(బ)గి ఆట
3 పేరణి ప్రమథ గణాల చేష్టితాలను వర్ణించు బహునాటకాలు.

4 బహురూపులు
5 వెడ్డంగం
6 అమర గంధార్వాంగనల నృత్యను కరణాలు
7 పక్షుల ఆటలు
8 గడాటలు, దొమ్మరాట
9 బొమ్మలాటలు
10 పగటి వేషాలు

నృత్యంలో నడకల్ని ఇలా తెల్పాడు

ముందరి కాళ్ళపై నడక - ఒంటిరాలుపై నడక - మోకాలిపై నడక - కూర్చొని ముందుకు వెళ్ళుట - రొమ్ముతో ప్రాకుట - గిరగిర తిరుగుతూ పోవుట - బొంగరంవలె గిర్రున తిరిగే నృత్యం [28]

అనేక రకాల పక్షుల నృత్యాలు కూడా తెలిపాడు నెమళ్ళు - చిలుకలు - హంసలు - కోయిలలు - కోతులు - జింకలు-ఎద్దులు - ఏనుగులు - పెద్దపులులు - తుమ్మెదలు - చేప - పాము మొ॥ వానివలె నడుస్తూ నృత్యం చేసినట్లు వర్ణించాడు.

దేశిలాస్యాంగాల్ని, వివిధాంగాల యొక్క అభినయాల పట్టికను ఇలా తెలియజేశాడు ముఖం - నాలుగు, కనుబొమలు - ఏడు, కన్నులు - ఇరువది ఆరు, నాసాపుటాలవి - ఆరు, చెవులవి - పది, కుత్తుక - తొమ్మిది, రొమ్మువి - మూడు, పాదాలవి - ఐదు, తొడలవి తానకములు - ఇరువదిరెండు, దృష్టులు - ముప్పదినాలుగ, హస్తాలు - అరువదినాలుగు, చారులు - ముప్పదిరెండు, భ్రమరులు - ఏడు, కరణములు - నుటయునిమిది, అలంకారాలు - నూరు, శిరోభినయాలు - పదమూడు, దండినములు - ముప్పదిరెండు

చివరిగా హంస, నెమలి, పాము, ఏనుగు, ఎద్దు, కోతి, మేక మొ॥ వివిధ ములగు పక్షుల, మృగాల గతుల ననుసరించిచేసే నృతాల పట్టికనిచ్చాడు [29]

బసవ పురాణంలో బసవని వివాహఘట్టంలో కోలాటం, పాత్ర, గొండ్లి, పేరణి, ఆనందగీతాలు, జతిగీతాలు తెలియజేశాడు

కోలాటమును, జాత్ర, గొండ్లి, పేరణము
గేళిక జాకములీల నటింప
బాయకబాగు బళా యనుశబ్ద
మాయతి నాక సంబంది ఘూర్ణిల్ల
నలిరేగి వేణువీణా వాద్య వితతు
లురియుచు లీలతో నొక్కలు ద్రోయు
నాగంగ గీతంబు లగ్గించువారు
గీతములు పాడువారు
జతిగీతములు మీద జప్పులు పడుమ
నతిశయ శివభక్తి యాడెడు వారు
నీది పురాతన పాదితస్తు తులు
వేదార్థములు గాగ వివరించు వారు
నేణిశివ మరులున గురుదేవిపొంపి
నటిముటి పిన్నంది యాడెడి వారు[30]

ఇంకోచోట ముగ్ధ సంగయ్య గుడిలో పూజానృత్య విధానం వర్ణించ బడింది వేశ్యాసంభోగం కూడా ఒకరకమైన లింగార్చన మనుకొని ముగ్ధ సంగయ్య భక్తురాలైన ఒక గణిక ఇంటికేగినపుడు చంద్రోదయానంతరము నృత్యం చేయించింది.

ఆనయంబువింగ పూజనల నటించు
తనదు విలాసినీజనులరావించి
యక్కమహదేవి యల్లమద్దెలు
జక్కొల్పి వేగంబరానంధించుకొనుము
స్వరమానమున బసవ ప్రమథవ్య
కరమర్దిం బట్టుము కాహళలోని
సకళవ్వ నీవును సంగళవ్వ యును
నొకరీతి నిలుపుడు సుకరంబుగాగ
బాలరుద్రమ! యొత్తుపట్టుగివాసె
గొలు వాయింపుము గుద్దవ్వ నీవు
సిట్టితాళము కట్టు శివదేవి నీవు
కట్టిన నృత్యంబు సరసంబెటింగి

సంగుదాసమ ! మహేశ్వరి ! వీరభద్ర
లింగవ్వ మీరు గేళికలు సేయుండు
రమణదుకూలాంబరమును గంచుకము
సమరించికొని చల్లడము బిగియంచి
యేతెమ్ము నీవు పూరాతమ్మ శీఘ్ర
మాతతమ్ముగ నృత్యమాడుదుగాని
తాళముల్వట్టుడు దాళగింపుండు
నాళతి వేళకు నందలు ననుచు
సవిరళంబుగ సంతనార్చ్పటం బిచ్చి
జవని౦ రప్పించి సరసమై నిలిచి
పొలుపగు ముఖరసంబును సౌష్టవమ్ము
లనియు భావంబు దూకళియు ఝుంకళియు
మరియు రేవయు విభ్రమమును రేఖయును
నెఱమంగనీ రీతి నృత్యంబు సలుప
లింగార్చనంబు సల్లిలఁ జేయుచును
మంగళారవములు సంగడినులియ

## శ్రీనాథుడు

15 వ శతాబ్దిలోని పలనాటి వీరచరిత్రలో నృత్యం ఇలా వుంది.

నాట్యమేళములవారు నవవిలాసముల
వచ్చినప్రమత మొక్కి ప్రక్కగా నిల్వ
ఘన వైభవంబున కామభూవిభుడు
నవ్వుచు సెలవిచ్చె నాట్యంబు చేయ
వీర మృదంగములెస్స వాయించుమేటి
కుడి భాగమునయందు కుదురుగా నిలిచె
తాళమానజ్ఞులు దాపటి దిశను
నిలిచిరుత్సాహంబు నేరుపుమీర
ముఖవీణ వాయించు ముఖ్యులొకండు
రాగమాలపించు రమణులిద్దరును

నిండు వేడుకతో నిలిచిరి ఎదుట
కంజతో చనయను ఘనస్థాయి పొంగి
మడనుపట్టపుదంతి మాటల వాణి
భరత శాస్త్రోచిత బహు రాగములను
గరిమతో నేర్చిన కంతుబాణంబు
వచ్చిసభాసదుల్ వర్ణించుచుండ
నిలిచి నాట్యమునకు నేర్పరియైన
నేత్రపాణికి దగ వినయంబు జూపి
అతడొసంగిన గజ్జెంతి భక్తితోడ
పాదములం గట్టి పంచవర్ణములు
కాశగట్టిగ గట్టికడు సొంపడర
మద్దెల తాళాల మధ్య నిల్చుండి
ఓరచూపున రాజు సౌమ్యన జూచి
సమపాదయుతమైన స్థానక స్థితిని
తాత్పర్యమున దేవతలకును మ్రొక్కి
పుష్పాంజలి యొసంగి పూని నాట్యంబు
సమకట్టి నాదంబు సభయెల్ల గ్రమ్మ
కైకోలు విడుదలల్ ఘన శిఖాశైలి
కైముడి కట్టుముల్ కనుపింపజేసి
వెలయింగ తొమ్మిది విధములు [illegible]ట్టె
భూచారి నాట్యంబు పొందుగా సలిపి
పదునారు విధములై పరగెడు యుక్తి
ఆకాశచారియుననురంగ నాడి
అంగహారాఖ్యగజట్టి నాట్యంబు
విదితమౌ తొమ్మిది విధముల నాడి
గతిచారి భేదముల్ గనుపడునట్లు
భ్రమణ సంయుతదీప్త పటిమ మీరంగ
పాణి భేదములను బాటించి చూపి
స్థానక సంచయ సంయుక్తి అమర

ప్రేరణపేరిణి ప్రేంఖణ పద్ధ
దండికాకుండలి తగు ఖడ్గచారి
సప్తతాండవములు సల్పె చిత్రముగ
సభ వారలాశ్చర్య సంయుక్తులైరి
తరువాత నిరుమేలదగు వెలులమర
సంయుతాసంయుత చలనసంకుచిత
నానార్థంబులు నాట్య హస్తములు
శిరము నను పులు చెక్కిళ్ళు బొమలు
దంతోష్ఠంబులు మరల్ తగుచు ముఖంబు
ముఖరాగ విశేషముల్ మొదలగానెన్న
అంగంబులారు ఉపాంగంబులారు
ప్రత్యంగ సముదాయం బారునుం గూడి
యిసిమిటి పటియగు వెసగునంగంబు
లసు రంగముల యంబాశ్చర్యముగను
యుంచర్ల బన్నని మహిమంబు దెలుపు
ఆంధ్ర సంస్కృత వాఙ్మయాది గీతముల
భావంబులెల్లగా ప్రకటంబు చేయ
చూచి రంభాదులు చోద్యంబు నొంది
శిరసులు వంచియు సిగ్గును జెంది
రప్పుడు భూమిజుడాదరం బొప్ప
వస్త్ర భూషణములు వారల కిచ్చె[31]

రెడ్డిరాజులు ఈశ్వరుని పూజచేసే సమయంలో నృత్యాలు జరిగేవని శ్రీనాథుడు 'కాశీఖండం'లో ఇలా తెల్పాడు

'వల్లకిచక్కి కాహళము వంశము దక్క హుడుక్క ఝర్ఝరల్
ఝల్లరి యాదిగాఁగలుగు శబ్ద పరంపర తాళబద్ధమై
యుల్లసిత ప్రబంధముల కొప్పుగ నాడుదురగ్గ వేదిపైఁ
బల్లవపాణు లీశ్వరునిఁ బంట మహీశులు పూజసేయగన్'[32]

పంట మహీశులు (పంటరెడ్లు) శివపూజచేయు సందర్భంలో వీణ-చక్కి-తప్పెట - పిల్లనగ్రోవి - డక్కి - హుడక్క ఝర్ఝరి - ఝల్లరి ఆదియైన వాద్య

విశేషాలు తాళబద్ధమై ఒప్పుగా చక్కని పాటలచే అప్పటి పల్లవప్రాణులు (స్త్రీలు) రంగస్థలమునందు నృత్యం సల్పుదురు

**రెడ్డిరాజులు**

కొండవీటి రెడ్డిరాజులు నృత్యకళను మిక్కుటంగా పోషించారు. కర్పూర వసంతరాయ బిరుదాంచితుడగు 'కుమారగిరిరెడ్డి' ఆస్థాన నర్తకి 'లకుమాదేవి'. ప్రియురాలు కూడా, ఈమె కుమారగిరి ప్రభువు రచించిన నాట్యశాస్త్రమందలి రహస్యాల్ని అద్భుతంగా అభినయించేదట

1 జయతి మహిమాలోకాతీతః కుమారగిరి ప్రభోః
సదసి లకుమాదేవి యస్యశ్రియా సదృశ్రీప్రియా
నవమభినయం నాట్యార్థానాంతనోతి సహస్రధా
వితరతి బహుర్థ్యానర్థి ప్రజాయ సహస్రశః[33]

2 జాదర జాదర జాదరయంచును
చర్చర గీతలు పాడెడు వారలు
ధ్రుతతాళమ్ము నధుంత ధుంతక
ధుంధుంకిటయని ఆడెడు వారలు
తుమ్మెద పదములు వెన్నెల పదములు
కమ్మగ గానము చేసెడు వారలు
ఏలలు పాడుచు ఈలలు వేయుచు
సోలుచు తూలుచు సాగెడు వారలు
ఝల్లరి ఝర్ఝరి మోదెడు వారలు
వల్లకి వంశిక మ్రోసెడు వారలు
డమరువులను మ్రోగించుచు ఖల్ ఖీ
ట్కారమ్ముతో తూగెడువారలు[34]

**శరిగొండ వేంకమాంబ**

ఓతాముఖానుడు పరిపాలించే ఏకశిలానగరంలో శివుని యెదుట నిత్యమూ నృత్యాలు జరుగుచున్నట్లు వర్ణించారు

సంతతోత్సవతోషిత శంభులింగ
సమ్ముఖేందు శిలానందచారుమంట
పస్థలీనృత్య దంగనా పాదరణిత
నూపురంబగు నేకశిలా పురంబు (1-10)

ఏకశిలానగరము నిరంతరము ఉత్సవాలతో ఆనందమయమైన శివలింగ సమీపమునందలి చంద్రకాంతపు రాళ్ళచే నిర్మితమైన మనోహర మండపమందు నృత్యముచేయు అంగనా పాదనూపురములచే రణితమైనదై ఒప్పుచుండెను.

## కొఅవి గోపిరాజు

సింహాసన ద్వాత్రింశికలో గంగానదిలో ఉష్ణతీర్థం నుండి వెలువడిన ఎనమండుగురు స్త్రీలు ఒడ్డునగల శివుని గుడిలో ఒకనాటిరాత్రి, శిశిమౌళిన హేమజలములతో పూజించి నాట్యసన్నాహం చేసిరి. అప్పుడు తతఘన మర్దళాది నినదంబులు నర్వదినాల్గు హాస్తలిగతులును దృగ్విలాసములు, గన్నుల పండుగా గరళ సంగతులు బలంగబాద కటకంబులు మ్రోయగ నాట్యమాడొనొక్కతె తొలుకారు క్రొమ్మెఱుగు కైవడి దద్రసభావ పుష్టిగన్ (8-12)

గొప్ప మద్దెల యొక్క నినదంబులు అరువదినాల్గు హస్తవిన్యాసాలు. విలాసవంతమైన చూపులు కలిగి పాదముల కడియాలు మ్రోయగ క్రొక్కారు మెరుగువలె రసభావ పుష్టితో ఒకర్తుగా నాట్యమాడెను.

## సింగభూపాలుడు

రేచర్ల వంశంలో సర్వజ్ఞ బిరుదాంచితుడుగ సింగభూపాలుడు రసనాట్య విషయాల్ని అభివర్ణించే రసార్ణవసుధాకరమునే కాక చివరి అధ్యాయంలో నాట్య విషయాన్ని అభివర్ణించే ఒక వ్యాఖ్యానాన్ని రచించినట్లు, ఇదే కాలంలో యక్ష గానాన్ని నృత్యనాటక మువ్వ తీర్లినది.

## విజయనగర రాజులు

శ్రీకృష్ణదేవరాయల ఆస్థానంలో రంజకంకుప్పాయి అనే దేవదాసి ఉండేది. ఈమె వంశంలోని వారే శ్రీవేంకటేశ్వరుని సన్నిధిలో నృత్యంచేసేవారని తిరుమల తిరుపతి దేవస్థానంవారు ప్రకటించిన శాసనాల ద్వారా తెలుస్తోంది. వీరికి దానములిచ్చినట్లు ఆ శాసనాల్లో వుంది.[35]

రాయల ఆస్థానంలోనే చిన్నాదేవి అనే వేశ్య వుండేదని ఆమెనే రాయలు వివాహం చేసుకొన్నట్లు చరిత్ర చెబుతోంది

విజయనగర రాజుల కాలంలో వచ్చిన పార్శీ యాత్రికుడు 'అబ్దుల్ రజాక్'[36] దశరా ఉత్సవాన్ని నాట్యప్రదర్శనలను గూర్చి వర్ణిస్తూ,

"నృత్యంచేస్తున్న సమయంలో మంటపాలకు నడుమ చక్కగా తీర్చిన కాళస్థలం ఉందట అందులో గాయకులు గానం చేస్తుండగా, కథకులు కథలు చెబుతారట శ్రీకృష్ణదేవరాయల కాలంలో అంతఃపుర స్త్రీ జనానికి నాట్యాచార్యత్వాన్ని వహించిన బండారు లక్ష్మినారాయణ అనే పండితుడు 'సంగీత సూర్యోదయ' అనే గ్రంథాన్ని రచించినట్లు తెలుస్తోంది ఇందులో నృత్యానికి సంబంధించిన అధ్యాయముంది [37]

## దేవదాసి

ఊర్వశి సంతతి వారనబడే దేవనర్తకీగణం మాత్రం ఆలయాల్లో నాట్యం చేయటానికి అర్హత కలిగియుండేవారు వీరికి బాల్యంనుండి నృత్యసంగీతాదులందు సంస్కృతాంధ్రాదులందు, ఆగమరీతులందు శిక్షణ ఇవ్వబడేవారట ఇలాంటి దేవదాసీలను పండితులు పరీక్షించి ఎన్నికచేసి తర్వాత దైవసాన్నిధ్యంలో నృత్యమాడే అర్హతను ప్రసాదించేవారు

వీరు దేవదాసి కులంవారు వీరుగాక ఇతరులకు ఆలయంయొక్క సింహ ద్వారం దాటి గజ్జెగట్టి నృత్యమాడే అర్హత వుండేది కాదు పండితులు పరీక్షించిన దేవదాసి అప్పటినుంచీ ఆ దేవుడికే అంకితమయ్యేది ఆమె ఆ దేవుని దాసీత్వంలోనే వుండేది దేవదాసీలు ఆలయాలందు మాత్రమే నృత్యం చేసేవారు. రాజులైన వీరు నృత్యాన్ని ఆరాధనా సమయాల్లో ఆలయాల్లో మాత్రమే దేవదాసీలు దైవారాధనలో సేవలో ఉత్సవాలందు, పండితసభలందు, నాట్యమాడేవారు

దేవదాసీలు యుక్తవయస్సు వచ్చిన తర్వాత దేవునికి దాసీగా ఆ భగవంతుని సేవలో సర్వమూ స్వామికే అర్పించేవాళ్ళు ఇతరులు ఎవరూ వారిని కామదృష్టితో చూడకుండా భక్తితో చూసేవారు. వీరు చిన్నతనంలో ఎంతో కష్టపడి నృత్యాన్ని నేర్చుకొనే వారని 'మల్హణ చరిత్ర'లో ఇలా వుంది.

"ఆలోన బుష్పగంధిని జాలకుడనునటునియొద్ద సామునకడినన్
మేలైన నాట్యవిద్యయు బాలిక తగనేర్చి రాజ పాత్రంబయ్యెన్ (1-19)

### దాసి ఆట లేక దాసి భరతం

దేవదాసీలు నృత్యకళను ఆరాధించుట 'దాసి ఆట' అంటారు. భరత మనగా భావ రాగ తాళాలతోకూడిన కేళికా విధానం. ఇందు నృత్తం - నృత్యం - అభినయం - గీతం - వాద్యముంటుంది. వీటినన్నింటితో కూడిన దేవదాసి నర్తనం కావున 'దాసిభరతం' అంటారు.

### భోగం ఆట

సానులు, భోగంవారు, యక్షులు, నాగాసులు అనే తెగలవారు ప్రాచీన కాలం నుంచీ ఈ నృత్యాన్ని ఆరాధిస్తున్నారు. సానులు ముఖ్యంగా ఆలయాల్లో నృత్యం చేసేవారు. భోగంవారు రాజదర్బారుల్లో, పండిత సభల్లో, విద్యాప్రదర్శన చేసేవారు. యక్షుల్ని జక్కులు అని కూడా పిలుస్తారు. వీరు అతి ప్రాచీన సంగీత సంప్రదాయాన్ని రూపొందించారట. అదే "యక్షగానం" అనేక రాజ దర్బారుల్లో సానులు, భోగంవాళ్ళు వుండేవారు ఇప్పటికీ సానులు, భోగంసానులు అనే పేర్లతో మిగిలి వున్నారు. వీళ్ళు నృత్య కళాకారిణులు.

తెలుగుదేశంలో ప్రాచీనకాలం నుండి దేవాలయాలే లలిత కళలన్నింటికిని పట్టుకొమ్మలు. వాటిలో నృత్త మొకటి. ఆలయంలో స్వామి సన్నిధిని జరిగే ఆరాధనా నృత్యాలు, కళ్యాణ మండపంలో జరిగే కేళికానృత్యాలు నట్టువమేళ సంప్రదాయానికి చెందినవి వీనిని దేవదాసీలు చేస్తారు. అందులో స్వామి సన్నిధిని రంగమండపంలో నృత్యం చేయు అధికారముద్రల్ని పొందిన దేవదాసీలకే కలదు అచ్చట నృత్యం చేయుటకు తక్కిన వారికి అర్హతలేదు. విజయనగర రాజుల కాలంలో దేవదాసీలు పవిత్ర జీవనాన్ని గడిపేవారని దేవదాసీ కావాల్సిన స్త్రీని పదేండ్ల ప్రాయమందే దేవాలయానికర్పించి అపుడు దేవునికి ఆమెకు పెండ్లి మహోత్సవ పురస్సరంగా జరుగునని, ఆమె దేవుని సేవకు అర్పింపబడినదగుట "దేవదాసి" అయిందని "బార్బోజా" అనే విదేశీ యాత్రికుడు వర్ణించాడు. తన జీవిత సర్వస్వాన్ని దేవదేవునికే అంకితమొనర్చి ఆ సన్నిధిలో తహతహపడి భగవంతునితో లయించిన దేవదాసి (గిరిక) కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి 'వేయి పడగలు'లో వర్ణితమైనది. అట్టివారు దేవదాసీలు.

## దేవాలయాల్లో నృత్యం

ప్రొద్దున్నే దేవుణ్ణి మేల్కొలిపింది మొదలు రాత్రి నిద్ర పుచ్చేవరకు జరిగే ఉపచారాలన్నింటిలో గానం తప్పనిసరిగా ఉండేది. కొన్నిచోట్ల నాట్యం కూడా. అనేక రాగాలు పాడుతూ, రకరకాలైన నాట్యాలు చేసేవారు. దేవునికి మేలుకొలుపు పాటలు, జోలపాటలు, యాలపాటలు నాట్యాలు విడిగా అవసరంగా చేసేవారు. ఎందుకంటే అతి ప్రాచీనకాలం నుండి వస్తున్న కొన్ని నృత్యాలు, సంగీతాలు మరుగున పడకుండా నిలపటానికి ఆ పూజా విధానం సహాయపడుతుంది. అందుకే భారతీయ సంస్కృతి గుడిలో పుట్టిపెరిగి రూపురేఖ దిద్దుకొంది. దీనినుండే యితర దేశాలకు వ్యాపించిందని పెద్దలు చెబుతారు. అందుకే భారతీయ సంగీతం ఉత్తమమైంది. గుడిలో దేవుళ్ళను స్తోత్రం చేస్తూ పాడేవారు భక్తితో ఆడేవారు. అందుకే నృత్యంపై అంత భక్తిశ్రద్ధలున్నాయి. ఇలా దేవుని పూజలో ఒక భాగంగా నృత్యం ఎంతో మేలుచేకూర్చింది ప్రాచీనతను నిలుపుకొంది.

## తంజావూరు నాయకరాజులు - నృత్యకళ

అచ్యుతప్ప నాయకులు (1561 ప్రాంతం) ఆంధ్రదేశంలోని గోదావరి జిల్లా 'పూళ్ళ' గ్రామంనుండి భాగవతుల్ని పిలిపించి ఇప్పటి తంజావూరు, మేలట్టూరు (అచ్యుతపురం)ను దానపట్టాగా ఇచ్చినట్లు నృసింహజయంతినాడు వారి నృత్యాన్ని ప్రదర్శించేట్టు ఏర్పాటు చేశాడు. ఇంకా నాట్యమండపాలు నిర్మించి దేవదాసీలకు అగ్రహారము లొసంగి ఉత్సవ సమయాల్లో ప్రదర్శనలు ఏర్పాటు చేసినట్లు శాసనాలవల్లా తెలుస్తోంది.[38]

రఘునాథ నాయకులు (క్రీ.శ. 1614-1633) లలితకళా ప్రియుడు కవి 'సంగీతసుధ' అనే గ్రంథాన్ని రఘునాథమేళమనే కొత్తరాగాన్ని రామానంద మేళమనే కొత్త తాళాన్ని సృష్టించాడు. ఇతన్ని గూర్చి తంజాపురీ తాళపత్ర గ్రంథంలో ఇలా వుంది.

"రాజకంఠీరవ! రాజాధిరాజ!
రాజన్య మూర్ధన్య! రాజరఘునాథ!
బహువిధనాట్య ప్రపంచమెల్ల
నభినయించిరి తమపేరు లలితయిల్లు"

విజయ రాఘవనాయకని (క్రీ శ 1633-1673) ఆస్థానంలో కళావతి, చంద్రావతి అనే నర్తకీమణులు రూపావతి, చూడామణి చంద్రరేఖ, కోమలవల్లి, శశిరేఖ అనే నాట్యకర్త్రులు, సంగీత నాట్య విద్యాపారంగతురాలైన రంగాజమ్మ, కృష్ణాజమ్మ మొ॥వారు అనేక ప్రబంధాలు యక్షగానాలు రచించి కళాకారులకు నర్తనం కాలించారు

పెనుకొండను పాలించే శ్రీరంగరాయలకు సహాయపడి శత్రువుల్ని చెల్లాచెదరు గావించి బహుమతిగా పెనుగొండ ఆస్థాన నాట్యకర్త్రి 'చంద్రరేఖ'ను తంజావూరికి తీసుకొనివచ్చి రాజనర్తకిగా చేశాడు

"మహోత్సవ మండపమునందు పేకోలగంబు పంది
కుండలీ, దండ, రాసక, ప్రేరణీ ప్రింఖణ, సింధు
కందుక, ధమాళిచేల, యక్షల్లి, హల్లీసకాది
నృత్యంబుల నవలోకించు నాతంజ భూవిడు" (రంగాజమ్మ)

మన్నారుదాసు హేయాజ్ఞనాయికా విలాసమనే యక్షగానాన్ని రచించాడు క్షేత్రయ రచించిన పదాలను ఆస్థాన నర్తకీమణులకు నేర్పించి తన ఆస్థానంలో అభినయింపచేసట్లు విజయరాఘవ నాయకుడు చేశాడు.

## కూచిపూడి నాట్యచరిత్ర

కూచిపూడి అనేది ఒక గ్రామం కృష్ణాజిల్లా లోనిది దీనికి 'కుశీలపుర మని' మరోపేరు కుశీలవులు లేక కుచీలురు అంటే దేశదిమ్మరులైన నటులు అని అర్థం మువ్వగోపాల పదాల్ని క్షే॥ తయ్యగారి జన్మస్థలం కూచిపూడి పొలిమేరలోనే వుంది క్షే॥ తయ్య పదగీతాల బోధకు కూచిపూడివారు గురువులై చాలాకాలం వరకు దేవదాసీలకు నేర్పేవారట హైందవరాజుల పాలన అంతమొందిన తర్వాత నవాబుల ఏలుబడిలో మన సంస్కృతి తగినంత పోషణ లేకుండా క్షీణదశ ఏర్పడినప్పుడు గోల్కొండ తానీషా (1685 ప్రాంతం) కూచిపూడి యక్షగానం భామాకలాపం తిలకించి మాన్యాలు ఇచ్చారట వీరు పాడే రాగాలు మోహన, ఆనందభైరవి, శంకరాభరణం, షణ్ముఖప్రియ, సహానా, ఆరభి రఘుపతి, తోడి, మధ్యమావతి, నాటకురహరప్రియ మొదలగునవి.

## కూచిపూడి నృత్య సంప్రదాయం

కూచిపూడి నృత్యం శృంగారంగా, వేదాంతంగా రూపొందింది అంతే గాక సిద్ధాంతంగా నాట్యశాస్త్రం ప్రయోగికంగా కూచిపూడి నృత్యం రూపొందింది కాని ప్రస్తుతం ప్రచారంలో వుంది ముఖ్యంగా కూచిపూడి నృత్యంలో భామా కలాపం (శృంగారం) గొల్లకలాపం (వేదాంతం) అనేవి రెండూ కూడా శాస్త్ర రూపం దాల్చినవి వీటన్నిటికి మూలం జానపద నృత్యాలే అయితే ప్రభువుల. ప్రభుత్వం ప్రోత్సాహంతో భరతనాట్యం దక్షిణాదిన ఎక్కువగా ప్రాచుర్యం పొందింది దేవస్థానాలుకూడా పోషించాయి కూచిపూడి నాట్యం ఆదిలో బ్రాహ్మణ యువకులచే ప్రదర్శింపబడటంవల్ల ప్రేక్షకులకు అంత ఆసక్తిగా వుండేదికాదు కూచిపూడి విధానంలో 'సంచార భావాలు' చాలా ప్రధానాలు వివిధముఖభావాలతోపాటు అతిశీఘ్రగతిన పదన్యాసం అన్నీ ఏకకాలంలో భరతనాట్యంలో ఇదిలేదు ఒకసారి భావం, ఒకసారి లయ అంతే

భాగవత మేళమంటే భగవత్సంబంధమైన భారత - భాగవత-పురాణ గాథల్ని నాటకాలుగా ప్రదర్శించటం అందుచేతనే దీన్ని నాటక మేళమని కూడా పిలిచారు ఇందు నర్తకులే ఎక్కువ మంది పాల్గొంటారు స్త్రీ పాత్రలుకూ పురుషులే ధరిస్తుంటారు

కూచిపూడి సంప్రదాయంలో మరో విషయం చెప్పారు నందికేశ్వరుని 'అభినయదర్పణం' కూడా కూచిపూడి నాట్యానికి లక్షణగ్రంథం. ఇది తెలుగు లిపిలో ఉండటం ఒక విశేషం. అందుకే నందికేశ్వరుడు ఆంధ్రుడని విశ్వసించ బడుతున్నాడు క్రీ శ. 13వ శతాబ్దంలో రచింపబడిన జాయపసేనాని 'నృత్త రత్నావళి' ఆంధ్రుల నృత్యకళా ఔన్నత్యానికి గీటురాయి. ఇలా తెలుగుదేశం నాట్యాధిదేవత నటరాజు నర్తించే ఆదిపీఠమై అలరారుతోంది క్రీస్తు పూర్వమే 'నృత్యకళ' ప్రచారంలో వున్నట్లు హాలుని 'గాథాసప్తశతి' తెలుపుతోంది

## భామా కలాపం

భామాకలాపాన్ని సిద్ధేంద్రయోగి రచించాడు. ఇతడు మహాభక్తుడు. యోగి సకలకళాప్రవీణుడు నాట్యకళాభిమాని సన్యాస స్వీకారానికి శ్రీకృష్ణ పారిజాత రచనకు సంబంధించిన కథ ఇలా ప్రచారంలో వుంది. యోగీశ్వరుల

గ్రామానికి అత్తగారి గ్రామానికి మధ్యలో ఏరు (వంక) వుండేదట. గురుకులంలో విద్య ముగించాక పునస్సంధాన ముహూర్తాన్ని తల్లిదండ్రులు నిశ్చయించి అత్తవారింటికి పంపారు. ఏరు దాటుతుండగా ప్రవాహం ఎక్కువైంది. గయపడి 'ఆ ఎల్లి ప్రాణి గాని నేస్యాసభూనా పుచ్ఛ్యేంగని' అన్నాడట. ప్రవాహం ఆగి పోయింది.

అత్తవారింటికి వెళ్ళి, భార్యకి విషయం చెప్పి ఆశ్రమ స్వీకారం చేసి ఆ శృంగార విలాసమంతా శ్రీకృష్ణ గానంలో తీర్చుకున్నారట.

యోగీంద్రుల కాలంలో యక్షగానాలు జానపదుల చేత ఆడబడుతూ పామర జనానికి ఉద్దేశింపబడి ఆడబడుతుండేవి. జానపదులలో ఉన్న దృశ్య కళను ముఖ్యంగా ఈ వీధినాటకాలను గ్రహించి దానికి శాస్త్రముఖం కల్పించి, పాండిత్య ప్రేరక లక్షణాన్ని ..తచేసి సంస్కరించి, నాగరకంగా తీర్చిదిద్దే ప్రయత్నం చేశారు. అనగా కూచిపూడి యక్షగానం సిద్ధేంద్ర యోగివలన జానపద వీధి నాటకంతో ఆకారయష్టిలో **(Frame Work)** చాలావరకు పోలికలు కలిగి ఉన్నా, దానికంటే భిన్నంగా నాగరక యక్షగానంగా రూపుదిద్దుకొన్నది. ఇవి ప్రాంతీయంగా తమకిష్టమైన రూపంగా (యక్షగానమనీ, వీధినాటకమనీ, వీధిభాగవతమనీ, చిందుభాగవతమనీ, బయలునాటకమనీ) మలుచుకొని ప్రదర్శిస్తున్నారు. వీటన్నింటికీ మూలం జానపద కళారూపాలే. ఇక వాటికి ఆయా పేర్లు ప్రాంతీయంగా ఎలా వచ్చాయో పరిశీలిస్తే యోగీంద్రులవారు సత్యభామ విరహ బాధను శ్రీకృష్ణపారిజాతం యక్షగానంగా రచించి తగిన ప్రయోక్తల కోసం అన్వేషిస్తూ 'కూచిపూడి' గ్రామానికొచ్చాడు. అక్కడ కొద్దిమంది విప్రయువకుల్ని వేషధారణకు అంగీకరించమని కోరాడు. ఆనాడు విప్రులు నాటకాలాడటం తప్పుగా భావించేవారు. యోగీంద్రుల మాట మన్నించి ఒప్పుకొన్నారు. ఆ యక్షగానాన్ని బోధించి సంప్రదాయానుగుణంగా నాట్యరీతులు నేర్పి వారిచేత 'భామాకలాపాన్ని' ప్రదర్శింపజేశాడు. అందువల్ల ఈ యక్షగానానికి భాగవతమని, ప్రదర్శించే వారిని భాగవతులని పేరు వచ్చింది. క్రమక్రమంగా ఈ కుటుంబం వారికి భాగవతులవారనే వంశనామం ఏర్పడింది. కాలికి గజ్జెకట్టి రచ్చకెక్కటానికి మొదలు పెట్టిన తర్వాత ఈ భాగవతులకు కళాప్రపంచంలో కూడా కుతూహలం పెరిగింది. కొత్త రచనలకోసం వెతికారు. ఆటవిక, జానపదుల నాట్యవిశేషాల్ని

వెలికితీసి వారి తాళాన్ని శాస్త్రీకరించి నాట్యప్రయోగంలోకి తెచ్చి ఇతర విప్ర కుటుంబాల వారికీ ఈ కళాప్రపంచంలో సావకాశం కలిగించి కృష్ణాతీరం నుంచి కావేరీ తుంగభద్రతీరాల వరకు బంగారు పల్లకిలో ఊరేగించారు.39

భామాకలాపం కూచిపూడి కళకు జీవం. ముఖ్యంగా శ్రీకృష్ణుడు సత్యభామల ప్రణయకలహం. వారు విడిపోవటం, సత్యభామ ఆ ఎడబాటుకు తపించి పోవటం 'మాధవి' అనే చెలికత్తెతో రాయబారం పంపటం, శ్రీకృష్ణుడు ఇంట్లో లేడని తెలిసిన మన్మథుడు తన పరివారంతో వచ్చి సత్యభామను బాధపెట్టటం, మాధవి శ్రీకృష్ణునివద్దకు వెళ్ళి సత్యభామ ఇచ్చిన ఉత్తరం ఇవ్వటం శ్రీకృష్ణుణ్ణి రమ్మని ప్రార్థించటం, అతడు వచ్చేలోగా సత్యభామ మూర్ఛపోవటం, తేరుకోవటం, శ్రీకృష్ణుడు రావటం, అతనితో కొద్దిసేపు తగవులాడటం, చివరకు కలిసికోవటం ఈ కథనే 'సత్యభామాకలాపం' అంటారు.

### గొల్లకలాపం

గొల్లభామకు బ్రాహ్మణునకు జరుగు వేదాంత విషయమైన తర్కం. పిండోత్పత్తి జననం, మానవజీవిత పరమావధి, జన్మవలన బ్రాహ్మణులు కారని తక్కువజాతి వారైనా గొల్లలైనా సత్కర్మలు ఆచరించుటవల్లా బ్రహ్మజ్ఞాను లగుదురని తెలియజేసే విషయం చర్చించబడుతుంది.40

## (ఈ) పురాతన మూలాలు

పురాణాలను ఒక దేశ చరిత్రలోని వివిధ దశలకు ప్రతీకాత్మకమైన కల్పనలుగా చెప్పవచ్చు. పురాణంలో నృత్యప్రతీకలుగా ప్రధానంగా ఇద్దరు చెప్పబడ్డారు. వారు శివుడు - శ్రీకృష్ణుడు. శివుడు దక్షిణమని, శ్రీకృష్ణుడు ఉత్తరమని అంటారు. ప్రధానంగా నృత్యప్రతీకలుగా మిగిలి ఉన్నాయి. ఈ రెండి మధ్య తేడాలివి.

శివుడు < ప్రణయం - శృంగారం
ప్రళయ - సంహారకారుడు - వీరం - రౌద్రం - భీభత్సం

శ్రీకృష్ణుడు < ప్రణయం - శృంగారం
వైష్ణవతత్వం - మోహిని (శివుడి ప్రణయ నృత్యం)

శివుని తాండవం విశ్వగతికి ప్రతీకాత్మకమైన కల్పన. నటరాజ విగ్రహాన్ని చూస్తే విగ్రహానికి నాలుగు చేతులు, ఒక కాలు పైకెత్తబడి ఉంటుంది. భూమిపై ఆనించిన కాలి క్రింద ఒక రాక్షస స్వరూపముంటుంది. ఒక చేతిలో దమరుకం ఉంటుంది. రెండవ దానిలో అగ్ని ఉంటుంది. మిగిలిన రెండు చేతులు అభయవరద ముద్రల్లో ఉంటాయి. కుడిచేతిలోని 'దమరు' సృష్టికాధారమైన నాదాన్ని ఉత్పత్తిచేసే వాద్యం. సృష్టికి ఆధారం నాదమని సూచిస్తుంది. నిశ్చలంగా నిస్తరంగితంగా ఉన్న సృష్టిలో 'దమురుకం' ప్రయోగించగానే అందులో నుండి ఉత్పత్తి అయిన నాదంలో నుండి శబ్దాలు పుడుతున్నాయి.[41] అవి లయ విన్యాసం కల్గినవి. వాటివల్ల అనేక కదలికలు పుడుతాయి.

స్తబ్ధంగా వున్న జడ ప్రకృతిలో చైతన్యం పుడుతోంది. స్వరాలు కూడా అలా పుడుతున్నప్పటికీ ఈ స్వరాలే వివిధ రాగాలుగా రూపొందుతాయి. వివిధ రసాలు భావాను భూతులకు కారణాలవుతాయి. అక్షరాలు అక్షరాల కూర్పు, మాటలు, మాటల కూర్పు, వాక్యాలు, వ్యాలవల్ల ఒకరి భావాలు మరొకరికి తెలుసుకొనే అవకాశం కల్గుతోంది. కనుక స్వరం నాదాత్మకం అని సూచిస్తోంది దమరుకం. ఎడమచేతిలో వున్న అగ్ని అనంతమైన ఈ ప్రపంచాన్ని అంత మొనరించే శక్తి. కాలిక్రింద రాక్షసరూపం ప్రపంచాభివృద్ధిని నిరోధించే శక్తుల్ని రూపుమార్చుటను తెలియచేస్తుంది. నేరుగా భూమిపైనుండి పైకెత్తబడిన పాదం ఈ ప్రపంచబంధాల నుండి జీవుణ్ణి వేరు పరచడాన్ని అభయ వరదహస్తాలు జీవుడు మోక్షం పొందటాన్ని సూచిస్తాయి.

## శివుడు

శివుని ప్రమథగణాల్లో నిత్యసంబంధమున్నవారు ముగ్గురు 'నంది - భృంగి - తండు'. తండు ప్రచారంలోకి తెచ్చిందే తాండవం.[42]

శివుడు పులితోలును అందంగా అలంకరించుకొని తలపై చంద్రరేఖను ధరించి నృత్యం చేసేవాడట. ఇతనికి ముగ్గురు భార్యలు 'సతీదేవి - పార్వతి - గంగాదేవి' మొదటి భార్య దక్షప్రజాపతి కుమార్తె. ఈమెకు శివుడంటే ప్రేమ. తండ్రిచేసే యజ్ఞానికి పిలవకుండానే భర్తనడిగి వెళ్ళింది. అందరిలోనూ అవమానాలపాలై భర్త నిందను భరించలేక అక్కడే చితిని పేర్చుకొని చనిపోయింది. శివునికి తెలిసి కోపంతో అక్కడికొచ్చి తన శక్తివల్ల జడలో కేశాలను లాగి క్రింద

వేశాడు. వీరభద్రుడు పుట్టాడు. యజ్ఞాన్ని ధ్వంసం చేశాడు. ప్రక్కనున్న సతీదేవి నెత్తుకొని ఆవేశంతో, ఆవేదనతో కోపంతో ఒళ్ళు తెలియక ఆడాడు. భూమి దద్దరిల్లింది. దిక్కులు పిక్కటిల్లాయి. నదులు సముద్రాలు పొంగాయి. కొండలు పర్వతాలు వణికాయి. ఇదే శివుని 'ప్రళయతాండవం' అంటారు. దీన్ని శివుడు ప్రత్యేకంగా ఆడలేదు. ఆ సమయంలో శివుడు ప్రదర్శించిన కాళ్ళు చేతులయొక్క కదలికలే తాండవమైంది.43 వీరభద్రుడు యుద్ధంచేసి శత్రు సంహారం చేయటం మాత్రం ప్రసిద్ధమైంది. ఇతని అంగవిన్యాసాలన్నీ నాట్యమయ్యాయి. అదే 'వీరనాట్యం'44 వీరభద్రుని పేర జరిగే ఉత్సవాల్లో వీరముష్టివారు ఈ నాట్యాన్ని ప్రదర్శిస్తారు. ఇది పురుషులు మాత్రం చేసే ఏకపాత్ర తాండవం. దీన్నే నేడు ప్రేరణ లేక పేరిణి తాండవమని విశిష్ట సంప్రదాయంగా శ్రీ నటరాజ రామకృష్ణగారు రూపొందించారు. దీన్ని ప్రత్యేకంగా "రుద్రులు, మహేశులు, పశుపతులు, మైలారుదేవులు" అనే నాలుగు తెగలవారు శివునికి ప్రేరణగా ప్రదర్శించేవారు. ఇది వీరరస ప్రధానమైంది. నృత్తనృత్యాలు రెండిటినీ ప్రదర్శిస్తారు.45

పైన తెల్పిన 'తాండవం' ఆటవిక నృత్యాల్లో కన్పిస్తుంది. చర్మవాద్యాలు ప్రయోగిస్తూ వారు రౌద్రంగా వేసే అడుగులు, కేకలు, అరుపులు, పులులతో పోరాటం సల్పుతున్నపుడు రౌద్రాకారంగా ఉండటం, ఇక జానపదుల్లో కొన్ని మతాచారా వీధుల్లో తాండవానికి మూలాలున్నాయి. బలిపీఠం దగ్గర బలిజంతువును పట్టుకొని యాట కొడవలితో నరికే సమయంలో 'కో బలీ' అంటూ వేసే 'కేక' అడుగులు రౌద్రంగా ఉంటాయి. బలిజంతువు గట్టిగా అరవటం, జంతువును నరికిన తర్వాత భీభత్సం, ఇంకా మొహరం పండుగ సమయంలో పూనకం తెప్పించే సమయంలో మంగళవాద్యాలు (మేళాలు) తప్పెటగతులు, 'ముల్లాసాబు' (పూజారి) 'జావ్ సొండీం మౌలాలి' అంటూ గట్టిగా పలుకుతూ వేసే అడుగులు. అగ్నిగుండంలో నడవటం, ఒగ్గుకథలో డమరుకం (ఒగ్గు) వాయిస్తూ కథకుడు కథానుగుణంగా వేసే అడుగులే తాండవంగా పేరు ప్రచారంలోకి వచ్చింది. రౌద్రంగా ఆటవిక, జానపద నృత్యాల్లో భంగిమలు అనేకం రౌద్రాకారపు భంగిమలే నేడు అనేక ప్రళయతాండవాలుగా శాస్త్రీయరీతుల్లో రకరకాల పేర్లతో ప్రదర్శింపబడుతోంది. కావున ప్రచారంలో ఉన్న మతపరమైన నర్తనానికి మరో నాగరికత ముఖం కల్పించడం ఈనాడు జరిగింది. అదే శివతాండవం, * పేరిణి మొ॥

## పార్వతి

సతీదేవి మరణంతో శివుడు వియోగంతో ఉండగా బ్రహ్మ - సరస్వతి, విష్ణువు - లక్ష్మీదేవి ఊరడించారు కానీ శివుడు స్త్రీలను చూడకూడదని ఏ అరణ్యంలోనో అడవుల్లోనో తపస్సు చేసుకొంటూ స్త్రీ సంచారంలేని ప్రదేశంలో ఉండాలని నిశ్చయించుకొన్నాడు హిమాలయాల్లో ఒక ప్రశాంతమైన ప్రాంతాన్ని ఎన్నుకొని తపస్సు చేసుకొంటూ ఉండిపోయాడు సతీదేవి హిమాలయ ప్రాంతాన్ని పాలించే హిమరాజు మేనకాదేవికి పుత్రికగా పుట్టి పార్వతి' అయ్యింది ఆమె శివునిపై అనన్య భక్తితో ఆయన్ని కొలిచింది

## మన్మధభంగం

తారకాసురుడనే రాక్షసుడు బ్రహ్మవల్ల చావు లేకుండా వరం పొందాడు. తర్వాత అందర్ని బాధ పెడుతుండగా తరుణోపాయాన్ని విష్ణువునడిగి దేవతలు తెలుసుకొన్నారు చివరికి శివునికి పుట్టిన కుమారుడే ఆ రాక్షసుణ్ణి చంపగలడని తెలుసుకొన్నారు దేవతలంతా మన్మధున్ని పిలిచి విషయం తెలిపారు వెంటనే మన్మధుడు శివుడు తపస్సుచేసే ప్రాంతానికొచ్చి అదునుచూసి తన బాణాన్ని వదిలాడు శివునికి తపోభంగమై ప్రేమ పుట్టింది శివుడు ఆశ్చర్యచకితుడై తాను సన్యాసిగా జీవించాలనుకొంటే ప్రేమ పుట్టిందని కనులు తెరచాడు ఎదురుగా మన్మధుడు కన్పించాడు తపోభంగానికి కారకుడని తెలుసుకొని కోపంతో మనస్సు భగ్గున మండింది. నేత్రాలనుంచి నిప్పులు వర్షించాయి. ఆ చూపులకి తట్టుకోలేక ఆ క్రోధాగ్నిలో మన్మధుడు బూడిదయ్యాడు ఆ ప్రదేశమంతా దద్దరిల్లింది

దగ్దద్ - దగ్దద్ధం - ధాం కిటకిట - దిగ్దిదిగ్ది ధీం ధీం కిటకిట తకధళాంగ్ ధళ - ధళ ధళ ళ్లాంగ్.[46]

ఇంకా శివుడు కోపం పట్టలేక ఎగిరిగంతులు వేశాడు అందరూ అదిరిపోయి భయపడ్డారు శివుని కోపం ఎంతకీ చల్లారక భస్మమైన బూడిద శరీరం నిండా పూసుకొన్నాడట. మరికొంత సమయానికి ఆ కోపం తగ్గింది. అంటే శివుని మరొక రౌద్రతాండవమైంది ఇలా శివుడు రెండుమార్లు నృత్తాన్ని రౌద్రంగా ప్రదర్శించాడు తర్వాత శివుడు పార్వతిని పెళ్లి చేసుకొన్నాడు. వారికి కుమారస్వామి పుట్టి తారకాసురున్ని చంపాడని కథ.

శివుడు చేసిన తాండవాలు ఏడు. వీటిని సప్తతాండవాలని పిలుస్తారు. 'ఆనంద తాండవం - సంధ్యాతాండవం - కాళికాతాండవం - ఉమా తాండవం - విజయ తాండవం - ఊర్ధ్వతాండవం - సంహార తాండవం' ఇంకా శుద్ధ - దేశి - పేరిణి - ప్రేంఖణ - దండిక - కుండలి - కలశ అనే తాండవాలున్నాయని నటరాజ రామకృష్ణగారు తెలిపారు.[47]

సంధ్యాసమయంలో బ్రహ్మ తాళం వేస్తుండగా, విష్ణువు మృదంగం వాయిస్తుండగా, ఇంద్రుడు మురళిని ఊదగా, శివుడు ఆడాడట. అందుకే అది సంధ్యా తాండవమైంది. పార్వతికి నృత్యమంటే మక్కువ. అందువల్ల ఇద్దరు కలిసి ఆడారట.

ఊర్ధ్వతాండవం శివపార్వతులు కలిసి ఆడారట. పార్వతి నృత్యంలో శివునికంటె అందెవేసిన చేయి. ఇది శివపార్వతుల ద్వంద్వనర్తనం. శివతత్వాన్ని, పార్వతీతత్వాన్ని ఎరుకపరచే విన్యాసాలు ఇందులో వుంటాయి. లాస్యతాండవ పద్ధతికి చెందిన విన్యాసాలతో కూర్చబడ్డ ఈ నృత్యంలో శృంగారం, వీరం ప్రదర్శింపబడతాయి. దీంట్లో స్త్రీల శృంగార పద్ధతి, పురుష శృంగార రీతి చూడతగ్గవి ఇలా చేస్తుండగా పార్వతి నృత్యంలో అధిగమించి శివున్ని మించి పోగా అపుడు నృత్యంలో పార్వతికే ప్రథమస్థానం లభించాలట. అలాంటి సమయంలో శివుడు ఒక భంగిమను ప్రదర్శించాడట. ఈ భంగిమను స్త్రీలు ప్రదర్శించటానికి వీలువేనిది. ఒక కాలును చేతిని శిరస్సు పైభాగంలో పెట్టుకోవటం. ఒంటి కాలుమీద భంగిమను చూపెట్టటం అపుడు పార్వతి సిగ్గుతో నూపించవ శివునికీ ప్రథమ స్థానం ఇచ్చిందట.[48] ఈ తాండవాన్ని ఈనాటికీ అనేక మంది పగటి వేషగాళ్ళు చేస్తున్నారు. ఆ భంగిమను వివరణ అంతగా ప్రదర్శించ లేకున్నారు. ఈ తాండవంలో శివపార్వతులకు సంబంధించిన అనేక పౌరాణిక గాథల వర్ణనలో వుంటాయి. ప్రదర్శనా సందర్భాన్ని అనుసరించి శృంగార, వీర, భయానక ఇత్యాది భావాలకు సంబంధించిన గేయాల్ని ఎన్నుకొని నృత్యం చేస్తారు.[49]

## అర్ధనారీశ్వర నృత్యం

త్రిపురాసురుడు స్త్రీ చేతిలోను, పురుషుని చేతిలోనూ చావకుండా వరం పొందాడు. శివుడు అతన్ని చంపటానికి స్త్రీ పురుష శక్తుల్ని రెండింటిని తనలో

చేర్చి అతనితో యుద్ధంచేసి సంహరించాడు. త్రిశూలాన్ని కపాలాన్ని కుడిచేత ధరించి దానితో త్రిపురాసురున్ని పొడిచి వెంటనే వామహస్తంతో త్రిశూలాన్ని ధరించి మరలా పొడిచి సంహరించాడు. ఈ అర్ధనారీశ్వరునిలో[50] దక్షిణభాగం శివుడు, వామభాగం అంబ. దక్షిణ భాగంలో భంగిమను పట్టినపుడు శివుడు వీరరౌద్ర భావాలను ప్రదర్శిస్తాడు. అలాగే వామభాగంలో భంగిమ పట్టినపుడు కూడా వీరరౌద్ర భావాలను ప్రదర్శించాలి. అయితే మొదటిది తాండవం, రెండవది స్త్రీ, వీరం మొదటిది. పురుష ప్రకృతి రెండవది. స్త్రీ ప్రకృతి. ఈ రెండింటిలో సౌందర్యాన్ని నృత్యకళాకారులు కళ్ళకు కట్టినట్టు ప్రదర్శించాలి నృత్యం చేయాలి- శివతాండవాలన్నింటిలో ఇది చాలా విశిష్టమైన అంశం. ఈ తాండవాలన్నీ సృష్టి ఆరంభం. అభివృద్ధి. అంతాన్ని సూచించు నృత్తాలే. సప్తతాండవాలకు ఇతివృత్తాలు.[51]

## గంగాదేవి

శివుని మూడవ భార్య గంగాదేవి. చిన్న భార్య. శివునికి ప్రీతిపాత్రురాలైన భార్య. అందుచే తలమీదకెక్కి కూచుంది. నృత్యంలో శివుని అలంకరణలో గంగాదేవి పాత్ర ప్రసిద్ధమైంది. ఇతని శిష్యులైన 'తండు-భృంగి' ద్వారా ప్రపంచంలో శివుని నృత్యాలు ప్రచారమయ్యాయి. అట్లే పార్వతి నృత్యాన్ని సాధనచేసి అదే పద్ధతిలో తన శిష్యురాలైన ఉషకు నేర్పి ప్రచారం చేసింది. ఉష బాణాసురుడనే రాక్షసుని కూతురు. ఈమె శ్రీకృష్ణుని మనుమడైన అనిరుద్ధుణ్ణి పెండ్లాడింది. బాణాసురుడు శివున్ని మెప్పించి ఎప్పుడూ నిన్నే చూడాలి నీవు నా కోటలో వుండాలని కోరగా అదే విధంగా శివుడు ఒప్పుకోవటం మూలాన పార్వతి కూడా వచ్చి అతని కుమార్తె అయిన ఉషకు నృత్యం నేర్పించింది. అలా శివపార్వతుల ద్వారా నంది, తండు, భృంగి మొ॥ వారి ద్వారా నృత్యానికి ప్రచారం లభించింది.

## శ్రీకృష్ణుడు

శివునితోపాటు విష్ణువుకూడా ఒక నృత్యమూల ప్రతీకగానే పౌరాణిక వాఙ్మయంలో కనిపిస్తున్నాడు. విష్ణువు ఎత్తిన ద్వాపరావతారమే శ్రీకృష్ణుడు. దేవకీ వసుదేవుల కుమారుడని ఇతిహాసం. శ్రీకృష్ణుని లీలలు, అతిమానుషాలు, అత్యద్భుతాలు. వీటిలో నృత్యమూలాలైన లీలలూ వున్నాయి. శ్రీకృష్ణుడు నర్త

కుడు, గాయకుడు, శృంగారరసమూర్తి. నారాయణతీర్థులు తమ కృష్ణలీలా తరంగిణిలో శ్రీకృష్ణుడంటే మధురమూర్తి అని చెప్పాడు. (మధురం మధురం అధరం మధురం ఏకయ యశోదేవహాలం) కృష్ణలీలా తరంగిణి అంతా శ్రీకృష్ణ నాట్యకళా విలాసమే.

## కృష్ణ నృత్యంలో జానపదాంశాలు

'తాండవం'లాగే కృష్ణుడు రాసలీల, బృంద నృత్యం, అది ఒక గొల్లపల్లె. గొల్లలకు సంగీతమంటే ఎంతో ప్రీతి. శ్రీకృష్ణుడు పిల్లనగ్రోవిని ఊదుతుండగా పనిపాటలు మానుకొని గొల్లపడుచులందరూ అతనిచుట్టూ చేరి నృత్యం చేసేవారు. దీన్నే 'రాసక్రీడ' అంటారు. స్త్రీలే కాకుండా పశుపక్ష్యాదులు, గోవులు అన్నీ మైమరచి పోయేవి. అలాంటిది వేణుగానమహిమ.[52] గొల్లభామలు రేయింబగలు ఆడుతూపాడుతూ వుండగా వారి భర్తలకు కోపం వచ్చింది. శ్రీకృష్ణుడు మురళి నూదగా వెంటనే గొల్లభామలు ఇంటినుంచి పరుగెత్తటం జరిగేది. అపుడు ఆ మురళి కారణమనుకొని అందరూ కోపంతో గొడ్డళ్ళను తీసుకొని వెదురుపొదలను నరికి తగులబెట్టారు. కానీ వేణుగానం వస్తూనే వుంది. ఆ లీల శ్రీకృష్ణునిలో వుంది. అమాయకులైన గొల్లవారికి తెలేదు.

బాల్యంలో శ్రీకృష్ణుడు గొల్లపల్లెలో పసిబాలకులతో కలిసి ఆటలు ఆడే వాడు. పశువుల కాపరిగా వుండేవాడు. కాళింది మడుగులో విషసర్పం గర్వాన్ని అణచటానికి ఆ మడుగులోకి దూకాడు. పామును పట్టుకొన్నాడు. దాని పడగపై నిలబడి శ్రీకృష్ణుడు నృత్యం చేశాడు. ఇదే కృష్ణ నృత్యానికి మూలమైంది.[53]

శ్రీకృష్ణుని మేనమామ కంసుడు. కంసునికి శ్రీకృష్ణునివల్ల మరణముందని తెల్సు. కృష్ణుడు రేపల్లెలో పెరుగుతున్నాడు. విషయాన్ని తెల్సుకొని కంసుడు ఎన్నో కుయుక్తుల్ని చేశాడు. కానీ అన్నింటిలోనూ కృష్ణుడే నెగ్గాడు. ఒకసారి కృష్ణుణ్ణి కంసుడు మధురకు ఆహ్వానించాడు. రేపల్లెలో అందరూ భయభ్రాంతులైనారు. కానీ కృష్ణుడు సంతోషంతో వెళ్లాడు. అపుడు కంసుడు మదపుటేనుగును కృష్ణుని మీదకు పంపించాడు. కృష్ణుడు తెలివితో తొండం మీద కెగబ్రాకి దంతాన్ని పూడపెరికి, ఆ దంతంతోనే చంపాడు. అపుడు ప్రతి కదలిక చక్కని నాట్యమైంది. అందుకే అదొక నాట్యమైంది. అదే ఏనుగు పేరిట "కువలయా పీడనర్తనం" అని పిలుస్తున్నారు.

కృష్ణుని నృత్యాల్లో "రాసక్రీడ" ప్రధానం రాధాకృష్ణుల ప్రణయకలహం దీంట్లో కృష్ణుని అన్యకాంతాసక్తివల్ల రాధకు బాధ, కోపం కల్గుతాయి అందువల్ల కృష్ణున్ని నిరాకరిస్తుంది తనను మన్నించవలసిందిగా కృష్ణుడు వేడుకొంటాడు అలా బ్రతిమలాడి చివరకు రాధను ప్రసన్నం చేసుకొంటాడు ఇది అనేక రకాలు 'నిత్యరాస నృత్యం, దివారాసనృత్యం, నటరాసానృత్యం, అష్టగోపీ, అష్టశ్యామరాస నృత్యం'

నిత్యరాస నృత్యం ఎపుడైనా చేయవచ్చు దివారాస నృత్యం పగటివేళ మాత్రమే చేయాలి నటరాసానృత్యం ఎనిమిది మంది గోపికలు శ్రీకృష్ణునితో నృత్యం చేయటం, అష్ట గోపీ, అష్టశ్యామ నృత్యంలో వసంతకాలంలో ప్రదర్శిస్తారు దీని పేరు సూచించే విధంగా ఇందులో ఎనిమిదిమంది గోపికలు ఎనిమిది మంది కృష్ణులు పాల్గొంటారు ఈ నృత్యాన్ని ఇలా విభజించుకోవచ్చు శ్రీకృష్ణుడు ప్రవేశం, రాధ ప్రవేశం, రాధాకృష్ణులు కలిసి నృత్యం, రాధ కాసీ కృష్ణునితో కలిసి నృత్యం చెయటానికి నిరాకరించినపుడు సంభవించే సంవాదం ఆ తర్వాత బ్రతిమలాడటం, రాధాకృష్ణుల కలయిక గోపికలతో వారు ఆనందంగా నృత్యం చేయ్యటం ప్రార్థన, రాధ, గోపికలు, కృష్ణుని యెడ శాశ్వత భక్తి, ప్రమాణం చయ్యటం

## మోహినీ భస్మాసుర నృత్యం (శివవిష్ణు సంబంధం)

విష్ణువు భస్మాసురుణ్ణి చంపటానికి స్త్రీగా మారాడు. భస్మాసురుడు శివ భక్తుడు. శివుణ్ణి మెప్పించి, నేను ఎవరినెత్తిమీద చేయిపెడితే వారు భస్మమైపోవాలి అని వరం కోరాడు. శివుడిచ్చాడు వెంటనే శివునిమీద ప్రయోగం చేయాలని అతనిమీది కెళ్ళాడు శివుడు భయపడ్డాడు అపాయాన్ని తెలుసుకొన్న విష్ణువు అందమైన స్త్రీలాగా మారాడు ఆ రూపమే 'మోహిని' అడవిలో భస్మాసురుణ్ణి చూసింది. ఆమెను వలచాడు భస్మాసురుడు నన్ను పెండ్లి చేసుకోమని బ్రతిమలాడాడు. వద్దని కులికింది ఆడింది పాడింది ఏడ్పించింది చివరకు పెళ్ళికి ఒప్పుకొని మోహిని ఒక నియమం పెట్టింది. నేను గొప్ప నర్తకిని నేను ఆడినట్టు ఆడాలి అనింది సరే నన్నాడు ఇద్దరూ నృత్యం మొదలుపెట్టారు ఆమె భంగిమ చూపించి నిలిచింది అట్లాగే అతడు ఆడాడు అలా ఆడిఆడి ఆమె వ్యామోహంలో పడిపోయాడు చివరికి ఆమె తన చేతిని తలమీద ఉంచుకోగా వెంటనే భస్మాసు

రుడు తన చేతిని తన తలమీద పెట్టుకొన్నాడు. వెంటనే భస్మమైపోయాడు. ఇదే మోహినీ భస్మాసుర నృత్యంగా నిలిచి పోయింది.

## రంభ - మేనక - తిలోత్తమ - ఊర్వశి

స్వర్గ నర్తకీమణులైన 'రంభ - మేనక - తిలోత్తమ - ఊర్వశి' ప్రము ఖులు భరతవిద్యకు ముఖ్యమైన నృత్త, నృత్య, అభినయాలలో వివి విశేషమైన కృషి చేశారట. రంభకు సంబంధించిన నృత్యం పాటల్లోని వర్ణనలు అయా దేవతల భంగిమల్ని ప్రదర్శిస్తూ ఆయా పాటల అర్థాన్ని తెలియజేస్తూ నృత్యం చేయటం. మేనక నృత్యం తాళలయల విన్యాసాల ద్వారా హస్తపాద విచలితం ద్వారా నృత్తం ప్రదర్శింప చేయటం. అంతేగాక పాముగారడీలవంటి అనేక ఇతర విన్యాసాలు కూడా నృత్తంలో ప్రదర్శింపచేసేది ముగ్గువాలటం, ఒక కాలు నెత్తి శిరస్సుకు తగిలించి ఆడటం, కుండలపై నాట్యం చేయ్యటం తలపై చెంబు పెట్టుకొని పళ్లెంపై నిలబడి ఆడటం, ముగ్గవాలి నొసటితో బొట్టు తీయటం. కంటి రెప్పలతో సూదులు తీయటం, ఇలాంటివన్నీ చేసేదట. ఇవన్నీ ఈనాడు మనం "బొమ్మరాట"లో చూడవచ్చు. తిలోత్తమ ఎలాంటి నృత్యంలో పేరు గడించిందో తెలీదు. ఊర్వశి విషయం. పూర్వం నరనారాయణులు బదరికా వనంలో తపస్సు చేస్తుండగా ఇంద్రుడు ఓర్వలేక తపోభంగం కొఱకై రంభను పంపాడట. ఆమె శరీర అవయవాల విన్యాసాలతో నృత్యం చేసింది. దాన్ని నారాయణుడు గ్రహించి వెంటనే తన ఊరువులోనుండి ఒక అందమైన స్త్రీని సృష్టించాడు. రంభకన్నా అందగత్తె. రంభ ఆమెను చూసి తల వంచేసింది. ఇంద్రుడు వచ్చి వేడుకొన్నాడు. నారాయణుడు క్షమించాడు. ఊరువులో పుట్టింది కనుక 'ఊర్వశి' అయ్యింది. ఆమెను ఇంద్రునికే కానుకగా పంపించాడు. ఇంద్రుని వెంట ఇంద్రలోకాని కెళ్ళింది. ఊర్వశి సంతానమే తెలుగు దేశంలోని నర్తకీ మణులు [దేవదాసీలు].

## అర్జునుడు

పాండవ మధ్యముడు అర్జునుడు. శ్రీకృష్ణుని బావమరది. ఊర్వశి శాపం వల్ల స్త్రీ రూపం కల్గింది. నాట్యాచార్యుడుగా ఉత్తరకు నాట్యం నేర్పించటంలో ఆ శాపాన్ని వరంగా మార్చుకొన్నాడు. అంతేగాక అర్జునుడు గజ్జెకట్టి నాట్యమాడి రసికుల్ని మెప్పించాడు. అనేక ప్రదేశాలు తిరిగి నృత్యాన్ని ప్రచారం చేశాడు

హస్తినాపుర, మణిపురం, ఓఢ్రదేశం, మలయాళదేశం తిరిగి రాజకన్యల ముందు నృత్యం చేశాడట వారు సమ్మోహితులై నృత్యాన్ని నేర్చుకొన్నారు అర్జునుడు నాట్యాచార్యుడయ్యాడు

## (ఉ) నాట్యశాస్త్రం చెప్పిన మూలాలు

ఇంతవరకు పురాణ ప్రతీకలుగా చర్చించిన 'శివ - పార్వతి - కృష్ణా'ది తత్వాలకు వాచ్యమా అన్నట్టు నాట్యశాస్త్రం కూడా 'నృత్త - నృత్య - నాట్య' త్రయాన్ని ప్రతిపాదించింది

## నృత్తం

నృత్ అనే ధాతువునుంచి నృత్తం, నర్తనం, నర్తకి, నర్తకుడనే పదాలు పుట్టాయి

గీతవాద్యాది మిళితం లయమాత్ర సమాశ్రయం
అంగవిక్షేపణం నృత్తం భవే దభినయ చ్యుతమ్[4]

పాట వాద్యాలు మొదలగువానితో కలిసి లయను మాత్రం ఆశ్రయించి, అభినయం లేక అంగముల నాడించుట నృత్యం.

కరణ అంగహార సంపన్నమైంది నృత్తం ఇది అర్థాన్ని బోధించదు. కేవలం అవయవ విన్యాసాలతో కూడి వుంటుంది. ఇది మొదటిది.

### నృత్త ప్రశంస

భావనోఽపి
సదాశివాద్యాకృతి భేదయోగే
యత్కౌతుకం కారణ మాహు రార్యాః
నృత్తం న కిం కస్య భవేత్సుఖాయ[5]

నిరాకారస్య రూపుడైన శివుడు సాకారుడు కావటానికి నృత్తంలోని కుతూహలమే కారణమని పెద్దలు చెబుతారు అలాంటి నృత్తం ఎవరికి సుఖం కలిగించదు.

## నృత్తసమయం

యాగోద్వాహ మహాభిషేక నగరీ వేశ్మ ప్రవే...
క్రీడాసు ప్రియసంగమ వ్రత మహాదానాత్మ ...త్మ...
యాత్రా పర్వపరీక్షణోత్సవ జయానంద ప్రతిష్ఠేహిత
ప్రాప్తిష్వభ్యుదయాయ నృత్తముచితం స్యాద్దేవ పూజా..."

యజ్ఞం, పెండ్లి, పట్టాభిషేకం, నగరప్రవేశం, జలక్రీడ, ప్రియాసంగమం, వ్రతం, మహాదానం, పుత్రజననం, యాత్ర, పండుగ, పరీక్షణం, ఉత్సవం, విజయానందం దేవాలయ ప్రతిష్ఠ ఇష్టార్థసిద్ధి, దేవపూజ మొ॥ సందర్భాల్లో అభ్యుదయం కోసం నృత్తల ఉచితమైంది.

"గాత్ర విక్షేపణార్థత్వాత్ నృత్తే బహుళ మాంగికమ్
వివిధేన విలాసేన క్షేపో విక్షేప ఇష్యతే [57]

శరీరాన్ని విక్షేపించడమే దాని ప్రయోజనం కాబట్టి నృత్తంలో ఆంగికాభినయం ఎక్కువగా వుంటుంది. వివిధాలైన అందచందాలతో అవయవ చలనం చెయ్యటమే విక్షేపణం.

'అస్యా చార్యో మృడానీశః యతఃసంధ్యాసునృత్యతా
మయాపీదం స్మృతం నృత్తం ఇత్యుక్తం చంద్రమౌలినా[58]'

సంధ్యాకాలంలో నృత్యం చేసినప్పుడు నాకీ నృత్తం కూడా స్మృతికి వచ్చిందని చంద్రమౌళి (ఈశ్వరుడు) చెప్పాడు కాబట్టి ఆయనే నృత్తం సంప్రదాయానికి తొలి ప్రవర్తకుడు అని నాగరకులు విశ్వసిస్తారు.

అంగికాభినయమే ప్రధానమైన నృత్తంలో ఎన్నోరకాల అంగ విక్షేపణలున్నాయి. వాటిని చూద్దాం. ఇక్కడ కేవలం హస్తవిక్షేపణలు మాత్రం వర్ణింపబడతాయి.

## నృత్త హస్తాలు

చతురస్రాది భేధాలచే నృత్తహస్తాలు ముప్పది రకాలు - చతురస్రాలు ఉత్ప్రవృత్తాలు - తలముఖలు - స్వస్తికాలు - విప్రకీర్ణాలు-అరాళకాముఖాలు - ఆవిద్ధవక్రాలు సూచీముఖాలు - రేచితాలు - అర్ధరేచితాలు -ఉత్తానవంచితాలు - పల్లవాలు -

నితంబాలు - కేశబంధాలు - లతలు - కరిహస్తాలు - పక్షవంచితకాలు - పక్షద్యోతకాలు - గరుడపక్షాలు - దండపక్షాలు - ఊర్ధ్వమండలులు - పార్శ్వమండలాలు - ఉరోమండలులు - ఉరఃపార్శ్వార్ధ మండలాలు - ముష్టికస్వస్తికాలు నళినీ పద్మకోశాలు - అలపద్మాలు - ఉల్బణాలు - లలితాలు - వలితాలు[59]

## హస్త విక్షేపణం

పదార్థాభినయమే హస్తవిక్షేపణం హస్తం వ్యక్త ప్రపంచ ప్రతీక, సాకార రూపం, హస్తంద్వారా నిరాకారత సస్వరూపం సాకారమైన 'భవనం'గా పరిణమించి ఎలా విశ్లేషిస్తుందో తెలుసుకోవడం కోసం హస్తవిక్షేపణం చెప్పబడింది

## నృత్త ప్రయోగం

"యత్తు సదృశ్యతే కించిద్దంపత్యోర్మద నాశ్రయం
నృత్తం తత్ర ప్రయోక్తవ్యం ప్రహర్షార్థ గుణోద్భవం
యత్ర సన్నిహితేకాంతో ఋతుకాలాది దర్శనం
గీతకార్థాభి సంబంధం నృత్తం తత్రాపి చేష్యతే"

అఖండమైన కావ్యం దంపతులైన స్త్రీపురుషుల కామ సంశ్రయమైన అర్థాన్ని వాచ్యంగా ఆశ్రయించి వుంటుంది అప్పుడు మదాశ్రయ నృత్తప్రయోగ మావశ్యకం అట్లే దంపతుల ఆస్థాన బంధగుణం ప్రవర్ష ప్రయోజనంగా ఉన్నప్పుడు నృత్తం ప్రయోగించాలి ఇది అర్థం దంపతులు దూతీవచనం ఆకర్షించు అంశంలో ప్రహర్షగుణారంభాలు అనుసరించి నృత్తం ప్రయోగించాలి కామావస్థల్లో నృత్త ప్రయోజనముంది ఈ విధానాలు చూడగా నాయికలందలి వాసవసజ్జిక అభిసారికలకు సంబంధించిన నృత్తం భాసిస్తుంది అట్లే స్వాధీన భర్తృక విషయంలో కూడ నృత్తముంది కాంతుడు సన్నిహితుడై ఉన్నపుడు వసంతాది ఋతువుల అభిమర్శనాన్ని చంద్రోదయాది కాలంలో అవమర్శనమనే నృత్తముంటుంది వసంత శోభావలోకనంలో చంద్రోదయ సమయం శోభ భావనంలో నృత్తముంటుంది అలాంటి నృత్తం గీతకార్థాలకు సంబంధించే వుంటుంది. ఇట్లే ఔచిత్యాపేక్షమైన నృత్తమే శోభాజనకం అని "నాట్యవేదం" తెలుపుతోంది

నృత్తంలో తాండవం - లాస్యం అనే రెండు భేదాలున్నాయి. వీనిలో తాండవం ఉద్ధతంగా, లాస్యం సుకుమారంగా వుంటుంది. తాండవం పురుష

ప్రయోజ్యమై లాస్యం స్త్రీ ప్రయోజ్యమై వుంటుంది తాండవమనే పదం నృత్తానికి కేవలం పర్యాయపదంగా మాత్రమే వాడబడింది లాస్యమనే పదం లేదు ఆ అర్థానికి సుకుమార ప్రయోగం అనే పదం కలదు [illegible] స్త్రీ పురుషలుభయులు ఉద్ధత, సుకుమార నృత్యాల్ని కూడా చేస్తారు




శివపార్వతులు తాండవానికి, లాస్యానికి వరుసగా పౌరాణిక రూపకల్పనలని పూర్వం చెప్పటం ఇందుకే

## నృత్యం

'నృత్' అనే ధాతువుకి 'క్యప్' ప్రత్యయం చేరినపుడు '**నృత్యం**' అనే పదం ఏర్పడుతుంది భరతముని నృత్యానికి ప్రవర్తకుడు 'రసభావాది వ్యంజనాది యుక్తమైంది' నృత్యం భావాల నాశ్రయించింది. [illegible] స్వరూపం కలిగింది.

నృత్తంలోని అంగ విన్యాసాన్ని నాట్యంలోని అభినయాన్ని కలిపితే నృత్యమవుతుందని భరతుడు తెలిపాడు. ఈ కలయికతో నృత్యం పుట్టింది. మొదటిగా నృత్తం పుట్టింది తరువాతిది నాట్యం ఈ రెండింటి సమ్మేళనమే 'నృత్యం'

లాస్య విధానంలో నృత్యస్వరూపం మనకు కొంత తెలుస్తున్నా భరతుడు దాన్ని నృత్యమనే పేరుతో పిలవలేదు. 15వ శతాబ్దివాడైన విప్రదాసుడు తన 'సంగీతచంద్రం'లో నాట్యం నృత్యానికి పర్యాయపదంగా తెలిపాడు. క్రీ.శ. 4వ శతాబ్దివాడైన అమరసింహుడే తాండవ, నటన, నాట్య, లాస్య, నృత్య, నర్తనాలు

పర్యాయ పదాలని తెలిపాడు క్రీ.శ. 4 వ శతాబ్ది నాటికే నృత్యం ప్రచారంలో వుంది.[60] నృత్యానికి శాస్త్రముఖం కల్పించి నామకరణం చేసినవాడు భరతుడైనా దీన్ని పెంపొందించి దానినుండి ఉపరూపకాలను సృష్టించింది కోహలుడు. ఎందుకంటే నృత్తం నుండి నృత్యం, నృత్యంనుండి నాట్యం పుట్టాయనే వాదాలు సమంజసాలు కావు. 61

నాట్యశాస్త్రంలో నృత్యమనే పదం మనకు కనిపించదు. నాట్యశబ్దానికి 'నృత్యం' పర్యాయపదంగా వాడబడుతోంది. భరతనాట్యంలో నాట్యపదానికి నృత్యం అని అర్థం. శివుడు తన నృత్తానికి నాట్యమందలి అభినయాలను జోడిస్తే గీతాలు, అర్థవంతాలు కాగలవని భావించినాడట. శివుని ఆదేశం ప్రకారం తండుమహర్షి నృత్తాన్ని భరత మునికి బోధించాడట. భరతుడా నృత్తాన్ని పూర్వరంగ విధులలో ప్రయోగించగా ఇలా రెండింటి కలయికతో ఒక క్రొత్త కళ సృష్టింపబడింది. అదే నృత్యం. అందువల్ల కేవలం అంగ విక్షేపాత్మకమైన నృత్తం అర్థ ప్రదర్శసాధనమైన అభినయంతో కలిసి నృత్యకళగా రూపొందిందన్నమాట.

## నాట్యం

'నట్' అనే ధాతువునుండి నాట్యం, నటనం, నటి, నటుడు అనే పదాలు ఉత్పన్నాలైనాయి.

స్పందనార్థ తయాధాతోః నటేస్సాత్త్విక పూరితమ్
రసాశ్రయంచ తత్ జ్ఞేయం వాక్యార్థాభినయాత్మకమ్ 62

నటధాతువుకి స్పదించుట, అంతరంగాలను కంపింపచేయటం అని అర్థం కనుక నాట్యం సాత్త్విక భావాలతోనిండి, రసాశ్రయమై, వాక్యార్థాన్ని అభినయించేదిగా ఉంటుందని గుర్తించాలి.

జనంలో, మొదటి బయలాటలూ, తరువాత ఒక రంగస్థలాన్ని నిర్దిష్ట స్థలంలో నిర్మించుకొని అందులో ఆట చూపడమూ గుర్తించిన నాగరకులు తమాషాగా ఒక కథ కల్పించుకోవడం జరిగింది ఆ కథ ఇది - బ్రహ్మదేవతల కోరిక ననుసరించి నాటకం వ్రాసి ఇచ్చాడు. వస్తువు దేవాసుర యుద్ధం, దేవతలకు విజయం చేకూరటం. దీన్ని రంగస్థలం సహాయం లేకుండా 'బయట్లో' ఆడారు

నాటకంలో ఓటమిని చూసిన రాక్షసులు కోపంతో విజృంభించి నాటకాన్ని ధ్వంసం చేశారు. రాక్షసుల బారినుండి తమ ప్రదర్శనను కాపాడాలని బ్రహ్మను మళ్ళీ వేడుకోగా సుభద్రమైన నాటకశాల నిర్మించి ఇచ్చాడు బ్రహ్మ. అప్పటినుంచి నాటకాలు నిర్విఘ్నంగా సాగాయి.[63]

నాట్యశాస్త్ర రచనకు ముందే వేలాది సంవత్సరాల నుంచి పరిణమిస్తూ వస్తున్న జానపదుల రూపకాల ప్రదర్శన తీరును గురించి ఈ కథ చెబుతోందని వూహించవచ్చు.

బ్రహ్మ నిర్మితమైన నాట్యవేదం యొక్క ఆరంభాన్ని గూర్చి భరతముని ఆత్రేయాది మునీశ్వరులకు ఇలా చెప్పాడు –

'స్వాయంభువ మన్వంతరం మొదలు వైవస్వత మన్వంతరం వరకు ఏడు మన్వంతరాలు. ప్రతి మన్వంతరంలో కృతయుగం సమాప్తమై త్రేతా యుగం ప్రారంభమయ్యే కాలంలో ప్రజలు కామలోభాలకు, ఈర్ష్యాక్రోధాలకు వశులై స్వధర్మాన్ని వీడి సుఖదుఃఖ సమ్మిశ్రితమైన జీవితాలను గడుపుతుండగా "నాట్యం" పుడుతోంది.

పూర్వం ఒక త్రేతాయుగారంభంలో అలాంటి పరిస్థితి సంభవించింది. అపుడు జంబూద్వీపంలో దేవతలు, గంధర్వులు, యక్షులు, రక్షోగణాలు, మహో రగులు ఆక్రమించుకొని వుండగా లోకపాలకులు ధర్మప్రతిష్ఠాపనా పరులై ప్రజల్ని స్వధర్మ నిరతుల్ని చేయటానికి ప్రయత్నిస్తున్నారు. దీన్ని చూసి మహేంద్రాది దేవతలంతా పితామహుని దగ్గర ఇలా ప్రార్థించారు.

"గ్రామ్యధర్మ ప్రవృత్తేతు కామలోభవశం గతే
ఈర్ష్యా క్రోధాది సమ్మూఢే లోకే సుఖదుఃఖితే
మహేంద్ర ప్రముఖైర్దేవైః ఉక్తః కిలపితామహః
క్రీడనీయక మిచ్ఛామో దృశ్యం శ్రవ్యంచయద్భవేత్"[64]

దృశ్యం (చూడతగ్గది) శ్రవ్యం (వినతగ్గది) అయిన క్రీడనీయక వినోద వస్తువును మేము కోరుతున్నాం. శూద్ర జాతులకి వేదశ్రవణంపై అధికారం లేదు. కావున సార్వవర్ణికమైన ఇంకో వేదాన్ని సృజించు అని కోరగా దేవతల మొర విని బ్రహ్మ వారిని వెనక్కి పంపి సమాధిగతుడై వేద సారాన్ని స్మరించాడు,

ధర్మ ప్రతిపాదకమూ, చతుర్విధపురుషార్థ సాధకము, యశస్కరమూ ఉపదేశహితమూ, సమ్యక్ జ్ఞాన ప్రదమూ, ముందు తరాలవారిని సత్కర్మ మార్గమూ, ప్రదర్శకమూ సర్వ శాస్త్రాల సంపన్నమూ, సర్వశిల్ప ప్రవర్త కమూ ఇతిహాస సహితమూ అయిన 'నాట్యం' అనే పంచమవేదాన్ని నిర్మించాలని సంకల్పించగా అది 'నాట్యవేదం' అయింది బ్రహ్మ ఋగ్వేదం నుంచి పాఠ్యాన్ని, సామవేదం నుంచి గీతాన్ని, యజుర్వేదం నుంచి అభినయాన్ని, అధర్వణ వేదం నుంచి రసాన్ని గ్రహించాడు [65]

ఇలా బ్రహ్మ వేదోపవేదాలకు సంబంధించినట్లుగా లలితాత్మకమైన నాట్య వేదాన్ని సృష్టించి భరత మహర్షికి ఇచ్చాడని, తర్వాత అతని పుత్రులైన సూత్రధరకు భరతుడు తెల్పినాడు భరతుడు నాట్యశాలాన్ని సూచించే ప్రతీక "భావ రాగ తాళ తత్త్వ మూర్తిర్భరతస్య" 'నృత్త, నృత్య, నాట్య' పదాల్ని పోల్చి వాటి భేదాలను నిర్వచించినవాడు నందికేశ్వరుడు

"నాట్యం తన్నాటకంచైవ పూజ్యం పూర్వకథాయుతమ్
భావాభినయ హీనంతు నృత్త మిత్యభిధీయతే
రసభావవ్యంజనాదియుక్తం నృత్యమితీర్యతే"

పూర్వకథాయుతమై పూజనీయమైన నాటకమే నాట్యం. భావాభినయహీన మైంది నృత్తం రసభావవ్యంజనాది యుక్తమైంది నృత్యం.

## నృత్యప్రయోజనం

స్త్రీపురుషుల పరస్పర విషయమైన భావం లాస్యం దానికొరకైనది లేదా దానినితగింది అను అర్థంకలది లాస్యం అది కామోల్లాసానికి హేతువులైన మృదువైన అంగవిక్షేపం కలది. దేవికి శివు డుపదేశించింది కాబట్టి ప్రాయికంగా దీన్ని స్త్రీలే ప్రయోగిస్తారు [66]

# పరిణామదృష్టితో నృత్త - నృత్య - నాట్యాలు

## నృత్తం

నాట్యశాస్త్రం చెప్పిన 'నృత్తం' అన్న అంశం గిరిజనుల్లోని ఆంగికాభి నయశీలాన్ని గురించి సూచిస్తోంది అరణ్య జీవిత విధానంలో పూజా కార్య

క్రమంలో నృత్తసంప్రదాయం కనిపిస్తోంది. శివుడు ఆరణ్యకులదైవం, శక్తివంతుడు గిరిజనుల ఆరాధ్యదైవం

## నృత్యం

నృత్యం ఆదిమజాతులవారు జానపదులుగా మారినదశలో పుట్టింది. అందుకే ఆటపాటలు జానపదుల్లో అభినయాత్మకంగా రసవ[illegible]గా ఉన్నాయి. ఈ కాలానికి 'శివుడు-శక్తి' పురాదేవతలయ్యారు (Mythaical Gods) నృత్తంలో[illegible] గాకుండా పదాభినయ ప్రాధాన్యం పెరుగుతూ వచ్చింది. కూచిపూడి నృత్యరీతిలో భరతనాట్యంకన్నా అధికంగా కనిపించే ఈ పదా[illegible] జానపద జీవితంనుంచీ పుట్టింది.

## నాట్యం

ఈ జానపద నృత్యానికే తత్త్వవివేచనకూడా తోడైతే నాట్యమైంది. ఇక్కడ నాట్యమంటే పదాభినయంకాకుండా రసవంతమైన వాక్యాభినయమని అర్థం. అంటే సుఖదుఃఖమయమైన మానవజీవితంలోని రసమయ సందర్భాలను అభినయించడమన్నమాట. దీన్నే నాటకమంటాం. అంటే నృత్తంలో నటుడు, రచయిత - ప్రేక్షకుడు ఒకడే. నృత్యంలో రచయిత నటుడూ ఒకడే. నాట్యంలో నటుడు ప్రేక్షకుడు వేరు అవుతున్నారు. ఇలా 'నాట్యం' పుట్టేసరికి ఒక శాస్త్రం పుట్టింది. నృత్త, నృత్యాలకు ఆవిధమైన శాస్త్రాలు లేవు. 'నృత్తరత్నావళి' అన్న శాస్త్రం ఆవిర్భవించటం 'తాండవ - లాస్య - నృత్త - నృత్య' భేదాలను గురించిన స్పష్టమైన అవగాహనకోసమే.

---

### పాదసూచికలు

1. అభినవదర్పణం, ప్రారంభశ్లోకం, నటరాజరామకృష్ణగారి అనువాదం.
2. దేహం - అవయవం - భాగం.
3. సి ఆర్ ఆచార్య, కూచిపూడి ఆరాధనా నృత[illegible]లు, పుట - 80-81.
4. నిత్యసాధన చంద్రిక - పుట - 1.
5. తాళ్ళపాక అన్నమాచార్యులు, శృంగారసంకీర్తనలు, పుట - 79.

6. శ్రీకృష్ణదేవరాయలు, ఆముక్తమాల్యద, గ్రీష్మము - పుట - 31
7 రామరాజభూషణుడు, వసుచరిత్ర, చతుర్థాశ్వాసము - 17వ పద్యం.
8 శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, కిన్నెరసాని పాటలు
9 కంభంపాటి సత్యనారాయణ, ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి - పుట - 2.
10 ,, ,, ,, - పుట - 4
11 ,, ,, ,, - పుట - 38
12. The History of Dance-Mary Clark and Clement Crisp - P 1, 2,
13 క్రీ శ 3వ శతాబ్దం
14. తతములు = వీణలు మొ॥ ఘనములు = కంచుతాళాలు, అవనద్ధములు = మద్దెలలు, (చర్మవాద్యాలు), సుషిరము = పిల్లనగ్రోవి
15 క్రీ శ 8,9 శతాబ్దాలు.
16 క్రీ శ 11, 13 శతాబ్దాలు
17. కార్పస్ ఆఫ్ ఇన్స్క్రిప్షన్ నెంబరు - 37
18 ,, ,, ,, - 36.
19 ,, ,, ,, - 1.
20. Epi Ind : Vol, VI - 38
21 శకవర్షం 1188
22 నన్నయ ఆంధ్ర మహాభారతం - ఆదిపర్వం - అష్టమాశ్వాసం 173, 174 పద్యాలు
23 నన్నయ ఆంధ్ర మహాభారతం - ఆదిపర్వం - అష్టమాశ్వాసం - 175వ పద్యం
24 నన్నెచోడుడు, కుమార సంభవం, అష్టమాశ్వాసం - 180వ పద్యం
25. తిక్కన, ఆంధ్ర మహాభారతం, విరాటపర్వం - ప్రథమాశ్వాసం 228వ పద్యం.
26. తిక్కన, ఆంధ్ర మహాభారతం, విరాటపర్వం - ప్రథమాశ్వాసం 240వ పద్యం.
27 తిక్కన, ఆంధ్ర మహాభారతం, విరాటపర్వం - ప్రథమాశ్వాసం 241వ పద్యం.

28 ఈ నత్తర్లన్నింటినీ జానపదుల ఆటపాటల్లో పరిశీలించవచ్చు.
29 మానవ పరిణామ సంబంధమూలాల్లో ఈ విషయాల ప్రస్తావన [illegible]
30 చూ బసవపురాణం, ప్రథమాశ్వాసం - పు. 60.
31 పలనాటి వీరచరిత్ర - పుట 18-19.
32 శ్రీనాథుడు, కాశీఖండం - 1-58.
33 కాటయవేముని శాకుంతల వ్యాఖ్యాన ప్రారంభం.
34 డా॥ సి నారాయణరెడ్డి కర్పూర వసంతరాయలు కావ్యం.
35 దేవస్థానంవారి ఎపిగ్రాఫికల్ రిపోర్టు
36 క్రీ శ 1509-1530
37 క్రీ. శ 1509-1530
38. సి. ఆర్ ఆచార్య, కూచిపూడి ఆరాధనా నృత్యాలు, పుట-10
39. ఇటీవల ప్రభుత్వంవారు కూడా కుటుంబ నియంత్రణ ప్రచార సాధనంగా వీరిని వాడుకుంటున్నారు
40 గొల్లకలాపం కర్త భాగవతుల రామయ్య.
41. వీటినే మాహేశ్వర సూత్రాలని అంటారు 'అయివుణ్' మొ॥
42. తండు - తండ శబ్ద విచారం అవసరం తండ గ్రూప్ (సుగాలీ తండా) మౌలికంగా ఒకప్పటి శివతాండవం కూడా సామూహిక నృత్యం అయి వుండవచ్చు ఆటవికుల నృత్యంలాగా, నటరాజ రామకృష్ణగారు 'శివ తాండవం' అనే పేరులో తండు ప్రసక్తి వుందని తెలిపారు. శివతాండవాన్ని 'పుట్టపర్తి'వారు నృత్తి నృత్యాన్ని లాస్య తాండవాన్ని ఇలా తెలిపారు

నృత్యంబు వెలయించి నృత్తంబు [illegible]శిపించి
నృత్త నృత్యములు శబలితముగా జూపించి
లాస్యతాండవ భేద రచనగతులు మీటి
వశులై సర్వదిక్పాలకులు దరిచేర (పుట 24)

43 అంగికమూలాల్లో చర్చించడం జరిగింది
44 చూ ఉరుముల నృత్యం
45 తెలంగాణా ప్రాంతంలో ఆ వీరుల [illegible] 'వీరగల్లు' అంటారు.
46. చూ. తప్పెటగతులు

47 పేరిణి శివతాండవం
48 ఈ భంగిమ చిత్రం చూడు పేరిణి శివతాండవం, నటరాజ రామకృష్ణ, ఊర్ధ్వతాండవం
49 ఈ తాండవాన్ని నటరాజ రామకృష్ణగారు తమ శిష్యులతోపాటుగా ఈనాటికీ ఆంధ్రదేశమంతట ప్రచారం చేస్తున్నారు
50 చూ పగటివేషాలు
51 చూ వివరాలకు, నటరాజ రామకృష్ణ, నృత్యకళ - పుట 17-18.
52 వేణుగాన మహాత్మ్యన్ని 'పోతన' భాగవతంలో తెలిపారు
53 ఈనాడు కాళీయ మర్దనమనే 'నృత్యం' వాడుకలో వుంది
54 జాయపసేనాని, నృత్తరత్నావళి, పుట 16-17 ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాదమి

| | | | | |
|---|---|---|---|---|
| 55. | ,, | ,, | పుట 2-3 | ,, |
| 56 | ,, | ,, | పుట 8-9 | ,, |
| 57 | ,, | ,, | పుట 16-17 | ,, |
| 58 | ,, | ,, | పుట 16-17 | ,, |

59 నాట్యశాస్త్రం పుట 312-315
60. ,, పుట 50-51
61 ,, పుట. 20
62. జాయపసేనాని, నృత్తరత్నావళి - పుట 10-11
63. చూ బయిలాట
64. బమ్మల మూదర మాధవశర్మ, నాట్యవేదం - పుట 4
65 జగ్రాహ పాఠ్య మృగ్వేదాత్సామభ్యో గతమేవ చ
యజుర్వేదా దభినయాన్రసా నాథర్వణా దపి
వేదోపవేదైస్సంబద్ధో నాట్యవేదో మహాత్మనా
ఏవం భాగవతా సృష్టో బ్రహ్మణా సర్వవేదను

(నాట్యవేదం - పుట 7)

66. జాయపసేనాని, నృత్త రత్నావళి - పుట 18-19



రెండవ అధ్యాయం

# ఆటవిక జాతుల్లో నృత్యాలు

ప్రపంచవ్యాప్తంగా ఆదిమ సంస్కృతి పోలికలు కలిగే ఉంటుంది. ఆటవిక, జానపద, నాగరక దశలు అన్ని జాతుల ప్రదేశాల మనుష్యులను సంధివిచేఉంటాయి. ఆటవిక జాతుల్లో ఆదిమసంస్కృతి ధ్యాయలు ఈనాటికీ కన్పిస్తాయి. అనాగరక ద్రావిడ భాషలుగా చెప్పబడేవి. నీలగిరి కొండల్లో కోతజాతి, తోడజాతి, కురుంబ జాతులున్నాయి. 1) గోండులను 'కోయటూర్ జాతి' అంటారు. గోండులు ఆదిలాబాద్ జిల్లాలో వున్నారు. 2) కొండ లేక కూబి, కొండ - దొరలు, కొండ కాపులు - ఓజలు - పాండవ రైతులు అనే ఆటవికజాతులు విశాఖపట్టణం, శ్రీకాకుళం జిల్లాలో వున్నారు. వీరిజాతిని 'కూబిట్' అంటారు. 3) 'కూఇంగ' జాతికే కూయి, కోండులు, ఖోండులు, కంధులు అని వ్యవహరిస్తారు. విశాఖపట్టణంలో నివసిస్తున్నారు. 4) కంధ్ జాతి అరకుసాలూరు ప్రాంతంలో (విశాఖపట్టణంజిల్లా) పాలకొండ ప్రాంతంలో వున్నారు. వీరు 'కువి' భాషను మాట్లాడతారు. 5) కోలార్ జాతి ఆదిలాబాద్ జిల్లాలో ఉన్నారు. కోలామీభాష మాట్లాడుతారు. గదబ జాతి శ్రీకాకుళం జిల్లాలో సాలూరు ప్రాంతంలో నివసిస్తున్నారు. ఇంకా కోయ, చెంచులు, యానాదులు, సవరజాతి.

చరిత్ర పరిణామాలలో పరిసరాలలోని నాగరికతాయుత ప్రభావాన్ని అక్కడక్కడ పొందినప్పటికీ ఆటవికసంస్కృతి మారుమూలల్లోనైనా ప్రాచీనతను ప్రతిబింబిస్తూ మిగిలేవుంది. అందుకే జానపద నృత్యాలకు మూలాలను ఆటవిక నృత్యాలలో చూడగల్గుతున్నాం.

## (అ) ఆటవిక నృత్యమూలాలు

ప్రపంచంలో ఆదిమజాతుల్ని పరిశీలిస్తే వారి జీవితమంతా నృత్యమయం గానే కనిపిస్తుంది. ప్రతి చిన్న పనికి పెద్ద పనికి వారు నృత్యాన్నే ఉత్తమ అభివ్యక్తి సాధనంగా గ్రహిస్తారు. ఈ విషయం పరిశోధకులంతా అంగీకరించిన విషయమే. ఆటవిక నృత్యానికి కొన్ని సాధారణ ధర్మాలున్నాయి.

1 ఉచ్చాటన మంత్రంతో ముడిపడి ఉండటం
2 సమూహిక నృత్యంగా ఉండటం
3 తమ వృత్తి అయిన వేటను అభినయాత్మకంగా ప్రదర్శించటం
4 ప్రాకృతిక ప్రేరణలకు ఈ నృత్యం ఆంగిక ప్రతిక్రియగా ఉండటం
5 కేవలం ఆనందం కోసం కాకుండా ఈ నృత్యం ఆటవిక జీవితంలో ఒక భాగంగా ఉండటం

## (ఆ) ఆంధ్రదేశంలో ఆటవికుల ప్రాక్చరిత్ర

**సవరలు**

వీరు శ్రీకాకుళం, విశాఖపట్నం గంజాం అడవి ప్రాంతంలో నివసిస్తూ 'సవర భాష'ని మాట్లాడుతున్నారు పండుగ దినాల్లో బృందనృత్యాలు చేస్తారు వీటిలో పాల్గొనే యువతీయువకులు అలంకరణ కోసం చాలా తాపత్రయపడతారు యువతులను ఆకర్షించడానికి యువకులు ప్రయత్నిస్తూ ఉంటారు అందుకోసం తలపాగాలలో ఎఱుపు లేక తెల్లని ఈకల్ని తురాయిల్లాగా అమర్చుకొంటారు వీరు నృత్యం చేస్తున్నపుడు ఆ తురాయిలు అటుయిటూ ఊగిసలాడుతూ, యెంతో రమణీయంగా కనబడతాయి వారి జుట్టుముడి తలపై నిటారుగా నిలబడటానికి కాడవంటి ఒక కర్రముక్కనుగాని, ఇత్తడి ముక్కనుగాని తలపాగాలో అమర్చుకొంటారు

**గోండులు :**

వీరికి రాజగోండులని మరో పేరు ఆదిలాబాద్ జిల్లాలోని కొండ ప్రాంతాలలో నివసిస్తూ, 'గోండి' భాషను మాట్లాడుతారు వీరు నాలుగు తెగలు[2] విందులు, వేడుకలప్పుడు 'కింగ్రీ' (మూడు తీగలుండే వాద్యం)ని వాయిస్తూ, పాటలు పాడే వారిని 'ప్రధాన్' అంటారు. గోండుల జీవిత విధానం పురాణ పురుషుల ఆదేశాలు తమ పూర్వ పురుషుల ఆచరణలమీద ఆధారపడి వుంటుంది.

ఇవన్నీ పాటలు పదాలలో నిక్షిప్తమై వుంటాయి ఇవి వట్టి గీతాలు కావు వివిధ సంప్రదాయాల్ని సూచిస్తూ తమ సహచరులతోనూ, దేవతలతోనూ, గోండుల సంబంధాలను శాసిస్తాయి.[3]

| | | |
|---|---|---|
| సిరిమూట్ సిరిమూట్ | — | చుట్టూ చుట్టూ చుట్టి |
| సిరిమూట్ తిరిసి | — | చుట్టూ చుట్టూ తిరిగి |
| సిరిముట్ తిరిసి | — | చుట్టుముట్టు తిరిగి |
| గంగమ్మ పొంగంతరా | — | గంగమ్మ పొంగుతుందిరా |
| వీదంగాలిక్ గట్టాంగ్ | — | ఒహో పొడవైన గుట్టలో |
| మంతారోయ్ | — | ఉన్నాయిరోయ్ |
| తేకువనం మస్తమత | — | టేకువనం మస్తుగున్నది |
| వెదురువనం మస్తుమంత | — | వెదురువనం మస్తుగున్నది |
| వందే ఒత్తాల్ మంతా | — | ఇంకేమున్నది |
| పొడుమదిన్ వకనే | — | సూర్యుడు కనబడని |
| కేడమంతరా | — | అడవున్నదిరా |
| కెడత కోయరాజుల్ | — | అడవిలో కోయరాజులు |
| బహన్ మంతేరో | — | ఎట్లున్నరోయి |
| కోయరాజులో | — | కోయరాజులు |
| రాజల్ కోయతురో | — | రాజులు కోయలు |
| బహన్ మంతేరిత్తివే | — | ఎట్లున్నరంటే |
| సోకున మంతేరు | — | దర్పంగా వున్నారు |

**ఖోండులు :**

వీరి నివాసం ఆంధ్రప్రదేశ్‌లోకి రాదు. ఒరిస్సాలోని గంజాం జిల్లా. కొద్ది మంది మాత్రం దానినానుకొని వున్న శ్రీకాకుళం జిల్లాలో వున్నారు. వీరు 'కుయి, కంది లేక ఖోండ్' భాషలను మాట్లాడుతారు. స్త్రీలు మోకాళ్ళ దిగే లంగా కట్టుకొని రొమ్ములకు ఆచ్ఛాదన వుండదు. మెడలో వేసుకొనే పూసల దండలు తప్ప- పురుషులు మొలకు మతకపంచ దాని చివరలు ముందు వెనకా తోకల్లా వ్రేలాడేటట్లు కట్టుకుంటారు. పొడుగ్గా జుట్టు పెంచి ముడివేస్తారు. దాంట్లో ఒక దువ్వెన, పొగ త్రాగేందుకు చిలుము గొట్టంవంటి చిన్న అవసర వస్తువులు పెట్టుకొంటారు. తలకో గుడ్డ, నెమలి ఈకలో మరో అందమైన రంగు ఈకలో గ్రుచ్చుతారు. విలువిద్యలో నేర్పరులు.[5]

ఏప్రిల్ నెలలో ప్రారంభమయ్యే వేటకాలం పెళ్లిళ్ళ ఋతువు. చాలా గ్రామాల్లో పెళ్లియీడు యువకులకు, యువతులకు వేరువేరే శాలలుంటాయి. వారు

ఆ శాలల్లో రాత్రుళ్ళు పడుకొంటారు వాటిని "ధంగడా" అంటారు యువకులు రాత్రి సమయంలో జట్టుగా పొరుగూరికెళ్ళి అక్కడుండే పడుచులతో పాటలు పాడుతూ నృత్యాలు చేస్తూ రాత్రి గడిపి వస్తారు ఈ నృత్యగానాలతో కలిగిన పరిచయాలు క్రమంగా వివాహాలకు దారి తీస్తాయి తల్లిదండ్రులు, గ్రామపెద్దలు తమ సంతానాన్ని ఈ విధంగా పరిచయాలు పెంచుకోడానికి ప్రోత్సహిస్తారు.[6]

## కోయ.

కోయలు గోదావరి కిరువైపులా, ఇంద్రావతీ సంగమ ప్రాంతం నుంచి ఖమ్మంమెట్టువరకు ఉత్తరాన బస్తరు, విశాఖ జిల్లాలో మలకనగరి వరకు వ్యాపించి యున్నారు 'కోయభాష'నే మాట్లాడుతారు తెలుగు కూడా మాట్లాడుతారు పోడు వ్యవసాయం ప్రధానవృత్తి కొండమ్మ, బైరమ్మ మొ॥ కొండ దేవతల్ని కొలుస్తారు పంట వచ్చినపుడు కోయలు విందు చేస్తారు ఆ విందులో అందరూ నృత్యాలలో పాల్గొంటారు జొన్నకోతకి, ఇప్పకోతకి, మామిడికోతకి ఇటాగే సంవత్సరంలో అనేక విందులతో పుత్సవాలూ జరుగుతాయి. సంవత్సరానికో మారు చైత్రోత్సవం' చేస్తారు ఇది పెద్ద కోలాహలంగా జరుపుతారు. బాగా త్రాగి నృత్యాలతోనే నెలంతా గడిపేస్తారు యువతీయువకులు వేర్వేరు పంక్తులుగా నిలబడి నృత్యాలు చేస్తారు వీరి నృత్యం బాగా ప్రాచుర్యం అయ్యింది ఊరిలోని స్త్రీ పురుషులు పిల్లలనుంచి వృద్ధులవరకూ పాల్గొంటారు. మగవాళ్ళు తలలమీద దున్నకొమ్ములు అమర్చుకొంటారు ఆడపిల్లలు ఒకరి భుజాలమీద ఒకరు చేతులు వేసుకొని వలయాకారంగా నిలబడి డప్పుల లయకు అనుగుణంగా నృత్యం చేస్తారు.[7]

## చెంచులు, యానాదులు :

మహబూబ్‌నగర్ జిల్లాలో వున్నారు వీరిని చెంచుయానాదులనీ, యానాది చెంచులని అంటారు. మెకంజీ వ్రాత ప్రతులలో యానాది చెంచులనీ ఇతర బ్రిటిష్ అధికారులు చెంచుయానాదులన్నారు. నివాసం నల్లమల ఇద్దరి పూర్వులు ఒక్కరే. ఋతువునుబట్టి ఆహారం వెతుక్కుంటూ మకాములు మారుస్తారు జంతుబలులు, నరబలులు లేవు. తమ భాషను మంచి తెలుగునే మాట్లాడుతున్నారని కంఖంపాటి సత్యనారాయణగారు తెలియజేశారు[8]

వీరు గుహల్లోను, చెట్ల క్రింద నివసిస్తారు. ... ఉడుము ... చర్మంతో కుట్టిన టోపి పెట్టుకొంటారని విల్లుతో వేటాడుతారని '...' అనే చరిత్రకారుడు వర్ణించాడు.

చెంచులకు, యానాదులకు ప్రత్యేకమైన పాటలుంటాయి. ఎదుర్కొనే సమస్యలమీద నోటికి వచ్చినట్టు అప్పటికప్పుడు పాట కట్టేస్తారు. నృత్యాలూ అంతే డప్పు చప్పుడుకిపట్టి ఎవరికి తోచినట్టు వారు గంతులెయ్యటమే. సంవత్సరానికో మారు ఇప్పపువ్వు సారాయి ఋతువులో బాగా తాగి ఒళ్ళెరగని ఆనందంతో నృత్యాలు చేస్తారు. నెమలి నృత్యం, నల్లకోతి నృత్యంతో వారు వేటాడే విధానాన్ని ప్రదర్శిస్తారు.

వేట, ఆహార సేకరణ తెలియజేసే నృత్యాలు స్త్రీ పురుషులు కలిసి ఒకప్పుడు చేసేవారు. ఇప్పుడులేవు. వట్టి కుప్పిగంతులు మాత్రమే. కోతలు పూర్తి అయ్యాక తీరికగా వున్న రైతులు కోరి వారిచేత హరిశ్చంద్ర, నలుడు, రాముడు-సీత, నరసింహ-చెంచులక్ష్మి వంటి కథలు చెప్పిస్తుంటారు. ఇవి పాట-పదం నృత్యం అన్నింటితోను సాగేవి.[9]

## కొండరెడ్లు

వీరు ఒకప్పటి పాల్వంచ సంస్థాన మండలంలోనూ తూర్పు గోదావరి వన్య ప్రాంతంలోనూ నివసిస్తున్నారు.[10] సాధారణంగా పండగలో పెద్దల పెట్టడాలను సంవత్సరంలో ప్రత్యేక ఋతువులో జరుగుతుంటాయి. ఫిబ్రవరి, మార్చి నెలల్లో 'మామిడి పండుగ' చేస్తారు. ఈ పండుగలో భూదేవత ముత్యాలమ్మ, కొండదేవతను ప్రస్తుతిస్తూ పాడుతూ నృత్యంచేస్తారు. ఆ దేవతను ఆహ్వానిస్తారు.

'ఓ గోగుల పూడి ముత్యాలమ్మ
నీ కొలువు చేస్తున్నాము తల్లి
కొండలు, కొండదేవతలు రావాలితల్లీ
భూమిలో వుండే నేల తల్లి
నువ్వు దయ చేయ్యాలి
తేరంకొండ చిన్నమ్మ నువ్వు తప్పక రావాలి
గురుపత్రి కొండాట మరాజీ నువ్వు రావాలి

రాజా కొండరాజా దొరయరా ఎప్పుగాపా ఎమ్మ
పంచికొండ కన్నతురాజా
సుబ్బి తప్పక రావాలి కోవెల కొండకన్నమరాజా
సుబ్బి తప్పక రావాలి[11]

## (ఇ) ఆటవిక భాష - అభినయం

అతి ప్రాథమిక దశలో భాష ఎలా వుండేదో తెల్సుకోవాలంటే తగిన సాధనాలు లేవు. భాషకు జంతువుల శరీరాలకులాగా శిలాముద్రలు దొరకవు. ఈనాటి ఆటవిక సమాజాల ద్వారా కూడా గ్రహించటం కష్టం. ఎందుకంటే నాగరిక విషయంలో ఎంతో వెనుకబడి వున్నా భాషా విషయంలో వెనకబడ్డ సమాజాలు లేవు. అంతేగాక ఒక్కోసారి కొన్ని ఆటవిక భాషల్లో నాగరక భాషల కన్నా క్లిష్టమైన వ్యాకరణాంశాల్ని పరిశోధకులు గమనించారు. ఈ భాష పుట్టుక గూర్చి రకరకాల అభిప్రాయాలున్నాయి. ఒకటి ధ్వన్యనుకరణ శబ్దాలనుంచీ పుట్టిందనీ పూర్వం నమ్మేవారు. దానికి ప్రతి భాషలోనూ ఇలాంటి శబ్దాలు చాల కొద్ది. భాష అంటే కేవలం మాటలు కాదు. మాటల అన్వయం. దాన్నే వ్యాకరణం అంటారు. మానవ పరిణామక్రమంలో మెదడు పరిణామంలో, నిర్మాణంలో పెరగటంవల్ల భాష ఏర్పడి వుంటుందని అందరూ ఒప్పుకొన్నారు. ఆ ఏర్పడే పరిస్థితినిబట్టి హఠాత్సంభవవాదులు, క్రమ పరిణామవాదులూ, రెండు రకాల వాళ్ళున్నారు. వీటి నిజానిజాలు నిర్ణయించటం కష్టమని కంభంపాటి సత్యనారాయణ తెలిపారు.[12]

ఆటవికునికి భాష ఉంది కానీ అది పరిమిత శబ్దజాలంతోకూడి ఉంటుంది. అంతేకాని సుసంపన్నమైన నాగరికుని భాష వంటిదికాదు. ఏ భావాన్ని బోధించాలన్నా ఆటవికులు కేవల అభినయాత్మకమైన శబ్దసంకేతాల్ని వాడతారు. ఆ సంకేతాలు శబ్దార్థ విభాగంలేని కేవల స్పందన రూపాలుగా కూడా ఉంటాయి. ఈ దశలో శబ్దసంకేతం అభినయం వేర్వేరుగా ఉండవు. ఈ దశలోనే మానవ భాష మూలాలు సూచింపబడుతున్నాయని ఇటీవలి పరిశోధకులు అంటున్నారు.[13]

## (ఈ) ప్రకృతితో సన్నిహిత సంబంధం

ఆటవికులు ప్రకృతి ఒడిలో పుట్టి పెరిగారు. రకరకాల పిట్టల పాటలు, నడకలు, ఎగరటాలు, వినివిని, చూసిచూసి వారిలో అవి ఇమిడిపోయి అనేక నృత్యమూలాలుగా పరిణమించి ఉంటాయనే ఊహించవచ్చు. చెట్టుకొమ్మల్లో కూర్చొని గండుకోయిల తియ్యగా పాడుతుండగా విన్నాడు.[14] రంగురంగుల ఈకలతో తన శరీరాన్ని అలంకరించుకొని పురివిప్పి ఆడే నెమలి నృత్యభంగిమలను తాను లీనం చేసుకొన్నాడు. నెమలి నృత్యానికి ఉరుములే తాళాలని, మెరుపులే కరదీపికలని ఇంకా నెమళ్ళ సంగమంలో నృత్యాన్ని దర్శించాడు.[15] జలజల పారే సెలయేటి గలగలలు, ఫెళఫెళమంటూ మ్రోగే మేఘగర్జనలు విని వివిధ తాళగతుల్ని గుంపులను ఆటవికుడు సంగ్రహించాడు.

## (ఉ) ఆటవిక జీవితం - నృత్యం

ఆటవికుల జీవితం పూలపాన్పు కాదు. నిరంతరం ప్రకృతిపెట్టే భయాన్ని ఎదుర్కొంటూ పోరాడటం, వారు ఆహారం కోసం అరణ్యాల్లో వేటాడ టానికి వెళ్ళినపుడు పులులు, సింహాలవంటి క్రూరజంతువుల్ని ఎదుర్కోవాల్సి రావటం, వాటితో పోరాడటం, ఒక్కొక్కసారి ప్రాణాలు పోగొట్టుకోటం జరుగుతూ వుంటుంది. ఈ వేటలోనే ఆటవిక నృత్యం పుట్టింది

కుటుంబమనే వ్యవస్థ ఏర్పడిన తర్వాత ఆటవికుల ఆదిమ నృత్య విధానంలో మార్పులు కన్పిస్తాయి. ఆటవిక నృత్యాలు సంతానం కలిగినపుడు, బారసాల, వధూవరులు ఒకరినొకరు ఎన్నుకొనేటపుడు, ప్రణయం, అంత్యక్రియలు జరిగేటి సమయం, పొలం దున్నే సమయం పంటలు పండినపుడు కోతలు, అతిథులొచ్చినపుడు, సాగనంపుట, ఇలా వీరి జీవితమంతా వివిధ నృత్యాలతో కూడుకొని నృత్యనాటికలాగా గడిచిపోతుంది

## (ఊ) ఆటవిక నృత్య సంప్రదాయాను స్మృతి

ఈ నాటికీ జానపద నృత్య కళలో మిగిలిన ఆటవికాంశాలుగా క్రింది వాటిని గుర్తించవచ్చు

నృత్యతత్వం సామూహికంగా నృత్యం చెయ్యటం, ఇలాంటి నృత్యాన్ని అధికంగా మతపరంగా చెయ్యటం జానపద నృత్యరీతుల్లో ఏవో కొన్ని తప్పా అత్యధికంగా జీవితంలో భాగంగానే ఉండటం ఈ విషయం

నృత్యస్వరూపం అనియత రాగాలు, తాళాలు, నృత్య ప్రదర్శన ఎక్కువగా బయలులో ఉండటం

పై విషయాలు మూడవ అధ్యాయంలో పరిశీలించడం జరిగింది

---

## పాదసూచికలు

1. జి. వి రామమూర్తి - సవరలు - పుట. 2
2. చార్‌దేవ = నలుగురు అన్నదమ్ముల తెగ
   పాంచ్‌దేవ = ఐదుగురు అన్నదమ్ములు
   షాదేవ = ఆరుగురు అన్నదమ్ములు
   సాత్‌దేవ ఏడుగురు అన్నదమ్ములు
3. కంభంపాటి సత్యనారాయణ, ఆంధ్రుల చరిత్ర సంస్కృతి (భాగం - 1) పుట 67-68
4. గిరిజన సాహిత్యం-ఒక పరిశీలన-సృజన-అక్టోబర్ - 1983
5. కంభంపాటి సత్యనారాయణ, ఆంధ్రుల చరిత్ర సంస్కృతి (భాగం - 1) పుట 61-62
6. ,, ,, - పుట 65
7. ,, ,, - పుట 47-49
8. ,, ,, - పుట 39
9. ,, ,, - పుట 41-46
10. భద్రాచలం - నూగూరు చోడవరం - ఎల్లవరం పోలవరం

11 గిరిజన సాహిత్య - ఒక పరిశీలన సృజన-అక్టోబర్-1988

12 ఆంధ్రుల చరిత్ర సంస్కృతి (భాగం-1) పుట-11,12

13 బ్రహ్మానంద, శివవాక్కు-భారతి, 1984

14 చూ మూడవ అధ్యాయం, కోలాట నృత్యం, పింగాణి శిపు 'గి-రు కోయిల కూసెనన్న నా గుండెజల్లు జల్లుర మారె కొమ్మ'

15. చూ మూడవ అధ్యాయం ఉరుములు, కుండల నృత్యం

మూడవ అధ్యాయం

# జానపద నృత్యభేదాలు

## సామూహిక నృత్యాలు

గిరిజనుల్లో సామూహిక నృత్యాలే అధికం అలాగే జానపద నృత్యాల్లో కూడా ఆ పరిణామాన్ని ప్రతిబింబించే సామూహిక నృత్యాలనే మొదట చర్చిస్తున్నాను.

**ఆసాది నృత్యం :**

ఆసాది మాదిగల్లో ఒక తెగ వీరి వంశంలో ఒకరికి అబ్బుతుంది ముగ్గురు వ్యక్తులు పాల్గొంటారు పురుషులు మాత్రమే ఉగాది పండుగ పర్వదినాన తప్పకుండా చేస్తారు ఆసాదివారు పండగదినం గోనకోటం, చిగిచర్ల వంశస్థులకు అవసరమౌతారు వీరు పెద్దమ్మ దేవతకు తాము ప్రీతిపాత్రులుగా చెప్పుకొంటారు ఈ దేవతకు 'కల్లు' నైవేద్యంగా పెడతారు కల్లు ఈతచెట్టు నుంచీ తీసే రసం. చెట్టు మొదట్లో గీసే గీత స్త్రీ మర్మాంగంలాగా గీస్తారు పెద్దమ్మస్వామి గుడి దగ్గర నైవేద్యంగా పెట్టిన కల్లును ఆసాదులకు పూజారి (కుమ్మరి వంశస్థులు) పోస్తూ ఎలా ఉంది అంటాడు. అపుడు ఆసాదివారు అమ్మగారి " "[2] లో 'సాదు'లాగా వుంది అని అంటారు.[3] ఆసాదివారు పెద్దమ్మ దేవతను పొలిపాటల్లో బండబూతులతో తిడతారు అలాంటి పాటలన్నీ వారి నోటనే వినాలి.

శిష్ట సమాజం వీరిని హీనజాతిగా పరిగణించినా అగ్రకులాల్లో లేని ఆచార సంప్రదాయాలు వీరికున్నాయి. ఈ విషయం గేయాల్లోనూ, నృత్యంలోనూ తెలుస్తుంది

ఆసాది వారికి ఆయగాళ్ళగా ప్రచారం వుంది. రైతుల ఇళ్ళ దగ్గర, పంటల కాలంలో 'కళ్ళం'లో ధాన్యరాసి నృత్యప్రదర్శన జరిపి ఇప్పించుకొం

టారు వీరు మేలుకొలుపు పాటలు, కథా గేయాలు, వీర, ... ... ... లుగా చెబుతారు. ముఖ్యంగా ఈ క్రింది కథలు ... తారు

1. పెద్దమ్మ స్వామి కథ
2. మ...మ్మ కథ
3 గౌరమ్మ కథ
4 అంకాళమ్మ కథ
5 నల్లలమ్మ కథ
6 మారెమ్మ
7. సిరతిమ్మమ్మ కథ
8 చ...పురమ్మ కథ

ఆసాదివారు మోకాలివరకు పంచె కడతారు ఎర్రటి గుడ్డను నడుముకు, నల్లని కోటును ధరిస్తారు నుదుట బండారు, తలకు రుమాలు, రుమాలుపై వేప మండలు చెక్కుతారు కాళ్ళకు గజ్జెలు కడతారు. వీరు వాడే వాద్యం ... వికిని లేక జమిడిక 4 ఎడమ భుజంపై పొట్టమీద వుండేలా తగిలించుకొ...రు ఎడమ చేత్తో పట్టుకొని కుడిచేత్తో వాద్యాన్ని వాయిస్తారు

ఆసాదివారు ముగ్గురుంటారు ముగ్గురి దగ్గరా వాద్యాలుం...యి వాద్యం గుండ్రాకారంగా కంచు లేదా చెక్కతో తయారు చేసుకొని ఒక పక్క చర్మంతో కప్పుతారు చర్మం మధ్యలో లోపల భాగంలో నరాన్ని ...దతారు నరానికి చివర ఎడమచేత్తో పట్టుకో...నికి పీలుగా పిడిని అమర్చుతారు కుడిచే... వాద్య... లయాత్మకంగా ధ్వనులు పుట్టిస్తారు ఎడమచేత్తో ప...కొనే పిడిని అప్పుడపుడు అటూ ఇటూ తిప్పుతారు 5 మొదటగా కొన్ని గతుల్ని వాయి...ారు అవి ఒకే లయలో వుంటాయి ముగ్గురి దగ్గర అవే ధ్వనులు వస్తాయి పా... ...ందు, కథ చెప్పేముందు మధ్యలో నిలిపి తర్వాత మొదలుపెట్టే పుడు వాద్యం ...ంచి పుట్టే ధ్వనులు ఇలా వుంటాయి.

యిరజుట్

డురడుజ్

డురడుడుజ్

ఇలా ముగ్గురి దగ్గరా వాద్యాలు మ్రోగుతుండగా కథ చెప్పేటప్పుడు, పాటలు పాడేటప్పుడు మాత్రం ప్రధాన గాయకుడు వాద్యాన్ని వాయించడు. వంత పాటగాళ్ళు మాత్రమే వాయిస్తుంటారు ప్రధాన గాయకుడు కొన్ని అడుగులు వేస్తాడు గుండ్రాకారంగా తిరగటం, రెండు కాళ్ళను నేలపై కొట్టటం లాంటివి అలాంటి సమయంలో వంత పాటగాళ్ళ వాద్యపు ధ్వనులిలా వుంటాయి

ఝరధ ఝుముకు
ఝుము ఝుముకు
ఝుమ్ ఝుముకు
ఝుమ్ ఝుమ్ ఝమ్

ప్రధాన గాయకుడు పాట పాడుతుండగా వంత పాటగాళ్ళు అదే పాటను వంత పాడతారు ప్రధాన గాయకుడు చేసే అభినయాన్ని అభినయిస్తారు లేదా ఒక్కొక్కప్పుడు వాద్యాల్ని మాత్రమే వాయిస్తారు ప్రధాన గాయకుడు వలయాకారంగా తిరుగుతూ, వెనక్కి ముందుకి కాళ్ళను మార్చుకొంటూ వంగుతూ లేస్తూ, చేతుల నూపుతూ నృత్యం చేస్తాడు. ఇత చేస్తున్నా వాద్యం మ్రోగుతూనే వుంటుంది ఒక్కొక్కసారి ప్రధాన గాయకుడు చేతిని గాలిలో వూపుతూ మరోసారి చూపుడు వ్రేలిని చెవిలో వుంచుకొని, ఇంకో చేతిని పైకెత్తి రాగాలాపన చేస్తుండగా, కాళ్ళను నేలపై కొడుతుండగా వంత పాటగాళ్ళు అలాగే చేస్తారు మరోసారి అరచేతిని చెవి దగ్గర మూసుకొని ఇంకో చేయిని పైకెత్తినపుడు వాద్యం మ్రోగదు. అలాంటి సమయంలో చిరచిరా అడుగులు వేస్తూ గుండ్రాకారంగా తిరుగుతాడు. వంత పాటగాళ్ళు వాద్యాల్ని మ్రోగిస్తూ గుండ్రాకారంగా తిరుగుతుంటారు. ఇలా యీ నృత్యం మనోజ్ఞంగా ఉంటుంది. వారి అభినయం ఒక్కొక్క చోట వెంట్రుకలు గగుర్పొడిచేలా భయానకంగా ఉంటుంది. ఈ నృత్యం జానపదులకు ఉల్లాసం కల్గిస్తుంది ఈ నృత్యాన్ని చేయిస్తూ గ్రామాన్ని కాపాడమని పెద్దమ్మస్వామిని జానపదులంతా వేడుకొంటారు.

ఆసాదులు మొట్టమొదట మేలకొలుపు పాట పాడతారు పెద్దమ్మస్వామి గుడి దగ్గర పూజ చేయించి, కల్లు బాగా తాగి ఆడి పాడుతారు. మొదటిగా

వాద్యాన్ని కొద్దిసేపు వాయించి, ఒక లయాత్మకంగా ప్రయోగిన తర్వాత ప్రధాన గాయకుడు రెడ్డు చేతులెత్తి మొక్కుతూ ఇలా పాడతాడు

"మేలుకొనవమ్మ తల్లి మేలుకొనవమ్మ
కాపులు వచ్చేరు పూజలు చేసేరు
మేలుకొనవమ్మ తల్లి మేలుకొనవమ్మ
నీ మాయెవ్వరు కానలేరుగా
మేలుకొనవమ్మ
నిజారూపుం తల్లివే మేలుకొనవమ్మ"

పై పాటలో మొదటిగా 'మేలుకొనవమ్మ' అని పాడేటపుడు ఒక్కొక్క కాలిని నేలపై కొడుతూ, రెండవసారి 'మేలుకొనవమ్మ' అంటూ ఇంకో కాలిని నేలపై కొడుతూ గుండ్రాకారంగా తిరుగుతారు తర్వాత వంత పాటగాళ్ళు పాడిన తర్వాత 'కాపులు వచ్చెరు' అని పాడుతూ ఒక్కొక్క కాలి మెడిమల సహాయంతో నేలపై నడుస్తూ, బిరబిరా ముందుకి వెనక్కి నడుస్తుంటారు 'పూజలు చేసెరు' అంటూ గుడి దగ్గరిగా వెళ్ళి మొక్కుతారు అపుడు వంత పాటగాళ్ళు కూడా మొక్కుతారు 'నీ మాయెవ్వరు కానలేరుగా' అంటూ కను రెప్పల్ని విప్పి చూస్తూ (కండ్లప్పగించి) చేతుల నూపుతూ గిర్రున గిర్రున తిరుగుతాడు 'నిజారూపుల తల్లివె' అంటూ పెద్దమ్మస్వామిని చూపిస్తూ వంగుతూ రెండు చేతుల్ని అలా అలా వూపుతాడు 'మేలుకొనవే' అంటూ వాయి ద్యాన్ని గట్టిగా మ్రోయిస్తూ గుండ్రాకారంగా ముగ్గురూ తిరుగుతారు. కాళ్ళ గజ్జెం నాదంతో శ్రుతి కలుపుతూ 'మేలుకొనవమ్మ తల్లి మేలుకొనవమ్మ' అంటూ బిరబిరా పాడుతారు అలా మేలుకొలుపు పాట అయిపోగానే అందరూ ఒక్క సారిగా వాద్యాన్ని లయాత్మకంగా వాయించి నిలిపి వేస్తారు.

నృత్యం మార్పుతో మరో మేలుకొలుపు పాట ప్రధాన గాయకుడు ఒక్కొక్క పాదాన్ని పాడుతుండగా వంత పాటగాళ్ళు అదే పాదాన్ని పాడుతూ, ప్రధాన గాయకుని భంగిమలనే అనుకరిస్తారు మొదట వాద్యాన్ని మ్రోగించి గేయాన్ని నిదానంగా పాడుతూ ఒక్కొక్క కాలిని ముందుకు చాపి మెడిమపై కొద్దిసేపు నిలబెట్టి తర్వాత వెనక్కి తీసుకొని, చేతిని చాపి మరలా ఇంకో కాలిని మెడిమపై నిలబెట్టి పాట పాడుతూ ఉంటాడు వంత పాటగాళ్ళు అదే అడి

నయాన్ని చేస్తూ పాట పాడుతారు ఒక్కొక్కసారి గుండ్రాకారంగా తిరుగుతూ ఎగిరెగిరి గంతులు వేస్తూ, బిరబిరా అడుగులు వేస్తారు వాయిద్యాలు మ్రోగిస్తూ వంత పాటగాళ్ళు ఆట ఆగి తిరగుతూ చేతులు పైకెత్తి రాగాలాపన చేస్తారు ఆ రాగాలాపన వినసొంపుగా వుంటుంది

పై భంగిమలన్ని వారి ఇష్టం వచ్చినపుడు చూపిస్తారు అంతేగానీ ఒక దాని తర్వాత ఒకటి అనే నియమం లేదు వారు ఏ భంగిమ చూపించినా పాటకు అనుగుణంగానే వుంటుంది

మేలుకొనవే రామ తల్లి మేలుకొనవే ఆదిజావనీ
అక్కడాన అన్నిరుచులు నంది పరస జపము చేత్తురు
పూలుపెత్తురు సీకు పూజ చేత్తురు
కన్ని జరకలు కారు కోట్లు కలిసి మెలిసి మేపులాడెను
పడకలందేటి పకయాలలమ్మ ఆరగించేటి పాయాలలమ్మ
చీరకట్టి దేగవన్నెల రవిక తొడిగి
వేగ వన్నెల మెరప్ మెరిసి మన సరివారి జగమందు
యాసురుడు పెట్టిన యీబూది
లింగాలు పెట్టినాను బంగాలుపల్లిలో
సింగార మాయెను యీబూది.

గ్రామాల్లో పసిపిల్లలకు 'తట్టు'<sup></sup> పోస్తుంది అలాంటి వ్యాధితో కళ్ళు పోవటం, చనిపోవటం కూడా సంభవిస్తుంది అలాంటి సమయంలో ఎలా బాధ పడుతారో ఆ వ్యాధి ఎలా వుంటుందో పాటలో అభినయాత్మకంగా తెలియ జేస్తారు. ఆసాదులు పాట పాడేటపుడు వ్యాధితో బాధ పడుతున్నట్టుగా కళ్ళలో నీరు పెడుతూ నిదానంగా అడుగులు వేస్తూ వాద్యాన్ని వాయిస్తుండగా పుట్టే ధ్వనులు ఇలా వుంటాయి

యిరద జూముకు
జూము జూముకు
జూము జూముకు
జూమ్ జూముకు జూముకు
ఝమ్ జూమ్ జూమ్

ప్రధాన గాయకుడు పాట పాడుతుండగా వంత పాటగాళ్ళు ఒకే చోట నిలబడి వంత పాడుతారు వాద్యాన్ని నిదానంగా వాయిస్తూ వుంటారు ఇదే పాటలో అమ్మవారు రాజుల్ని ఎలా చెండాడిందో, రాయదుర్గం, బనగానిపల్లె మూడిండ్లలో ఎలా వసంతమాడిందో ఆమె వరం ఏదో తెలియజేసే ఘట్టాల్లో వాద్యాలు భీతి గొలిపేలా వాయిస్తారు అప్పుడు ధ్వని ఇలా వుంటాయి

ఝుమ్ ఝుమ్ ఝుముకు
ఝుముకు ఝుముకు
ఝుమ్ ఝుమ్

భంగిమలు వీరావేశంతో గంతులు వేయటం, గుండ్రాకారంగా ప్రధాన గాయకుడు మాత్రం తిరగటం దేవత ఎపుడెపుడు ఎలా తిరుగుతుందో పాటలోనే తెలియజేస్తాడు

అదికాదు అనేందమమ్మ అన్ని రూపుల తల్లివమ్మ
అన్ని రూపుల తల్లివమ్మ నీవు దేశారూపుల తల్లివి
దేశారూపుల తల్లివి నీవు దేవతురాలవు నీవె
దేవతురాలవు నీవె నీలవరనాలి నీవె
నీలవరనాలి నీవె నిబ్బర గిన్నెవు నీవె
నిబ్బర గిన్నెవు నీవేను నేరడబ్బల మారిలి నీవేను
అద్దము లేచిన నిద్దగ పొద్దున యిలు చేరి సోదించేవు
సినసిన బాలలు పట్టేవమ్మ పెదపెద బొబ్బలు పెట్టేవు
కలికాయలాల కుండల పోసి కడుపులో మంటలు పెట్టేవు
చెట్ల పాలు నువు తాగేవు సోలిసోలి నువు ఆడేవు
ఏదమ్మ నీ వరము ఏదమ్మ నీ మూలము
మూత్రిగల్ల పెద్దమ్మకు ముందర పూజలు నీకు
ముందర పూజలు నీకు గక్కున పూజలు నీకు
నాటక మనోస్వరింటోకి పోయి నాటి మల్లెలు తెచ్చేవు
కూటకమనోస్వరింటాకి పోయి గుడ్డిసాలు తెచ్చేవు
యింటనకూకోనమ్మ పంచన కూకోని పలికేవు
యీదుకు వచ్చిన నల్లపోతులు యీసరించిన తల్లివి నీవు

పోనరించిన రాజులు పట్టి పొట్టలు చించిన తల్లివి నీవు
రావరించిన రాజుల పట్టి కండలు చించిన తల్లివి నీవు
రాయరాడ రామదుర్గం దావాన బనగానపల్లావి
బనగానపల్లె కాలువానికి అవరై సుపు వచ్చేపు
బనగానిపల్లె మూడు యుద్ధ్మనే బండారి వసంతమాడేవు
ఏదమ్మ నీ వరము ఏదమ్మ నీ సత్రిము
మూర్తిగల్ల పెద్దమ్మకు గక్కున నవకందమిచ్చేము
గక్కున నవకంద మిచ్చేము గౌనుకాసితే కాసేవు

పై పాటలన్నీ మేలుకొలుపు పాటలుగా పెద్దమ్మస్వామి గుడి దగ్గర పాడేవి గ్రామస్థుల గుమికూడటానికి ఆపాటలు పాడతారు ఇలా పాట మొదలయ్యే టప్పటికి ఊర్లోని అమ్మలక్కలు ఒక్కొక్కరే వస్తారు గ్రామస్థులంతా వచ్చిన తర్వాత వారంతా నేలపై కూర్చొని వుండగా వారి మధ్యలో ముగ్గురు నిలబడి కథ మొదలు పెడతారు. ఈ కథ గ్రామస్థులే ఏర్పాటుచేస్తారు లేదా గ్రామస్థు లంతా కలిసి మాట్లాడుకొని (జాతర) దేవర చేయాలని అనుకొంటారు ఈ జాతర చేస్తే వర్షాలు బాగా వస్తాయని పశువులకు, మనుషులకు రోగాలు రావని వారి నమ్మకం అలాంటి సమయంలో తప్పకుండా కథ చెప్తారు ఈ జాతర చేయాలంటే ఎనుపోతును బలి ఇవ్వాలి ఈ పోతును గ్రామస్థులంతా రెండు మూడేళ్ళు ముందుగా వదలుతారు ఇది ఏ పొలంలోకి వెళ్ళి అయినా మేయవచ్చు. బాగా బలుస్తుంది. దీన్ని దేవర సమయంలో ఆపాదులు చిందులు వేస్తుండగా నరుకుతారు నరికిన వెంటనే కుడికాలును మోకాలివరకు కోసి నరికిన తలకు నోటిలోపెట్టి పెద్దమ్మస్వామి ఎదురుగా పెడ్తారు. దీనికి సంబంధించిన కథ ఇలా వుంది.

శూద్రకులానికి చెందిన వాడొకడు పురాణాలను బాగా వంట బట్టి చుకొని బ్రాహ్మణుడిగా చెలామణి అయ్యాడు బ్రాహ్మణ స్త్రీని పరిణయమాడాడు. వారికి సంతానం కలిగింది. ఉగాది పండగొచ్చింది. పండగదినం ఓలిగలు (పోలీలు) చేశారు. భార్య వడ్డించింది. ఆ శూద్రబాపడు వాటిని 'ఎనుపోతు నాలికల్లాగా' ఉన్నాయన్నాడు. వెంటనే ఆ స్త్రీ భర్త విషయాన్ని పసికట్టింది. భర్తను ఎనుపోతు కమ్మని శపించింది. వెంటనే అతడు ఎనుపోతుగా మారాడు ఆమెను తరుముకొని పోయింది? ఆమె పరుగెత్తి పుట్టలో దాక్కొంది ఎను

పోతు పుట్టను కాళ్ళతో దువ్వింది తలతో కుమ్మింది అపుడా స్త్రీ ఎనుపోతు తలను నరికించి రక్తాన్ని నుదుట అలంకరించుకొంటానని శపథం చేసింది ఆమెకు పుట్టిన సంతానాన్ని కూడా గొర్రెలు, కోళ్ళలాగా అయిపోమ్మని శపించింది ఆమె శక్తిస్వరూపిణి శక్తికి రకరకాల పేర్లతో బలి ఇంతువును నైవేద్యంగా నరుకుతారు[8] ప్రతి పల్లెలో కూడా తలను యాట కొడవలితో నరికిన తర్వాత కుడికాలును కోసి నోటో పెట్టి అమ్మవారికి రక్తపు బొట్టు పెట్టి ఎదురుగా ఉంచుతారు ఆ తలను వరమడుగుతారు సిందూరపు నీటిని నరికిన తలమీద పోసి రెండు చెవులను సాగదీసి తన మనస్సులోని కోర్కెల్ని తెలిపితే అవి జరిగితే తలముక్కులు ఎగరేస్తుంది జరగకపోతే తల ఊరకనే వుంటుంది ఇలాంటి దృశ్యాన్ని ఇప్పటికి పల్లెలో చూడవచ్చు.[9] పోతును నరికే సమయంలో ఇతర గ్రామస్థుల్ని దగ్గర ఉంచరు[10] ఇలాంటి శక్తి స్వరూపిణి కథను ఆసాది వారు మూడురోజులు లేదా తొమ్మిది రోజులు చెప్తారు

ఆసాదుల గేయాల్లో 'పల్లవి' రకరకాలుగా వుంది మొదట గేయాన్ని ఎత్తుగడ ఎత్తుకొనేటపుడు 'పల్లవి'ని నిదానంగా పాడుతారు తర్వాత గేయంలోని రెండు పాదాలు పాడిన తర్వాత పల్లవిని ఎత్తుకొనేటపుడు బిరబిరా పాడతారు. అలా రెండుసార్లు అదే పల్లవిని పాడి గేయంలో రెండుపాదాల తర్వాత వుండే పాదాల్ని పాడుతారు ప్రతి రెండు పాదాల తర్వాత పల్లవి పాడే గేయం-

మల్లెల మల్లాలే యెనుపోతురా మల్లె తెవులు
కారమల్లె తెవులు యెనుపోతు కాల్లు యెనికొన్న
సెవులు సన్నాలమ్మ యిది సెట్టి వారిపోతు ॥మల్లె॥
బిగువులు సన్నాలమ్మ యిది బీమిరెడ్డి వారిది
అడుగు సన్నాలమ్మ యిది ఆలివిగాలి పోతు ॥మల్లె॥
పోతునైన పుట్టేతపుడు పోతుకు రాసిన బొమ్మరాతనే
మూడు తిరనము తెచ్చి అమ్మకు తెచ్చిందెనుపోతు
పెద్దమ్మకు తెచ్చిందెనుపోతు ॥మల్లె॥

మరో గేయంలో పల్లవిని ప్రతిపాదం పాడిన వెంటనే పాడుతారు. ఈ పల్లవితో అభినయానికి నృత్య భంగిమకు, వాద్యాన్ని వాయించడానికి ఒక పూవు, తూగు వస్తుంది. పల్లవి ఎత్తుకొనేటపుడు శరీరాన్ని అలా వంచుతూ, కుడిచేతిని

పై కెత్తుతూ రాగాలాపన చేస్తారు. పాటలో వీరభావాన్ని చూపించే భంగిమలున్న పుడు వాద్యాన్ని బిగ్గరగా మోగిస్తారు. పల్లవిని గట్టిగా (తారాస్థాయిలో) ఎత్తు కొంటారు. అలాంటి వీరభావం చివరలో వాడతారు.

అది లచ్చిమిదేవి నల్లాపురమ్మా
అపరంజి కుందనమె బంగారు బొమ్మ ॥అది॥
సిననిన్న తలుపులు తీసి కన్నులెవ్వరమ్మ ॥అది॥
అమ్మ నీ సొమ్మెంత దోచిన వెవరమ్మ ॥అది॥
యాపమాని సెట్టుమీద నీ పుంజేరమ్మా ॥అది॥
పగవారి దండులో నీ కత్తి మెరిసెనమ్మ ॥అది॥
పగవాని గుండెలు జలజల్లు మనునమ్మా ॥అది॥

మరో గేయంలో 'పల్లవి'ని ప్రతిపాదాన్ని రెండుసార్లు పాడిన తర్వాత పాడుతారు. ఇలా పాడటంవల్ల గేయానికి ఒక తూగువస్తుంది. అలా ప్రతిసారి పల్లవిని ఎత్తుకొనే సమయంలో శరీరమంతా అలా అలా లయాత్మకంగా వూపు తారు. మోకాళ్ళను కొద్దిగా వంచి రెండుచేతుల్ని చాపి పల్లవిని పాడుతారు. వంత పాటగాళ్ళు నిదానంగా వాద్యాన్ని వాయిస్తారు. ఇలాంటి సమయంలో పల్లవికి వాద్యపు ధ్వనులకు దగ్గర సంబంధముంటుంది.

గేయమంతటా అడుగులు ఒకే రకంగా వుంటాయి. ప్రధాన గాయకుడు మునివ్రేళ్ళపైన నిలబడి రెండు కాళ్ళను ఒకదాని మీద నొకటి పెనవేసుకోవటం రెండుసార్లు ఎగిరిన తర్వాత వాద్యాన్ని నిలిపి నిలిపి వాయించటం పల్లవికి ప్రాధాన్యం పెరుగుతుంది.

'యెండి కన్నుల యాప చీరలు
యెందుకమ్మ మాయమ్మ
పంది కన్నుల పట్టుచీరలు
అందమైన నీలవేని ॥పంది - యెంది॥

రెండు కొండల నట్టనడుమ
వచ్చిరెవరు చూడరమ్మ ॥రెండు - యెంది॥

పరుబరెనికి చూడరమ్మ
అందముగ పెద్దమ్మవమ్మ ॥పరబు - యెంది॥

ఈ నృత్య కళారూపానికి ప్రేక్షకుల ప్రతిక్రియ ఎలా వుంటుందో చూడటం అవసరం. శిష్ట సంగీత నృత్యాంలో లేని అనేకాలు, ఉద్రేకాలు, శక్తి ఈ కళారూపంలో వుంది. నృత్య భంగిమలు చేస్తున్నప్పుడు ఆ దేవతను గూర్చి చెబుతున్న సమయంలో రెండు చేతుల్ని ఎత్తి మొక్కటం, ఇంకా వాద్యపు ధ్వనులద్వారా 'సరాలు జివ్వుమంటుంటే' ఏ ప్రేక్షకుడు నడిరాతిరి అయినప్పటికి నిద్దుర జోలికి పోడు. అందరూ ఆనందుల ఊపుచే వింటూ, ఇంకా కొద్దిమంది ఎగిరిగంతులు వేసేవాళ్ళు ఈలలు వేస్తూ. అమ్మవారు సోకిన విధానాన్ని చెబుతున్న సందర్భంలో భయపడే పిల్లలకు పెద్దమ్మ స్వామి దగ్గరుండే బండారు తెచ్చి నుదుట పెట్టటం కూడా మనం చూడవచ్చు. ఇలా జనుల 'జీవ నాడి' ఆపాదివారి నృత్యకళలో కనిపిస్తుంది.

కళాకారులు :

ఆసాది చిన్నపీరప్ప — 55 స ॥లు కూలి
ఆసాది నాగన్న — 29 ,, కూలి
ఆసాది పక్కీరప్ప — 30 ,, కూలి

కథను చెప్పేరోజు అయ్యే ఖర్చులు ఇనాములు ఇస్తేచాలు కళను అభినయించటం ముఖ్యంగా వుంది కల్లు సారాయి బాగా తాపించాలి డబ్బు ప్రధానం కాదు మనస్ఫూర్తిగా ఇచ్చిన కానుకలు స్వీకరిస్తారు అపుడు వారి ఆనందానికి అవధులుండవు

చిరునామా

**జానపద యువకళాకారుల సంఘం**

రిజిష్టర్డ్ 245/88
సుబ్బరావుపేట పోస్ట్, ధర్మవరం మండలం,
అనంతపురం జిల్లా



**ఆసాది నాగన్న బృందంతో రచయిత**

## 2. ఉరుముల నృత్యం

ఉరుము అనేది వాద్యం ఈ వాద్యాన్ని వాయించేవారు 'ఉరుమలోళ్లు' మాలతెగలో ఎక్కువగా ఈ మండలంలో ఉన్నారు ఇద్దరు మొదలు ఎంతమం దైనా కలిసి చేసే నృత్యమిది సుమారు ఐదారు మంది నృత్యం చేస్తారు వీరు ప్రతి మంగళవారం రోజు గంగమ్మ దేవత దగ్గర మేలుకొలుపు పాటలు, అమ్మ వారి కథాగేయాలు పాడుతారు ఉరుము కొడుతూ, పాడుతూ పూజారికి పూనకం తెప్పిస్తారు వీరు నృత్యం ఏకాదశి పండుగ[11]నాడు తప్పకుండా చేస్తారు, లేదా గంగమ్మ, కాటమయ్య, బొమ్మయ్య, వీరనారాయణస్వామి, వీరతిమ్మమ్మ, చల్లా పరమ్మ గుళ్లదగ్గర పూజ జరిగే రోజుల్లో చేస్తారు వీరు కులవృత్తిగా ఈ ఉరు మును వాయిస్తారు వంశంలో ఎవరికో ఒకరికి అబ్బుతుంది

ఉరుమలోళ్లు తలకు రుమాలు చుట్టుకొంటారు. బండారు, కుంకుమ నామాలు బొట్టు పెట్టుకొంటారు మెడలో కాసులదండ వేసుకొంటారు ఎర్రని కాలువాను వేసుకొని, నిలువు అంగి లేదా మామూలుగా అపారం (half-aram షర్టు) పంచె కట్టుకొంటారు కాళ్ళకు గజ్జెలు ధరిస్తారు ఉరుమును పొట్టపై ఉండేలాగా కుడిపక్క భుజానికి యడమప్రక్క నడుముకు తాటి సహాయంలో వ్రేలాడదీసుకొంటారు అలా వేసుకోటానికి కారణం తాడు భుజాన్ని రాసుకోకుండా ఉండటం కోసం. ఉరుముల్ని 'కదురుపుల్లల'తో వాయిస్తారు.

ఈ వాద్యాన్ని జానపదుడు ఆకాశంలో పుట్టే శబ్దానికనుగుణంగా తయారు చేసుకొన్నాడు వర్షాకాలంలో ఉరిమేది 'ఉరుము' అంటారు. దీనికి ఈ వాద్యానికి దగ్గరిగానే సంబంధముంది వాయిద్యాన్ని వాయించేటపుడు గుండెలు అదరి పోతాయి ఆకాశంలో వురిమే వురుము శబ్దాన్ని వింటూనే గుండెలదరి భయపడ తారు అలాంటి సమయంలో ప్రతి జానపదుని నోట

"అర్జునా అర్జునా ఫల్గుణా
అర్జునా మొండిగోడకింద
ముండమోపులున్నారు ఇంతం అర్జునా" అనే మాటలు బయలు

పడతాయి

అర్జునున్ని అలా అనడానికి కారణం ఇలా చెప్తారు అర్జునుడు ఇంద్రుని కుమారుడు ఇంద్రుని ఆజ్ఞప్రకారమే వర్షాలు కురవటం, ఉరుములు మెరుపులు

రావటం ఉంటుందని నమ్మకం అలాంటి సమయంలో అర్జునుడు రథాన్ని బిర బిరా తోలుతుండగా చక్రాల అదుర్లు అలా (ఉరుములా) వస్తాయట రథచక్రాని కుండే 'కడసిల్ల' జా) భూమిపై పడితే దాన్ని పిడుగు అంటారు పిడుగుపడితే చనిపోవటం, పంటలు నాశనం కావటం జరుగుతుంది అలాంటి ఉరుమును జానపదుడు వాయిస్తూ రకరకాల ధ్వనులు పుట్టిస్తారు

## ఉరుము నిర్మాణం

కంచుతో గుండ్రాకారంగా తయారుచేసి కుడిఎడమల మేక చర్మాన్ని బాగా శుద్ధిచేసి అమర్చుకొంటారు చర్మాన్ని కంచుడమ్మకు బిర్రుగా అమర్చుతారు కంచుపై అలంకారంకోసం గడ్డనుగాని రకరకాల కొయ్యపూసల గడ్డగాని అందంగా వేస్తారు ఎడమపక్క చర్మానికి నల్లని దారను మధ్యలో గుర్తుగా పెడ్తారు. రెండు కదురు పుల్లలను తీసుకొని ఎడమప్రక్క 'బూర్ బూర్ బూర్' మనే శబ్దాన్ని కుడిప్రక్కన "డబు డబు డబు డబు" అనే శబ్దాల్ని పుట్టిస్తారు. ఇవి పాటకనుగుణంగా కొడతారు మేలుకొలుపు పాటల్లో మాత్రం కుడిచేతిపుల్లను వాయిస్తూ ఉంటారు నృత్యంలో మాత్రం రెండుప్రక్కలా వాయిస్తారు

మొదటిగా ఉరుమును ఇలా వాయిస్తారు

బూర్ బూర్ బూర్ బూర్
డబు డబు డబు డబు
యిరడడ్డబూర్ బురడ్డ్
డబు డుబు డబుడుబు

తర్వాత రెండు చేతులెత్తి (పుల్లలతోసహా) నమస్కారంచేసి 'పరాకు పరాకు' అనే వచనాన్ని పాడుతారు. తర్వాత మేలుకొలుపు పాటల్లో మాత్రం కుడిచేతిలోని పుల్లతో కొడతారు. అపుడు ఇలా మ్రోగుతుంది

'డప్ డప్ డప్
డప్ డప్ డప్
డప్ డప్ డప్'

అలా వాయించిన తర్వాత అందరూ కలిసి గుండ్రాకారంగా వుంటూ ।ందు కాళ్లను పెనవేసుకొంటూ, శరీరమంతా వూపుతూ ఎగరుతూ నృత్యం

చేస్తారు అలాంటి సమయంలో ఏ పాట పాడరు నృత్యం గుండ్రాకారంగా ఒక్కొక్కరికి పోటీగా ఉరుమును వాయిస్తూ ఒక్కొక్క ధ్వనికి ఒక్కొక్క ఎగురు ఎగురుతూ అందరూ గుండ్రాకారంగా తిరుగుతారు ఇంకా సరిసంఖ్యలో ఎదురెదురుగా అటు ఇటూ ఎగురుతు తిరుగుతూ వుంటారు తలను అలా ఇలా త్రిప్పుతూ మధ్య మధ్యలో "అహ అహ హ హ హ
ఒహో హో హో హో హో"

అనే మాటలంటూ వుంటారు ఇలాంటి సమయంలో ఉరుమునుంచి పుట్టే ధ్వను లిలా వుంటాయి

"యిరదద్ద బూర్ బూదగ్ద్
యిరదద్ద బూర్ బూ దద్ద్
యిరదద్ద
యిరదద్ద బూర్ బూదద్ద
యిరద బూరు బూదద్ద్
యిరదద్ద బూర్బూదద్ద
యిరదద్
యిరదద్"

ఈ శబ్దాలన్నీ అందరూ ఒకే వరుసలో లయాత్మకంగా వాయిస్తూ నృత్యం చేస్తారు అందరూ ఒకర్ని చూసుకొని ఇంకొకరు అలాగే అడుగులు వెయ్యటం గుండ్రాకారంగా తిరగటం చేస్తారు వాద్యాన్ని అందరూ ఒకేసారి నిలపటం - తర్వాత కొట్టటం - విసపొంపుగా ఉంటుంది అలాంటి సమయంలో ఎడమచేతిలో కదురుపుల్ల చాలా బిరబిరా త్రిప్పుతారు చేతిని బిరబిరా త్రిప్పుచు 'బూర్ బూర్'మనే శబ్దాన్ని పుట్టించడంతో మోచేతిని వూపటంతో తలను త్రిప్ప టంతో నడుముపై వున్న వాయిద్యం ఊగడంతో శరీరమంత ఒంపుసొంపులుగా ఎగరటంతో వారి నృత్య కౌశలం ఆశ్చర్యాన్ని కల్గిస్తుంది.

ఉరుము కొడుతుండగా కుంచెల నృత్యం చేస్తారు. దీన్నే 'తుంకాలాట' అని అంటారు కుంచెల్ని నెమలీకలతో తయారుచేసుకొంటారు. 'పరక (చీపురు) కడతారు ఈ కుంచెల్ని రెండు చేతులతో తలమీద ఉంచుకొని నలుగురు వరు సగా నిలబడతారు. వీరు బావిలో మునిగి వస్తారు. ఉరుములు కొడుతుండగా

వారు కళ్ళు మూసుకొని ఉంటారు ఉరుములోళ్ళు వారిని పూనకం తెపి ంచటానికి గాను వాయించే గతులిలా ఉ:టాయి

"డబు డబు డబూ
డబు డుబు డబు
దద్దబూరు బూరు దడ్
యిరదద్ద బూర బూదడ్
యిరదద్దబూరు బూదడ్
డబు డబు డబు డబు
డబు డబు డబు దడ్"

ఈ గతులద్వారా కుంచెలు పట్టుకొన్న వారికి నరాలు జివ్వుమంటాయి శరీరంలోని ప్రతి అవయవమూ (జోము పట్టి, తిమ్మిరి) గతుల ననుగుణంగా అడుగులు వేస్తారు అలాంటి సమయంలో ఉరుములోళ్లు వారికి పూనకం తెప్పించటానికిగానూ పాడే మేలుకొలుపుపాట ఇలా వుంది ఈ పాట ప్రతి గుడి దగ్గర పాడతారు అలాంటి సమయం లో కొద్దిసేపు ఉరుమును వాయించి కుడిచేతితో మాత్రం ప్రతి రెండు చరణాలకొకసారి వాద్యాన్ని వాయిస్తారు అలాంటి సమయంలో పుట్టే గతులిలా వుంటాయి

"డబుడుబ్ డబ్
డబు డుబ్ డబ్
డబు డుబ్ డబ్"

"మేలూకొనవే వో మేలుకొనవే
అమ్మ నీవు పుట్టక ముందే నాడూ
యిగమూలేదూ జగములేదు ॥మే॥

అమ్మ మచ్చు మాయల వో గంగినీవూ
పినిగిలు తినేవు పిశాచివో ॥మే॥

సామి గంగలేని వో తానమేలేదు
గంగలేని వో జలకమ్మే లేదు ॥మే॥

సామీ నీవు పుట్టకముందే నా దూ
నరుడు లేడు వో నారాయనుడే లేడు ॥మే॥

యిష్ణు దు వో యీసురుడు లేదు
ముప్పది కోట్ల వో మునులే లేరూ ॥మే॥

తొంబ్బది కోట్ల వో దేవతలేలేరు
అమ్మ పాపణాతి నలపీర గంగ వూ ॥మే॥

దావలిద నేవో ఆదిశక్తి దావలిదనే ॥మే॥

పై గేయంలో రాగాలాపనె చాలా ముఖ్యం వాటిలో 'ఓ' అని పదం ఒక గతిలో రాగాలాపన చేస్తారు (మేలుకొనవే వో) ముందేనాదూ ఇలాంటిచోట్ల శరీర మంతా వూపుతూ, రాగాలాపనతో ఉరుము గతికి చాలా దగ్గర సంబంధంతో వుంటుంది పాట అంతా రాగంతోనే కూడుకొని ఉంటుంది. గుక్కతిరిగేదంకా గట్టిగా రాగం తీయటం ఈ గాయకుల ప్రత్యేకత. పాటలన్నీ ఒక్కొక్కరే పాడ తారు కుడిచేతిలోని పుల్లను కొట్టేటపుడు కలుపుకొంటారు అలా ఈ పాటలో 'ఓ' అనే అక్షరం ఒక వూపులో అనటవల్లా పాటకు, వాద్యానికీ వినాటానికి సొంపుగా వుంటుంది.

పాట అవగానే కుంచెలు పట్టుకొన్న వారంతా వూగటం, ఒక్కొక్క అడుగు వెనక్కి ముందుకి వేయటం చేస్తుండగా, చుట్టూ వుండే జనం ఇద్దరు లేదా ముగ్గురు జంజారును, కుంభాన్ని వారిపై చల్లుతుంటారు వారి కళ్లు నీలు' క్కాని పోదీనం (12) లేకుండా ఉంటుంద వాద్యం ఎలా మ్రోగితే అలా అడు గులు వేస్తారు కాళ్ళను పెనవేసుకొనటం ఒకరికొకరు తగలటం ఇష్టం వచ్చినట్టు తిరుగుతూ అడుగులు వేయటం, ఆశ్చర్యంతో కూడుకొని వుంటుంది. ఈనాట్యం వీరావేశాంతో కూడుకొంటుంది. వీర నాట్యం వలె వుంటుంది వాద్యపుగతులు ఇలా వుంటాయి ఒక్కొక్క గతికి కుంచెలు ధరించిన వారంతా ఒకేరకంగా అడుగువేస్తారు కాళ్ళను పెనవేసుకోటం ఎక్కువగా చేస్తారు.

"యిరదద్ద ఋార్ ఋా దద్ద
యిరదద్ద ఋార్ ఋా
ఋిరదద్ద

యిరదడ్డ, బూర్ బూ దడ్డ్
యిరదడ్డ, బూర్ బూ గడ్డ్
యిరదడ్డ, బూర్ బూ దడ్డ్
యిరదడ్డ,
యిరదడ్డ్,
యిరదడ్డ్"

అలా గతులకనుగుణంగా నృత్యం చేసి చేసి వాలిపోతుండగా నిమ్మపండు కోసి వారి నోటిలో పిండుతారు ఆ నిమ్మపండును నోటికి కరిపించుకొని అలాగే ఎగురుతుంటారు ఒక్కొక్కసారి ఉరుములు మధ్యలో, కుంచెలు చుట్టూర చేరుతారు లేదా ఉరుము కుంచెలు అన్నీ ఒకే వరుసలో వారిలో కలిసి అడుగులు వేస్తారు. కుంచెలు పట్టుకొన్నవారిమీద కుంకుమ చల్లటంతో శరీరమంతా తడి గుడ్డలమీన కుంకుమ, బండారు చల్లడంతో రంగురంగులుగా తయారై అందరూ రక్తసిక్తులైన యుద్ధవీరుల్లాగా కన్పిస్తారు ఈ భంగిమల్లో కొన్ని అద్భుతంగా, రౌద్రంగా అగుపిస్తూ ఉంటాయి కంటిగ్రుడ్లను పెద్దవి చేస్తూ 'భ్రమ' అభినయిస్తారు ఉరుములోళ్లు గట్టిగా 'ఏయ్, ఓహోహో' అంటూ భయాత్మకంగా అరుస్తారు

అడొక వీరనృత్యం పేరణితో చాలా పోలికలున్నాయి

ఉదా :- తతైతా
దితై దితైతై
తై తరికిటతై
తతై దితై
తతై తిరికిటతై
తై తరికిటతై
తోటకిత
తై
తై తై
తరికిటతై
థకిట తకిథ

తై
తై తరికిటతై
తై తరికిటతై
తై (పేరిణి శివతాండవం - పుట 61 నటరాజ రామకృష్ణ)

ఢబు డుబు
యిరదద్ద యిరదద్ద
యిరదద్ద బూక్ బూదద్ద్
ఢబు ఢబు
దద్ద యిరదద్ద బూ
యిరదద్ద బూక్ బూదద్ద్
ఢబు డుబు దద్ద
దద్ద
యిరదద్ద
ఢబు దద్ద
ఢబు డుబు డద్ద
దద్ద
ఢబు దద్ద
దద్ద
ఢడు దద్ద
యిరదద్ద బూర్ బూగద్ద

ఉరుమును కొద్దిసేపు వాయించి ఎడమచేతిలోని పుల్లతో మాత్రం వాయిస్తూ పాడే 'పరాకు' పాట ఇలా వుంది. ఈ పాటలో తన వూపిరి శక్తి వున్నంతవరకు గుక్కతిప్పుకొనేంతవరకు పాడతారు. అప్పుడు కుడిచేతిలోని పుల్లను వాయిస్తారు. లేదా అలాగే పాట పాడుతుంటారు. పిల్లను వాయిస్తాదనంగా 'ఓ ఆహా హా హా' అలాంటి సమయంలో ప్రతిసారి ఇలాంటి ధ్వనులుంటాయి.

దబ్ దవ్ డప్
ఢప్ డప్ ధప్
దప్ డప్ దప్
దప్ డప్ దప్
డఫ్ డఫ్ దపు

మధ్యలో ఎప్పుడైనా ఎడమచేతిలోని పుల్లను పాటపాడుతుండగా 'బూర్, బూర్' అనే శబ్దాల్ని పుట్టిస్తుంటాడు అలా పాడే 'పరాకు' ఇలావుంది

"పరాకు పరాకు యచ్చరిక[13] పరాకు
మనవాలకించు మందన పుడితివమ్మ
మాయకారి గంగ
దొడ్డన పుడితివమ్మ దొన కొండగంగ
తేనె కుండాలవంటి తెప్పల్ల నడిజోడు
నూనెకుండాలవంటి నురుగుల్ల గంగవో ఆహ అహ ఆహ

ఆద తప్పనివాడు ఆరుగురు రాజులు
అక్కారావుడు దేవమ్మ రాజు పుట్టిందేది
వేరు పనసలో రాజు పెరిగిందేది
నాలగెరిడిలో, యాయి రాజు యుద్ధము చేసిందేది
వారాది మండపము, రాజుయేలిందేది
బంగార్ల జానుకోట, అక్కలకుతమ్ముడవో హ హ హ

ఆకాశ పురుషుడు, గంగలకు తమ్ముడు
గనుడుపోతలయ్య ఈశునికుమారుడు
ఈ లోకానికి రచ్చకుడు, పరమేషుని
కుమారుడు వల్లుజరల పోతలన్న

ఆస్రుకదుపున నీవులోక రాచ్చసుల బైరి
తన వక్కపేరు సెపితే కాటిలో భూతాలు
గడగడ వనకాల సూరచంద్రాదులు గతులు
తప్పవాల సుక్కలు జల జల రాలాలా వో హ హ హ హ

గంగలేని తానంబులేదు
గంగలేని జలకమ్ములేదు
గంగలేని పుతకమ్ములేదు
గంగలేని నందిలేదు

నీవులేని తలములేదమ్మ
పన్నెండు ఆర్తాలు గలవు
నాగిరితి నలవీరగంగవో హ హో

తిపర బయంకారివి తిరులోక సంచారివి
శిరసూల మొకచేత బడితివి
దక్కివకచేత ఢమరుకమొకచేత
కత్తులొకచేత కటారువకచేత
నిమ్మపండొకచేత నిలువుటద్దము మొకచేతనో

పూర్లోటి శక్తులను పురకసాగత్రివి
పొలిమేర శక్తులను కందల చెండాడితివి
యీపున వీరతాడు నలవచీర కట్టినావు
నలతరవికి తొడిగినావు
యాపపరక వకచేత పట్టుకొని
యీదు వీదుల యిప్పరాపిస్త్రివో

ఏడు కులాల ఇండ్లు మీద కొలువుతీరాస్త్రివి
పట్టిపినిగిలు తినేగంగ
పచ్చిపినిగిలు తినేగంగ
మచ్చ మాయలగంగ వో మాయకారి గంగ
యిస్నురూపు యీశురుని రూపు
బ్రహ్మ రూపు నీవులేని తలములేదో

కట్టకడ దర్బారికాడ కాసేది నీపాంకులు
మోసేది నీ బరువు, కట్టేది నీ వస్త్రము
తినేది నీ వన్నము నేనువాడిన మాట అబద్ధమని
ఎంగిలి గర్భమని యెగ్గుపెట్టకుండా
వకవేల తలసేము వకవేల మరిసేము
కండకావరముచేత మనఘాలకించు మా దండమొప్పో

పెద్దలకిచ్చినవరము చిన్నలకి తప్పనంటివి
చిన్నలకిచ్చిన మాట శిశుబాలలకు తప్పవంటివి
శిశుబాలకిచ్చిన మాట కసికందులకు తప్పనంటివి
మనవాలకించు మా మదండమెప్పో,

పైపాటను పాడుతున్నసమయంలో అపుడు అపుడు అడుగు ముందుకేయటం పొట్టపైనుండే వాద్యాన్ని అలా ముందుకు నూకటం మనిషి వంగటం, ఎడమచేతి చూపిటి[వేలిని చెవిలో పెట్టుకోవటం, ఒక్కొక్కసారి రెండు చేతుల్ని చెవులదగ్గర వుంచుకోవటం, మొక్కటం చేస్తారు కుడిచేతిని చాపటం, ఎడమకాలిని మెడిమపై నిలబెట్టుకోవటం తర్వాత యదాస్థానంలో పు ంచటం ఒక పాట చూద్దాం ఇందులో కూడా పల్లవి పాడే తీరు చాలా రమణీయంగా వుంటుంది 'నేనే వస్తారా' అనే పల్లవి ఎన్నోసార్లు పునరుక్తి అవుతుంది

"నేనే వస్తారా నేనే వస్తారా వీరన్నా నేనే వస్తారా కన్నతం[డీ
నల్లగొర్ల నేను మందాయిలోన సమ్మకాలు నేను చెబుతాను
నేనే వస్తారా వీరన్నా నీకు నేనే వస్తారా "నేనే"

జల్లడిలు ఏటి గడ్డ పీర బుచ్చమ్మ గడ్డలోన
సిల్లోల్ల సినగడ్డావో వద్దాయి దొరలు
పిరమల్ల వాడు జంగమన్న వెయిగన్నల కుంచికోపనొస్తా
నల్లమేకల నాగన్నకు 'వురుము'లేని దినమునాడు
వురుముతాను నేనే వస్తారా నేనే వస్తారా "నేనే"

సిన్నంబెస్త బాపనపల్లి గొల్లోల్ల వాల్లి సిన్నదీర
నాకు నాకు పోరాట కుమారుడు "నేనే"

పుత్రరాది కంట వస్తాడా వురమల బుచ్చన్న
కంచిరాము కోవున కోపన్నె వస్తా
కంచురనేని నాదునింక కలకల పలుక్కు
కీటు మూగలకు మాటలిస్తానంటా
సంతులేని బాలలకు సంతునే చెపుతాను "నేనే"

సిన్న దొర బెస్తబాపనపల్లి పచ్చిమేకలనాగన్న
'పాటకావడి' కోడనొస్తా నేనే వస్తారా
'పుఢుమం' వడి సుబ్బన్నిఁటికే దాపనపల్లి వంకలోన
తాటిమాని తొంగ్రి మానిలలో నేనే వస్తారా "నేనే"

యోరకల తాటిమాని వంక కలకల కలమాలై
తేయి చెప్పె 'సుద్దులు' పగులు కన్ననే చెపుతానన్న
నడిగడ్డరా దేశములోన సిన్నది గొగ్గిల్లింగాయి పల్లి
చిత్తారి రావలగొల్లు "నేనే"

కుట మట మధ్యాన్నము సిగరాయి ఏట్లకాలువ
రాకపోతే నాది నారమేరంటారో
రత్నకమ్మిటి రాగసింహనము త్రిమంతసామ్రాని
పట్టాడు టెంకాయ నాకు నేనే వస్తారా "నేనే"

ధరిని మింద నేను వలపనే భూమి యంద పందేదిలేదు
నాకు తె వు నారాయణమ్మ మామ మచ్చిలునలవీరన్న
కలసినన్ను పిప్పిసెప్ప నాకు తెలవు నారాయనమ్మ "నేనే"

కదిరి రమ్మని కమ్మరనన్న సాగిరమ్మ జాబులువెనోరో
నాకు తెలవు నారాయనమ్మో
ముచ్చెనాగుం తలా పోసి మనసిచ్చినావో
అట్లువై నాకు బోసినాది నాకు తెలవు నారాయనమ్మో
కన్నకొడుకా వాదినారాయనమ్మ ఏమి చేతురా
పాపిముండ సల్లజరల గంగ వేమిచేతు
నూరెండ్ల తలోల్ల మేరనురేసి చేతుల్లో వాళ్ల
నగరు గబ్బు లేపినాది ఈటిన నోరుల చేత
కన్నపెట్టినాది పాపివారంత సల్లజరల ముంద
నాకు తెలవు నారాయనమ్మ "నేనే"

మరో గేయంలో కొన్ని చరణాలను పాడి పల్లవినిఎత్తుకోవటంలో నృత్య భంగిమలున్నాయి పురుషు ఒకరే కొడుతుండగా మొదటిగా రెండు ప్రక్కల

వాయిస్తూ గుండ్రాకారంగా తిరుగుతారు గేయంలోని అర్థాని కనుగుణంగా చేతుల్ని వూపుతూ, శరీరంలోని అవయవాలను వాటి నుగుణ గా తిప్పుతూ ప్రతి చరణానికి చేతులను కాళ్లను ప్రక్కకు జరపటం వుంటుంది అలాంటి పాట వాద్యాన్ని 'డబుడుబు డుబు' అంటూ మ్రోగిస్తూ కుడిప్రక్క మాత్రమే వాయిస్తుండగా పాట పాడతాడు అపుడు వాయించే ధ్వనులు

"డబు డుబు డబ్
డబు డుబు డబ్
డబు డుబు డబ్
డబు డుబు డబ్
డబ్ డబ్ డబ్"

"వో సెండాడు మాదన్న సెండాడు
వోరి సెండాడు మాదన్న నా కొడుకా సెండాడు
సామి కూటికి వేదపల్లోన కులానికి పెద్దోల్లనో "చెండా"

సిరినల్లో "వాడతారాగిరికల్లో" వాడుతారా
వురివల్ల ఆడుతూ సెండాడు తానో
కులము 'బాయి'కులము వురివాల్లదడుచెండు "చెండా"

సన్నగజ్జెం పట్నము జరంగా
ఇప్పడివ్పుడు లేపిరారా కమ్మరలమేకన్ను
వరే తూరపాన బొగ్గూలు చింతమానుండి
రామన్న లేపేను రెండు సమ్మెట్లు తీసికోర
కమ్మర దేవ దేవన్న "చెండా"

నా వక్క కొడుకు వంట సన్నగెజ్జెం మాదన్న
ముగిత్తైన సెండు కావల్ల
అట్టాడు ముత్యాలు అడుగేరి పంచూ "చెండా"

ముంతాడు ముత్యాలు నేమి ముగిసినేమో చెండుచేయా
నా వక్క కొడుకు కస్తూరి గంగయ్యా యింటిలో వున్నదై వమూ
కమ్మరాజులం బాబు లివరంగ రాయ "చెండా"

అచ్చుమురంగ జాబుల మరంగ చెండు వస్తాదిరా
సన్నగజ్జెల వట్టినొవుూ బల్లాలి వస్తుందమ్మ
కమ్మరము దేవన్న జాబు ంమదేనన్నా "చెండా"

యీాటికి పన్నెండామడ కస్తూరి రంగయ్య
వుండాదు యిల్లలిపి దేవుడు తుమర తుమ్మెద
పులితో వట్టవాక పాలాకురములుగు సామినై
పరంజోతినై "చెండా"

## మరో పాట

పామాదకరిసెనిన్ను పామాద కరిసెనిన్ను
పలమాసి మాదన్న జోమాద జోగెతండ్రీ
ముప్పది మూడు కోట్ల దేవతలను ముప్పదిమూడు కోట్ల దేవతలను
మెప్పించి నిన్ను యిప్పించు కొంటిగదర కొడుకా ॥పా॥

పాలులేని సంతులకు పాలులేని సంతులకు
పాలసత్రాలు కట్టించింటి కదర కొడుకా ॥పా॥

అన్నము లేనివారికి అన్నము లేనివారికి
అన్నసత్రాలు పెట్టించింటి కదర కొడుకా ।పా॥

గుట్ట గుట్ట సేనిలోన గుట్ట గుట్ల చేనిలోన
యర్ర సిగుర మానికింద కాలిపోయిన మిన్నాగు
కాటేమె వందినాది పామాద కరిసె నిన్ను
పామైన కాటుకందినపుడు పామైన కాటుకంది నపుడు
నీవెంత దుక్కాద్రి పోతివో కొడకా పామాద

పాట అయిపోగానే రెండు ప్రక్కల వురుమును వాయిస్తూ గుండ్రాకారంగా తిరుగుతాడు కాళ్లను పెనవేసు కోవటం బిరబిలా ఎగరటం చేస్తాడు 'ఢడ్డబూర్ బూదర్డ్" అనే గతిలో వురుము వాయిస్తూంటాడు

చివరిగా వురుమలోల్లు ఆనవాయితీగా మంగళం పాటపాడి గంగమ్మ తల్లికి భక్తితో నమస్కారంచేసి నృత్యాన్ని పూర్తిచేస్తారు ప్రతిసారి మంగళం

పాటతోనే తమ నృత్యాన్ని ఆపుతారు. గేయంలో అనేకమంది దేవతల్ని వేడుకొంటారు చరణాలు అన్నీ పాడె సమయంలో, పల్లవిని ఎత్తుకొనే సమయంలో ఒకరకమైన లయలో పాడటం ఉంటుంది ఈ పల్లవిని ఎత్తుకొనే సమయానికి ముందుగా ఒక్కొక్క దేవత పేరు రావటం అపుడు రెండు చేతులెత్తి మొక్కటం, పల్లవిని ఎత్తుకోవటం, వురుము కుడిప్రక్కన వాయించటం వుంటుంది అపుడు పుట్టేగతులు

దబు దుబు దడ్డ
దబు దుబు దడ్డ
దబు దుబు దడ్డ
దబు దుబు దడ్డ
దబు దుబు దడ్

ఇలాంటి గతులు పల్లవి అయిపోతూనే ప్రతిసారి వాయిస్తారు.

జయ జమ మంగలం నిత్య శివమంగలం
జయజయ మంగళం నిత్య శుభమంగళం "జ"

బోలు బోలు మట్టెలు బోలు బోలు మట్టెలు
బొమ్మంచు సీరలు బొగ్గు వరమగర సీకారతి "జ"

సిలిచీరలు కడితివి సిలిరవికలు తొడిగితివి
నిలువెల్ల బంగారు సొమ్ములు నీవు పెట్టి
తనుకు తనుకున మెరిసేటి తనుకుపాపిటి బొట్టు
తగునమ్మ సుబారావుపేట గంగమ్మతూ "జ"

ఆరుగురు రాజులు ఆరుగురు రాణులు
అకసిన్న రాములమ్మ సీకారతి "జ"

తెల్లటి సీరలు తెల్లటి సీరలు
తెలవల్ల బంగారు సొమ్ము పెట్టి
తనుకు తనుకున మెరిసేటి తనుకుపాపిటి బొట్టు
తగునమ్మ పెదకోట్ల చౌడమ్మతూ "జ"

వజ్జిక్కొక్క జల్లోన వజ్రకాంతి లింగాలు
వక్కొక్క జల్లోన బద్రకాంతి లింగాలు
వక్కొక్క జల్లోన సూర్యకాంతి లింగాలు
జడజడా సూస్తేను నవకోటి లింగాలు
తగునమ్మ ముస్టూరి నలకాటి మయ్యకు ॥[illegible]॥

అర్జునుడు బీముడు నకులుడు ధర్మరాజు
సహదేవుడు సాయక పద్నాలుగేండ్లు
తవుసుండిన కొండ అటువంటి కొండలే
తగునమ్మ చిల్లారి నలకాటిమయ్యకు ॥[illegible]॥

దట్టిమీదొంకిటి దాకేల పిండాము
దస్తుకుడు దామలోరి పోతలయ్య
మైసూరి మందాన మిడిమాలదేవత
నసనకోట ముత్యాలమ్మ సీకారతి ॥[illegible]॥

భూమికి ద్దొడ్డది భూలోక శక్తి
బుక్కచార్ల నల్లాలమ్మ సీకారతి ॥[illegible]॥

వల్లబాట తీసుకొని కిన్నెర్ల మీటుకొంటూ
వగలకాడు కదిరి నరసిమ్మ సీకారతి ॥[illegible]॥

యేడుకొండలవాడు యెయ్యంక టేశుడు
దిగవతిరపతి ఏ లేటి గోవిందరాజులు
అలివేలిమంగపతి బీబీ నాంచారికి ॥[illegible]॥

ఊరాది ఊరునికి ఊరనారాయణసామికి
కట్టిన కలగొల్లు సిన్నది రామాపురము
సిత్రావికలగొట్ల తగునమ్మ పసిబాల నారన్నకు ॥[illegible]॥

మదులు మోపితి కొండ మల్లోన వెలకొన్న
మగుదుపల్లి బయన్న సీకారతి ॥[illegible]॥

తాతాలనాటి దైవమంట తాటిచెర్ల పెద్దయ్య
చంద్రగుత్తాలమ్మ మేటకోర్ల పెద్దమ్మ
భూమికి దొడ్డది భూలోకశక్తి సీకారతి ॥[illegible]॥

అక్కలకు తమ్ముడు గంగలకు తమ్ముడు
గనుడు పోతలయ్య సీరారతీ ॥జ॥

యిష్టు యీశ్వరునికి రాసినా బెమ్మకు
ముగ్గురై కై మూర్తులకు మూం విరాట్టువంటి
ఆదిశక్తి గంగ సీతారతీ ॥జ॥

ఉరుము వాయించే సమయంలో చుట్టూవున్న వారు గుడ్లప్పగించి చూస్తుండగా నరాలు జివ్వుమంటుండగా గుండెలదిరిపోతూ వుంటాయి కాబట్టి వాద్యానికి దగ్గరగా వుండరు కుంటెలు నృత్యంవేస్తున్న సమయంలో కుంకం, బండారు శ్రోతలపై పడుతుండగా కళ్లను పులుముకొంటూ ఆతురతతో వారి అడుగుల్ని చూస్తుంటారు పూనకం వచ్చిన వెంటనే కేకలు, అరుపులు, శ్రోతలు చేస్తారు గుంపులో ఒకరివెనుక ఒకరు త్రోసుకొంటూ ఆశ్చర్యంతో తలపైకెత్తి నిక్కినిక్కి నృత్యాన్ని చూస్తుంటారు నిజంగా దేవత పూనకం వచ్చిందన్నంత భ్రమ పుడుతుంది గేయాలు పాడుతున్నపుడు వురుము కొడుతున్నపుడు మనసులో పాటపాడటం, 'డబుడుబు' అంటూ మోకాలిపై తొడలపై చూపిడ్రవేలితో వాటికనుగుణంగా వేస్తుంటారు మంగళంపాటలో ఒక్కొక్క దేవత పేరు చెపుతువే రెండు చేతులెత్తి మ్రొక్కుతుంటారు అయిపోగానే బండారు నుదుట పెట్టుకొని దండం పెట్టుకొని ఇండ్లకు వెళతారు.

## కళాకారులు

| | | | |
|---|---|---|---|
| ఉరమల నారాయణ | - 46 | సం॥లు | కూలి |
| ఉరమల నారాయణస్వామి | - 32 | ,, | కూలి |
| ఉరమల నాగన్న | - 28 | ,, | కూలి |
| ఉరమల చంద్రప్ప | - 45 | ,, | కూలి |
| ఉరమల అంజనేయులు | - 35 | ,, | కూలి |

కళను ప్రచారం చేయటం, దేవతల దగ్గర కొలువు చేయటం

ధర్మవరం - సుబ్బరావుపేట - ముస్తూరు - గూగూడు - మేడాపురం - రేగాటిపల్లి

చిరునామా

**జానపద యువకళాకారుల సంఘం**

రిజిస్టర్డ్ 245/88

సుబ్బారావుపేట పోస్ట్, ధర్మవరం మ ండలం,

అనంతపురం జిల్లా



## 3. కీలుగుఱ్ఱం

జానపద కథల్లో కీలుగుఱ్ఱం' ముఖ్యం రాజకుమారుడు ఏడేడు సముద్రాలు దాటటానికి కీలుగుఱ్ఱాన్ని వాడుకొంటాడు జానపద వినోదాల్లో కీలుగుఱ్ఱం ఇప్పటికీ ఉంది దీన్ని తయారు చేసుకొని జానపదులు నృత్యం చేస్తారు వెదురు బద్దలు, కాయితాలు రుబ్బి దాంట్లో మెంతులు కలిపి 'తలను' తయారుచేస్తారు. గుఱ్ఱం లాగా చేసి కాళ్లకు కొయ్యలు కడతారు రంగురంగుల గుడ్డలు గుఱ్ఱంపై వేస్తారు గుఱ్ఱాన్ని తోలేవారు కిరీటాలు, భుజకీర్తులు, హారాలు, కడియాలు అన్నీ రంగు కాయితాలతో తయారుచేసుకొంటారు ముఖానికి రంగు పూసుకొంటారు. స్త్రీ పురుషులు అవసరం ఒకరు రాజులాగా (పురుషుడు) ఇంకొకరు రాణి (స్త్రీ) లాగా అలంకరణ చేసుకొని తప్పెటకు అనుగుణంగా గుఱ్ఱాలను వారిమధ్య భాగంలో వుంటూ త్రిప్పుతూ నిలబడి తోలుతున్నట్లుగా అభినయిస్తూ నృత్యం చేస్తారు తప్పెటలో ఇలాంటి గతుల్ని వాయిస్తారు.

జెగ్నకన్
జెగ్నకన్
జెగ్నకన్
జెగ్నకన్
జెగ్ జెగ్ జెగ్నకన్
జెగ్ జెగ్ జెగ్నకన్
జెగ్
నకన్
జెగ్నకన్
జెగ్
జెగ్ జెగ్
జెగ్ నకన్
జెగ్ జెగ్
జెగ్ నకన్
జెగ్ నకన్
జెగ్ నకన్
జెగ్నకన్

ఇలాంటి సమయంలో స్త్రీ పురుషులు దగ్గరి దగ్గరిగా అడుగులు వేస్తూ రెండు గుఱ్ఱాలు అనుకొన్నట్లుగా, ప్రేమించుకొన్నట్లుగా ఇద్దరు చేతులు పట్టుకొని ఆడటం, ఇంకోచేతిని గాలిలో వూపటం ఉంటుంది చూడముచ్చటగా సాగే ఈ నృత్యం పిల్లల్ని బాగా ఆకట్టుకొంటుంది

కీలుగుఱ్ఱంగాక అసలు గుఱ్ఱాలపై పురుషులు కూర్చొని గుఱ్ఱం కాళ్లకు గజ్జెలు కట్టికళ్లెం చేతపట్టుకొని అడుగులు వేయిస్తారు ఇదిపెళ్లి వూరేగింపుల్లో ఈ వాస్తవ గుఱ్ఱాల నృత్యం తప్పెట గతుల కనుగుణంగాను సన్నాయిమేళాల కనుగుణంగా ఉంటుంది

## 4. కోలాటం

కోలలతో ఆడటాన్ని 'కోలన్న' అంటారు. కోలాటాన్ని అన్ని తెగలవారు కలసి మెలసి ఆడతారు.

కోలాటగత్తు ఒక్కొక్క వృద్ధి (జత)గా విడిపోయి వలయాకారంగా తిరుగుతూ కోలాటమేస్తారు వీరికి గురువుంటాడు ఇతన్ని 'అయ్యవారు' అని పిలుస్తారు[14] కోలన్నేయలేదా కోలన్నేస్తామా అనే వ్యవహారం ఉంది కోలతో ఆడే కోలాటాన్ని పురుషులు మాత్రమే వేస్తారు స్త్రీలు కూర్చొని చేతులతో కోలటమేస్తారు కోలాటాన్ని నేర్పించటం నేర్చుకోవటం ఒకేసారి జరుగుతుంది అంటే గురుశిష్యులతో పాటు ప్రయోగాత్మకంగా తాను కూడా విద్యను ఒక్కొక్క సారి ప్రదర్శిస్తాడు మొదట ఉత్సాహమున్న వ్యక్తుల్ని ఒకచోట చేర్చి 'సెలకట్టి'[15] వేయటం నేర్పుతాడు కోలాటం ప్రారంభంలో గురువు మధ్యలో తాళాలు 'తా-తకిట' గతిలో కొడుతుండగా వృద్ధులు అతని చుట్టూ నిలబడి వుంటాయి అపుడు లోవృద్ధి వెలుద్ధి కాళ్ళ కట్టెలపై 'టక టక టుక్' మంటూ కొడుతుంటారు వెలుపల భాగంలో కోలన్నే సేవాణ్ణి ఎుద్దికాడు (ప్రదక్షిణ మార్గం) లోపలి భాగంలో కోలన్నే సేవాణ్ణి లోవుద్దికాడు (అప్రదక్షిణ మార్గం) అని పిలుస్తారు వీరంతా తాళంచేత పట్టుకొని వుండే గురువు కాళ్ళకు మొక్కి లోవుద్ది కాళ్ళందరు వెలుద్ధి కాళ్ళ కట్టెలపై 'తాల్చుతూ' వుంటారు[16] దీనిలోని రకాలను కోపులంటారు ఈ మండలో వేసే కోపులు ఇలా వున్నాయి

1 తాలుపుకట్టి
2 నెలకట్టి
3 నిండునిత్తారి
4 పరమానంద చిటుకులు
5. యెలుద్ది సిత్తారి (బిత్తిరి సిత్తారి)
6 శివకోపు
7. బాలనారికోపు
8. ముంగారికోపు
9 తూగుడుకోపు
10 రెడ్డివారికోపు

వాద్యాలు ముఖ్యంగా కంచుతోను, ఇనుముతో చేసిన తాళాలు వాడుతారు గురువు పీటిని కొట్టుతూ వుంటాడు ముఖ్యంగా (తా-తకిట -తకతక -తాతకిటత -తకిట తకిట) అనే గతుల్లో వాయిస్తారు

కోలాటగాళ్లు మురెడు పొడవు గల్గినకర్రల్ని సన్నగా చివురు కొని తయారుచేసుకొంటారు రెండుచేతుల్లో వాటిని పట్టుకొంటారు కాళ్ళకు గజ్జెలు కట్టుకొంటారు నిక్కరు, బనీను ధరిస్తారు తలకు పేటా చుట్టుకొంటారు కొప్పుండే పురుషులు పూలను ముడుచుకొంటారు గిరజాలజుట్టు వుండేవారు కోలాటమేస్తున్నపుడు చూడముచ్చటగా కనిపిస్తారు ఒకప్పుడు పురుషులు గిరజాలు పెంచేవారు. ఇటీవల తలకురిబ్బను కట్టుకొని గోసిపంచెకట్టి గజ్జెలుకట్టి నడుముకు యర్రటి శాలువ గట్టిగా కడతారు

కోలాటగాళ్లు తాళానికనుగుణంగా, కర్రలనాదం చేస్తారు వాటికనుగుణంగా అడుగులు వేస్తారు అడుగలు మామూలుగా కాని మునివ్రేళ్లను నేలపై కొట్టటంతో గజ్జెలు నినదిస్తాయి తర్వాత ఒక్కొక్క కాలినిజానెడు పొడవు పైకెత్తటం వుంటుంది అవి ఒక్కొక్క కోపుతో ఒక్కొక్కరకంగా అడుగులుంటాయి ఆయా కోపుల్లో అడుగుల్ని వివరించటం జరుగుతుంది. మొదటిగా గురువు తాళం బిరబిర మ్రోగిస్తారు. అందరూ గమికూడటానికి కోలాటగాళ్లు రావటానికి తాళం కొడతాడు అపుడు ధ్వనులిలా వుంటాయి.

"త - త - కిట
త - త - కిట
త - కిట
త - కిట
కిట కిట
కిట కిట"

ప్రతికోపును ఎత్తుకోనే సమయంలో తాళాలు 'తా-తా-కిట' అనేగతిలో కొడుతూ నిదానంగా ఇల పాడతాడు.

1. "తయ్యకు తద్దిమిత దిరద
తయ్యకు తద్దిమిత -
2. తయ్య దిరదతయ్య
తయ్యకు తద్దిమిత

8 రాజ రాజ రాజపానన్నాత
సామి పానన్నాత -

ప్రతికోపును తగ్గొట్టే సమయంలో అంటే నిలిపివేసే సమయంలో విరవిరా 'తయ్యకు తద్దిమిత' అని అంటాడు అలాంటి సమయంలోలో వృద్ధి వెలుద్ది నాలుగు కట్టెల్ని ఒకేసారి కొడతారు [17] 'ట్లక్' మనే శబ్దం పుడుతుంది

## 1. తాలుపు కట్టి

త - త - కిట

త - త - కిట అనే వరుసలో తాల్చుతూ (తాళాలు కొడుతుండగా, కట్టెలు కొడుతూ) వేసే కోపు తాలుపుకట్టి అంటారు. ఇది ప్రార్థనతో మొదలవుతుంది తమ తమ కట్టెలతో చిటికె వేసుకొని ఎదురు బదురుగా చిటికె అందించటం వుంటుంది ప్రతి చిటిక్కూ నేలపై కాలిని మునివ్రేళ్ల సహాయంతో కొట్టటం వుంటుంది లోవృద్ధి వెనక్కి ముందుకి, ముందుకీ వెనక్కి ఒకోక్కక్కసారి చిటికె వేసుకొని, చిటికె అందించి గుండ్రా కారంగా తిరుగుతాడు ఇలాగే వలుద్దికాడు కోపులో కట్టెల గతులిలా ఉంటాయి.

"టక్ - టక్ - టుక్
టక్ - టక్ - టుక్
టక్ - టక్ - టుక్

తాళం అంచుల్ని రెండుసార్లు తాకించినపుడు 'టక్ టక్' మనే శబ్దం శబ్దాల కలుస్తాయి తాళాలు రెండు మూలగా కొట్టినపుడు 'టుక్' మనే శబ్దాలు కట్టెతో వస్తాయి అపుడు వెలద్దిలోవృద్ధి కట్టెల నాదం చేస్తారు ఈ కోపును గణేశ్వర ప్రార్థనతో మొదలుపెడతారు అలాంటి పాట

1. శివశివ మూరితివి గననాత[18]
నువు శివుని కుమారుడవయ్య గననాత
యిద్ది నీదె బుద్ధినీదె గననాత "శివ"

సదువునీదె సామునీదె గననాత

బాపనివారు నిన్ను గొలవ గననాత
బెమ్మదేవుడందురయ్యా గననాత "శివ"

కోమటి వారు నిన్ను గొల్వగననాత
కోటిలాభమందురయ్యా గననాత "శివ"

కాపు వారు నిన్ను గొలవ గననాత
కాడిమేడి వందురుసామి గననాత "శివ"

వడ్డివాడు మిమ్ము గొలవ గననాత
బలె దొడ్డదేవుడందురు సామి గననాత "శివ"

యేనిగి పుట్టే యేనిగ రూపు గననాత
నక్కవాలసిమ్మము సామి గననాత "శివ"

2 ఇంకో ప్రార్థనా గేయం

శరను శ్రీ వయకుంటనాయక శరను శ్రీ పురుసోత్తమ
రంగశరను శ్రీ పురుసోత్తమ శరను శ్రీ వరగరుడవాహన
సామి శరని యంకట నాయక అయ్యవారోగన నాయక
శరను శరనారే శరను శరనారే "శరను"

ఏదు ఏదుము నిన్ను కొలుతుము యంకటాసిరివల్లభా
తిరుపతి యంకటాసిరి వల్లభా శరను శరనారే "శరను"

ఆదిఏదము నిన్నుకొలిసితే అకల శ్రీగననాయక
అయ్యవారోగన నాయక శరను శరనారే "శరను"

మంచి మల్లెలు మొగిలిరేకులు తెల్లగన్నెరి నర్మలు
అన్ని తెత్తురు మిమ్ముగొలుతరు
అకలశ్రీగననాయక అయ్యవారోగన నాయక
శరను శరనారే శరనుశరనారే "శరను"

తాలుపు కట్టిలో గతిభేదమున్న గేయాలున్నాయి గేయంలో పూతపద ముంది. గతి మార్పును ఇవి సూచిస్తాయి ఈ పదాలవల్ల నృత్యంలో ఒక పూపు కూడా వస్తుంది నృత్య కళలో అందమంత ఈ తూత పదంలో వుంటుంది.

"యెన్నిలాయిలో" అనే ఊతపదంవల్లా ఈ గేయానికొక తూగు వస్తోంది చూడండి. తాళం, కట్టెల గతులు ముందు గేయం మాదిరిగానే వుంటాయి

తల్లి యినవే మాదమమ్మ యెన్నిలాయిలో
తల్లి పుక్కిలివారి వమళమమ్మ ,,
వారే వుద్దురు బాలలమ్మ ,,
పెద్దవాడురా పెద్దమల్లుడు ,,
సిన్నవాడురా సిన్నమల్లుడు ,,
పెద్దవాని పేరు సెపితే ,,
కొంగలే కో లన్నలేసు ,,
చిన్నవాని పేరు సెపితే ,,
చింకలే దీటీసు పట్టు ,,
యర్రమాల పందులాకు ,,
పందియాట పాతమమ్మ ,,
వద్దు వద్దుర పెద్దమల్లుడు ,,
మీ మేనమామ కొండ్లవోవయ్యా ,,
తాతల తండ్రులు సంపినాడు ,,
వద్దన్న పాతమమ్మ ,,
పొమ్మన్నా పాతమమ్మ ,,
వచ్చేటి మేనమామను ,,
ఎదురెక్కి పోతారు ,,
గుర్రమింద మేనమామను ,,
గుద్ది గుద్ది సంపుతారు ,,
కిందికేసి సంపుతారు ,,

తాలుపుకట్టెలో పాడే పాటలు అనేకం వున్నాయి రాగాలాపవతో కూడు కొన్నవి ఈ పాట జానపదుల శృంగారానికి నిదర్శనం. ఒక చిన్నది. ఆమె నెల్లూర బోగముసాని, సక్కగా వుంది ఆమె దాచుకొనే వారుంటే దాగివస్తుం దట జానపదుని వ్యాహారమణీయతకు నిదర్శనం ఈ పాట తాళం గతులిలా వుంటాయి,

త - త - కిట

త - త - కిట

తతకిట తతకిట

తతకిట తతకిట

కోలాట కర్రల గతులిలా వుంటాయి

'టక టక టక్

టక టక టక్'

"నేను సిన్న దాన్నిరా నెల్లూరి బోగం సాన్నిరా
అతియసక్కని దాన్నిరా పాగొండ పాలెందాన్నిరా "నే"

అంతనయితి యింతనయితి సంతలో గెజనిమ్మనయితి
దామకుండెవారు వుంటే దట్టికొమ్మనదాగివత్తు "నే"

కట్లు గొట్టేది కలియకొండ కట్లు అమ్మేదురవకొండ
రానపోను బగదికొండ రచ్చలేపే ముందబంద "నే"

కొండమేరనకుండబెట్టి కుమ్మరదాన్ని వంగబెట్టి

పై పాటలో 'నేనుసిన్నదాన్నిరా' అనే పదాన్ని నిదానంగా (నేన/సిన్నా దాన్ని 'రా' నెల్లూరి/బోగము/సాన్ని 'రా'/అతియసక్కని/దాన్నిరా / పాగొండ/ పాలెం/దాన్ని 'రా'/) పాడుతూ'రా' అనే అక్షరాన్ని ఊనికతో సాగతీస్తారు ఇట్టే నెల్లూరి బోగంసాన్నిరా అతియ సక్కని దాన్నిరా - పాగొండ పాలెం దాన్నిరా- 'రా' అనే అక్షరాన్ని కోలాటగాళ్ళు వంత పాడే సమయంలో శరీరమంతా వూపుతూ కాలివేళ్లను నేలపై కొడతారు ప్రతి గేయంలోనూ పాదాలు కోలాటగాళ్ల వంత పాడతారు. వంతపాడే సమయంలో గురువు తాళాలు గట్టిగా కొడుతూ కొద్దిగా మార్పుచేస్తాడు. అపుడుగతులిలా వుంటాయి.

తతకిట

తతకిట

తకిట

తకిట

మరో పాటలో 'పల్లవిలో పాటకి ప్రాణం ఎలా దాగివుందో స్పష్టం అవుతుంది. ఈ పల్లవితో కోపుకొక పూపు కోలాటగాళ్ళకు అలసట గురువుకు విరామం దొరుకుతుంది కోలాటగాళ్ళు పల్లవిని నిదానంగా పాడుతారు అపుడు గురువు తాళాలు 'తతకిట - తతకిట' అనే వరుసలో కొడతాడు కోలాటగాళ్ళు పల్లవినిపాడే సమయంలో సంతోషంతో కట్టెల్ని గట్టిగా చిటికెలు వేసుకొంటూ పాడుతారు అపుడు చిటికెలు

టక టక టుక్
టక టక టుక్
టక టక టుక్

"వురుకో పూరకొండర కొడక వుసురు దానికి యెదగ యాముంఢ తగిలిచ్చె కొడకా" అనేది పల్లవి 'వురుకో' అని అందరు పాడి కొంత విరామమిచ్చి 'పూరకొండర కొడకా' అనే రాగలాపన చేసి 'వుసురుదానికి యెదగ' విరామమిచ్చి 'యాముంఢతగిలిచ్చె కొడకా' అని రాగలాపన చేస్తారు 'వురుకో' అనే మాట కోలాట గాళ్లందరు ఒక్కసారిగా గట్టిగా అనటంతో కోపుకు అందం వస్తుంది.

రోగాన్ని అంటించుకొని వచ్చిన కుమారుణ్ణి ఓదారుస్తూ రోగాన్ని తగిలిచ్చిన స్త్రీని 'ముండ' అని అంటూ కొడుకును ఒకతల్లి ఓదార్చుతోంది పాపం. జానపదులకు ఇది సాధారణమైన అనుభవం' కాని ఇది చాల అసక్తితో ఈ పాటలోని అందాన్ని ఆస్వాదిస్తారు

పాగొండ[19] మెరియాలు పాగొండ మెరియాలు
పాతచింతపండు యన్నాల్లుప్పై పత్తమమ్మ "వురుకో[20]"

సరిసారి మొగవాళ్ల సరిసారి మొగవాళ్ల
కోలన్న లేత్తాంటే పోయికాడ మంచమొంచమ్మా "వురుకో"

మంచము బెత్తైవో మంచాము బైత్తైవో
గంతాలు వుతికైవో నే లోతగుంతలోకమ్మా "పూరుకో"

యాపమానింటిది యాపమానింటిది
యెనిరింటి పడపాలిది సత్తెప్ప కూతూరు
వున్నిసీరా కట్టుకొని వున్నిసీరా కట్టుకోని
వగలొంగలుపడక్తొంటె వగనాడు పోయ్యింటి నమ్మ "పూరుకో"

## 2 సెలకట్టి

జానపదుల అన్నిరకాల పాటల్లోనూ రామాయణం చోటుచేసుకొంది ఈ కోలాట పాటలోని రామాయణం చూడండి ఈ పాటలో ప్రతిచరణాన్ని గురువు పాడే సమయంలో సగం పాడిన వెంటనే తాళాన్ని బిరబిరా కొడతాడు - అపుడు 'తకిట తకిట తకిట తకిట' అనే గతులుంటాయి ఇదే కోపులో 'సెలకట్టి' కోపును తెగ్గొడతాడు అపుడు నృత్యగతిలో మార్పు వస్తుంది తాలుపు కట్టి పాటను సగంపాడిన వెంటనె 'ఓసెలగట్టి' అని అ టూనే అందరూ బిరబిరా కట్టెనాదం చేస్తారు అపుడు టక-టక టక్ అనే వరుసలో వుంటాయి సెలకట్టిలో పాట పాడిన తర్వాత గురువు 'తయ్యకు తద్దిమిత' అని అంటూనే అందరూ 'ట్లుక్' అనే శబ్దం వచ్చేలాగా కుప్పటికట్టిని వెంటనే గురువు తాలువుట్టి పాటలోని పల్లవిని ఎత్తుకొంటాడు అపుడు మరలా 'టక టక టక్' అనే కట్టెల శబ్దాలు 'త-కా -తకిట' తాళం గతులుంటాయి

బూపుత్రి యెటుబోయెరా లచ్చనా
వోం మీ వదన యేమాయెరా "భూ"

యెన్నెలకుదీపైన యెన్నెలకు దీపైన
యెలది బంగరి జాన "భూ"

సీకటికుదీపైన సీకటికుదీపైన
సిడియ కుచ్చుల సీత "భూ"

గురువు 'వో సెలకట్టి' అంటూ తాళాన్ని

'త -కిట
త -కిట
త -కిట
త -కిట

అనే వరుసలో కొడుతాడు కోలాటగాళ్ళు తమ తమ కట్టెలపై ఒక్కో చిటుకు వేసుకొంటూ ఎదురు బదురుగా కుడి ఎడమ చేతుల్లోని కట్టెలతో చిటికెలు వేస్తారు అంటే మొదటిగ తమ తమ కట్టెలపై 'టక' మనేది ఎదురుగా కుడిచేతి కట్టెలుతోవుద్ధి వెలుద్ధి 'టక మనే' శబ్దం తర్వాత ఎవరెవరి కట్టెలపై 'టక' మనే

శబ్దం తర్వాత ఏడమచేతి కట్టె తో లోవుద్ధి వెలద్ధి 'టక' మన శబ్దంచేస్తారు ఇలా ఒక్కొకసారి వెనక్కి ముందుకి బిరబిరా ఆది శరీరమంత వూపుతూ, ఒక్కొక్క కాలిని నేలమీద నుంచి వీలున్నంత పై కెత్తుతూ ఎగురుతూ గుండ్రాకారంగా తిరుగతూ వుంటారు అపుడు కట్టెల శబ్దాలు ఇలా వుంటాయి.

'టక్ టక్
టక్ టక్
టక్ టక్'

అలాంటి సమయంలో గురువు కొన్ని మాటలు గతి ప్రధానంగా అంటారు.

దింతక్ తగతగ
రాటికి రేకులు
నీటికి పొడుసు
నిద్ర రాకునీవే మదిగేవు
సీరారావిక సినిగిన మాత
పై నొక చెంకము
పల్లిరి పూలు
అచ్చు బెల్లము
పచ్చికావిటినీ
పండక్కు పది దినములు
యిమ్మంటివి గాని
అంతకునీ సొమ్మెక్కవద్దు
దిందతగ దింద
దిగి దిగి దింద
జిగి జిగి దింద
జిగి జిగి దింద
తగుదింత
తగుదింతక్
దింతక్
తగుదింత

రామరామని మేలుపురాముని
రాముని చేతికి సై చెల్లాము
వారిచేతికి వారి కంకనము
అంటే వివరించినగాని అంగతుదూవు గజాపు రాముని
బుజాన చేసెద నిజమంతప్పక
రేకుల సన్నము రగుపతిరాగవ
రాజుదగ్గరి రాజు పరాక
దింతక్ తగతగ దిరద
తయ్యకు తద్దిమిత"

అని తర్వాత తాలుపు కట్టిలోని వల్లవిని ఎత్తుకొంటాడు

భూపుత్రి మెటుపాయెర లచ్చనా
వోరి మీ వదిన ఏమాయెరా "భూ"

పన్నశాలిలోన పనతిని మనమిడిసి
పరులపాలాయరా తమ్ముడలచ్చన "భూ"

వెంటనే 'వోసెంగట్టి' అని తాళం మార్పు చేస్తాడు. అపుడు 'తకతక' వరుసలో తాళాలు టక టక మనే కట్టెలనాదాలు వుంటాయి ఇది మండోదరితల

రావన తిమ్మనా రావనా వివేకునా
రాతిరొక్క కలను గంటినో రావనా
వద్దు వద్దు రావనా బుద్ధిగాలి రావనా
బుద్దులుంటే భూములేలెమూ రావనా "రావనా"
సీత మనకు తోడబుట్టు శ్రీరాములు బావమరది
వారి సీత వారికిచ్చి వారికీ దండాముపెట్టి
మాతలంక యేలు కొందమో రావనా "రా"

మూరాడు మూతివాడు బారాడు తోకవాడు
బారితీర మానలంకకూ రావనా "రా"

యెండితిరమాని వాడు యెయ్యిబార్ల తోకవాడు
యెగిసి వచ్చె మానలంకకొ రావనా "రా"

కాలిలోటి కంచిమెట్టి కంచుమించు లాయిపాయె
కాని పాని కలనుగంటినో రావనా "రా"

అత్రికోని నల్లపూస ఆది తెగినాంటాడె
అన్నికారి కాలమంటె వో రావనా "రా"

సేతులోటి నల్లగాజు సెదరి రొండొప్పలాయె
సేటు మారి కలను గంటినో రావనా "రా"

తర్వాత వెంటనే 'తయ్యకు తద్దిమిత' అంటూ తాలుపుట్టెకొని పల్లవిని ఎత్తుకొంటాడు

భూపుత్రి యెటుపాయెరా లచ్చనా
వోరి మీ వదిన యేమాయెరా "భూ"

చిత్రకూటడివిలో సీతాను మసమిడిసి
చింతలై తోచెర తముడ లచ్చనా "భూ"

మాయా మృగమేలా వచ్చేనూ
మాయమై పాయెనాలచ్చనా "భూ"

పల్లవిని కోలాటగాళు పాడి వెంటనే 'తయ్యకు తద్దిమిత' అని అంటాడు. అందరు 'కుప్పటికట్టి' ఎవరి స్థానాల్లో వారు నిలబడుతారు కొద్దిసేపు విరామమిచ్చి తాళం 'త-త-కిట' అనే గతిలో కొడతాడు కోలాటగాళ్లంతా కట్టెల్ని "టకటక -టక్" మంటూ తాల్చుతూ వుంటారు తర్వాత వేసే కోపు పేరుసెప్పి మొదలు పెడతాడు

## 3. విందు సత్తారి

ఎత్తుగడ : దిరదతయ్యకు తద్దిమితా
తయ్యకు తద్దిమితా
తందనాన తందని
తనంద నాయుడు
తందనాన తందానితాన"

తాళంగతులు — త - కిట
త - కిట
త - కిట

కర్రల చిటుకులు — టక్ - టక్
టక్ - టక్
టక్ - టక్

ఈ కోపులో వెలుద్దికిలో పుద్దికి సమానావకాశం ఉంటుంది అంటే వెలుద్ది లోపుద్ది బయటికి తిరిగే అవకాశముంది 'తాళం' వంత బిరబిరా కరందు చిటుకులు అంత బిరబిరా వేసుకొంటూ వ గ్గురికి మాత్రం పై వరసల్లో చిటుకలు అందిస్తూ లోపలికి వెళ్ళినపుడు బయటికి వచ్చినపుడు లోపుద్ది వెలుద్ది ఒక్కొక్కరిని దాటవేస్తూ చిటుకులు వేసుకొంటూ గుండ్రాకారంగా తిరుగుతారు శరీరాన్ని అలా ఇలా త్రిప్పుతారు కాళ్ళకు ఒకదానికొకటి జరపటం ఉంటుంది. ముగ్గురికి ఎదురెదురుగా చిటికెలు అందుకొనే సమయంలో శరీరాన్ని ఊపుతారు. లయాత్మకంగా లోపలికి బయటికి తిరుగుతారు గేయంలో కోలాటగత్తె పల్లవి'ని మాత్రమే పాడుతుండగా గురువు గేయమంతా పాడతారు.

## చిన్నోడ నెలచిన్నోడ తై తందాన తానందానాన

చినపల్లి పెదపల్లి నరమనాగలాపురము
పక్కనా పాముదొర్తి పైన బీములకుంట
సొకసదనై పల్లి సొగసైన కొత్తకోట "చిన్నోడ"

సొగసైన కొత్తకోటకదురు కలవుండేది
కలికి దుర్గంరా పొల్లూరి గొల్లపల్లి పాత ఒర్లోపల్లి
ముచ్చటికి మూడిండ్లు ముస్టోళ్లమందర "చిన్నోడ"

ముచ్చటికి మూడిండ్లు ముస్టోళ్ల మందర
అదిగో సొసవకుంట చిలకముక్కలపల్లి
యగవ రెడ్డోరిపల్లి ఇట్లబయలుండేది బాయోల్లపల్లిరా "చిన్నోడ"

బట్టబయలుందేది బా యొల్లపల్లిరా యుపకిసకదిన్నెలు
యినకడన్నెలపల్లి తాటిమేకలపల్లి తావునాదేరా "చిన్నోడ"

తాటిమేకలపల్లి తావునాదేరా ఒడుగు బాపనపల్లి
తెగిన రామనేపల్లి తుంట్లముండ్లూందేది కంచిగాని పల్లిరా "చిన్నోడ"

తుంట్లు ముండ్లుందేది కంచి కనగానిపల్లిరా అదిగో బోరంపల్లి
అద్దోం ముదిగల్లు పేరైన మలిపల్లి పేటనాదేరా "చిన్నోడ"

పేరైన మలిమల్లి పేటనాదేరా పులతంరెడ్డిపల్లి
నడమ కారుపల్లి పొగరగిలినట్టుంది పాతమద్దినేపల్లి "చిన్నోడ"

మల్లిపూసినట్లుంది మన కొండాపురము
కంచి కొండాపురము అది నాగసంద్రాం కల్యాన దుర్గాము "చిన్నోడ"

అందాలరాకట్ల అంచనే కౌకుంట్ల
పేరైన పురవకొండ పేట నాదేరా "చిన్నోడ"

పేరైన పురవకొండ పేట నాదేరా తలుపూరు
కూదేరు అనిరెండు పాళాలు
ననపరంగంపేట బలిసందుకొంపరా "చిన్నోడ"

గొరిదిండ్ల ముట్టాల గొరిసి బోయలకొంప
దొంగలకు మునియిల్లు ఆ తోపుదొర్తిరా "చిన్నోడ"

పండేది పైపల్లి పడక బత్తలపల్లి
తావునిడిమామిడి తలముసెట్టిపల్లి
సెలికత్తులుండేవ సెంద్రాసు పల్లిరా
కాపురముందేది కమ్మోరి పల్లిరా "చిన్నోడ"

వంటి కొండామాది వోవలంపల్లి
సీనమొగలాయి పల్లి పెదమొగలాయిపల్లి
అందనంగ వుండేది అద్దొమేడాపురము "చిన్నోడ"

మల్లిపూలమ్మేది మాది ధర్మారము
కాయిలు పిందెలు కడవంతగుమ్మడి

పగవారి యుద్ధకు తీగట్లపాయర
యుర్లైన చప్పులు కొంగ్రైస రుమాల
కోరవప్పులకల్ల వడ్డింతో వగనాడు
వలపొందురాదా "ఓనోష్ఠద"

## 4 పరమానంద చిటుకులు

ఎత్తుగడ : తయ్యకు తద్దిమితా దిరద
తయ్యకు తద్దిమిత
తందనాన తందని
తనందనాయుడు
తందనాన తందని తాన

తాళం గతులు తకిట
త-కిట
త-కిట
త-కిట
త-కిట
త-కిట
తకిట

కట్టెల చిటుకులు . టక్-టక్
టక్-టక్
టక్-టక్
టక్-టక్
టక్-టక్
టక్-టక్
ట్లుక్-టక్-టక్
ట్లుక్-టక్-టక్
ట్లుక్-టక్-టక్
ట్లుక్

కోపుకో చిటుకులు చాలా ప్రాధాన్యం వెలుద్ది ఉపలి భాగంలో లోపుద్ది లోపలి భాగంలోనే ముగ్గుకి ఒక్కసారి చిటుకులు అందుకొన్న వెంటనే లోపుద్దలు తిరిగి లోపలి భాగంలోనే వంగుతారు. అపుడు ముందుగ అందుకొన్నవారికే చిటుకులు అందుకొని, వంగిన లోపుద్దులు లేసి తిరిగి వెలుద్దికి కాపికి కుప్పటికట్టి చిటుకులు అందుకొంటారు. ఇలా ప్రతిసారి కుప్పటి ట్టి కొట్టిన వెంటనే ఒక్కొ పుద్దిని దాటవేసి అనేక చిటుకులు అనేక భంగిమలు చూపిస్తారు. వెలుద్దికాళ్ళు చాలా జాగ్రత్తగా అడుగులు వేస్తు బిరబిరా కుప్పటికట్టికి ఎగిరి దూకుతూ చిటికెలు వేస్తారు. ముదుసారు లోపుద్ది వెలుద్ది కుప్పటికట్టి కొట్టే సమయంలో గజ్జెల నాదం గింగిరుమ టూ వుంటుంది. కోలటగాళ్ళ ఎంత గింతులు చూడముచ్చటగా వుంది. మధ్యలో ఎవరైన ఎవరైన చిటుకులు తప్పిపోతే కుప్పటికట్టి కొచ్చి కలుసుకోవటం తటస్థపడుతూంటుంది. ఎత్తుగడను గురువు పాడిన తర్వాత పాడి గేయంలో పల్లవిని మాత్రమే కోలాటగాళ్ళు పాడతారు. మిగిలే గేయమంతా గురువే పాడతారు.

రామరామ రామా రాగవ రామరామ రామా భైరి ॥రామ॥

గద్దవాలు సింతోమినాయుడు
గండుపిల్లి నారప్పనాయుడు
యీటికి మనూన్నటిరవై ఆమడు
పిన్నేటి గద్దన ॥రామ॥

అరనరమైన నిద్దర పొద్దున
మరనమైన కలకన్నాదమ్మా
జలజారి బండలెక్కినె
జలకమాడె బయ్యప్పనాయుడు ॥రామ॥

బీనపూవల సెడ్డీపల్లదము
బిగువుగానవే తొడగినాడురా
కాసిమిందనే కాసిపోసెనే
రేంమంతనే మూడివేసెనే ॥రామ॥

రేనిమంతనే మూడిమిందనే
అనుమంతుని ముడివేసె

అనుమంతుని ఎండి మీదనే
తమలపాకునే ముగిపేసెరా ||రామ||

వండిరేకుల రుమాల
సుంగులు విడిపి కట్టినాడురా
పుల్లిపూవల పట్వారమూ
పల్లి బట్టలుతీసినాడ రా ||రామ||

కుడిచేత కుచ్చిళ్ళటగనే
యడమచేతి నేగంద్రగొంగి నేపట్టనే
యీపన యిల్లంటాకు నంటిగ
పట్టి కుచ్చిన బల్లెం పట్టెరే ||రామ||

యిలువాకిలి యల్లక తలికె
యిల్లనాలి గల్లతుమ్మినే
తలావాకిలి యల్లక తలికె
తల్లితండ్రి తుమ్మినారురా ||రామా||

బయిలెల్లేయప్ప నాయుడు
బాపన ముండాలడ్డమాయిరే
పూరువాకిలి యల్లక తలికె
పూరిపిల్లిలే లడ్డమాయెరా ||రామ||

ధనోన్నండిన సెనిలోన
దుప్పులు రెండడ్డమాయెర
కనికి రాళ్ల మొరుముకాడ
కాకులు రెండు కోలువై పలికారా ||రామ||

గొప్పరాళ్ల గుట్టమీద
గొక్కలురెండు అడ్డమాయెర
నల్లమల నేంంగ తిరిగెర
నాయమైన మొగాడు దొరకలా ||రామ||

బాడగంటునేసాటు చేసెరా
బొల్లుకొండకు మోటు పెట్టిరా

ఆరవై ఆరు సలుగుఁతోను
ముప్పైమూడు గన్నలతోను ||రామ||

పెద్దేనిగాల మరసి
నిద్దర పోతుందన్నా
చాటలనంతినే చవలపందిరా
మూరదంతనే తోక పందిరా ||రామ||

కొడవఁడ్లట్ల కోతపందిరా
రోకఁడ్లట్ల రోమఁపందిరా
పంది తట్టు బయప్ప చూసెనూ
చిన్న చిన్న రాల్లుయేసెరా ||రామ||

చిన్న చిన్న జగడము చేసెరా
పెద్ద పెద్ద రాల్లుయేసెరా
పెద్ద పెద్ద జగడము చేసెరా
చౌకుచౌకు నసప్పరించెర
సప్తలోకము తల్లిటించెర ||రామ||

గూబ గూబన సప్పుటించెర
గుబ్బలోకమే సప్పుడించెర
పుల్లి గడ్డ తినేటి బడవా
మురికి నీల్లు తాగే తుత్రా ||రామ||

గడ్డ వాంపట్నమంత
గడ్డలించి పారేసిన బడవా
పందిరాజు కిందు పాయెర
బయప్పనాయుడు మిందపాయెరా ||రామ||

బాపన ముండల సాపిని తగిలి
బల్లిపుకట్టి యిరిగిపాయెరా
పారిపొయ్యి బయప్పనాయుడు
పచ్చారి మానెక్కి నాడుగా ||రామ||

పూరి పుల్ల కొరికి నాదిర
కొరసగినమే సూసినాదిగా
ముందేసి యిందు చక్కెర
బారదేసి నేచక్కడి సెరా ।రామ॥

మూడు బారెం పద్యారి మాను
ఒక్క బారెడె నిలిపి నాదిగా
యదబాదొడ్డర నాయుడ నీవు
జడబాదొడ్డర బయద నీవు ॥రామ॥

మానిదిగర బయుడా నీవు
మాలికి రారా బయుడా నీవు
యవ్వరన్న నిన్ను పంపిరి బయుడ
నీవై నీవొస్తైరా బయుడా ॥రామ॥

గర్గవాలి సింతోమినాయుడు
గండుబల్లి నారాప్పనాయుడు
వాత్రె వారు పంపితే వత్తి
నాకై నేను రాలేదు పంది ।రామ॥

అదవరోమము పీకినాదిరా
నెత్తికెత్త పంపెరాదిరా ॥రామ॥

'తయ్యకు తద్దిమిత' అని గురువు కోపును తెగ్గొడతాడు అపుడందరూ కుప్పటికట్టి కొట్టి నిలబడతారు

## 5. యెబడ్డి సిత్తారి (బిత్తిరి సిత్తారి)

ఎత్తుగడ తయ్యకు
దిరదతయ్యకు
తయ్యకు
తద్దిమితా

మానంది బుగ్గలే మానంది బుగ్గలే
మరుపుల్ల కాలువ రాకలేపొంగిరా నందిలోన
తెల్లటాకులే పండెరా నందిలోన

**అన్నాలుండేదిరా నందిలోన**

సెరుపు జానాలుండేది రానందిలోన "మానంది"

వోసినసిన్న గుండాకు సినపెద్ద రవరాకు
సిరిబలుకుతుందిరా నందిలోన
సరిలోడు బలుకుతుందిరా నందిలోన "అన్నాలు"

పెద్ద పెద్ద గుండ్రాకు పెదపెద్ద గుండాకు
చేరితరమలాకు పేకాడిలింతురా నందలోన
నేనెట్ల తాలి తుగా నందిలోన "అన్నాలు"

"తయ్యకు తద్ది మిత"

## 6. శివకోపు

ఎత్తుగడ : తయ్యా
దిరదతయ్య
తయ్యకుతద్దిమితా
సువ్వి సువ్వి యేటిరంగ
సువ్వి కాస్తూరిరంగ సువ్వికా
మాపిరామ సువ్విలాలి 'ధీంత్'

అనిన వెంటనే అందరు గుండ్రాకారంగా వెలుద్దిగోవుద్ది నేలపై ఒక్కసారిగా కూర్చుంటారు గేయంలో పల్లవినే మరలా నిదానంగా పాడుతుంటారు

తాళాల గతులు . త - కిట్
త - కిట్
త - కిట్
త - కిట్
త - కిట్

తకిట
తా-కిట
తా-కిట
తా-కిట
తా-కిట
తా-కిట
దీతత్

చిటుకులు : టక-టక్
టక్-టక్
టక్-టక్
టక్-టక్
టక్-టక్
దీతత్
టకా-టక్
టకా-టక్
టకా-టక్
టకా-టక్
టకా-టక్
టకా-టక్
దీతత్

గేయంలో రెండు పల్లవులున్నాయి వాటిలో 'దీతత్' ఏయ్ అనే మాటం వల్ల నృత్యగతి, చరణాలు పాడటంలో మార్పును తెస్తాయి. ఈ మాటలు ఈ కోపుకు ప్రాణం. మొదటిగా అందరూ నేలపై కూర్చొని లేదా ఎత్తు గదతో మొదలుపెడితే ముగ్గురిచుట్టూరా కోపుద్ది వెలద్ది లోపలికి బయటికి తిరుగుతూ మొదటిగా చిటుకు వేసిన వృద్ధి దగ్గరకేవచ్చి కుప్పదికట్టి కొట్టినేంపై కూర్చుంటారు అపుడు నిదానంగా గేయం అదే పాదాన్ని పాడి గేయంలో రెండో చరణాన్ని పాడుతారు. తర్వాత గురువు 'దీతత్' అని అదే చరణాన్ని బిరబిరా పాడుతాడు కోలాటగాళ్ల లోపలికి బయటికి ఒక్కొక్కరికి ఒక్కొక్క చిటుకు ముగ్గురికి పై వరుసలోనివి అందుకొంటూ ఎగురుతూ యథాప్రకారంగా ముందుగా

కుప్పటి కట్టికొట్టిన పుట్టి గాకుండా అదే పుట్టికి ప్రక్కన కుప్పటి-ట్టి కొట్టి కూర్చుంటారు కూర్చొనే సమయంలో గురువు 'ధీతత్' అనేస్తాడు అలా ప్రతి చరణాన్ని కూర్చొన్నపుడు నిదానంగా నృత్యం చేస్తున్నపుడు బిరబిరా పాడటం కొపులో ప్రధానం రెండు పల్లవులున్నాయి అవి

1 సువ్వి సువ్వియేటిరంగ సువ్వికాస్తూరి రంగ
సువ్వికా మాపిరామ సువ్విలాలీ

2 సీతోడు సియ్యప్పతోడు లేదుగదర లక్ష్మి
నీకుండే పీడ పాయలేచిపోరచన్నుగా

గేయానికి సుగుణంగా నృత్యగాళ్ళు పై పల్లవులు పాడుతుండగా, గురువు మిగిలిన గేయమంతా పాడతాడు

సువ్వి సువ్వి యేటిరంగ సువ్వికాస్తూ రిరంగ
సువ్విగా మాపిరామ సువ్విలాలీ "సువ్వి"
ధీతత్

గొప్పయేడు కొండపదుమ గొర్రెబెదరి పులిని మింగె
సెప్పవచ్చిన ముసలిదాన్ని శాప మింగెనే "సువ్వి"
ధీతత్

బల్లి బల్లి సరసమాడి బండిగోలు వకటి మింగి
రోస మెచ్చి పంగికొక్కు రోల మింగినే "సువ్వి"
ధీతత్

రెక్క ముక్కలేని పచ్చి రేయింబవులు తపసు బట్టి
వక్క సెరువు నీల్లన్ని వకటె మింగెను "సువ్వి"
ధీతత్

కాల్లు సేతులేనివాడు కదవ ముంత సేతబట్టి
వక్క బాయినీల్లన్ని వగడె మోసెను
ధీతత్

అవురా సిన్నారిగా మల్లిపూలసొగసుగా
పువ్వాలంగిటి కాడ కూసోర సెన్నుగా
పువ్వలాకు వక్కరూక యిచ్చిపోర సెన్నుగా
నీతోడు నీయబ్బతోడు లేదుగదరలచ్చి
లేకుంటె పిడపాయలేసి పోర సెన్నుగా

ఎయ్ ధీతత్

అనంతపురము సంతాలో ఆకాలంగిటికాడ కూసోర సెన్నుగా
ఆకలాకు వక్కరూక యిచ్చిపోర సెన్నుగా "నీతోడు"

ఏయ్

కొచ్చెరువు సంతలో కోకాలంగిటికాడ కూసోర సెన్నుగా
కోకలాకు వక్కరూక యిచ్చిపోర సెన్నుగా "నీతోడు"

ఏయ్

రాయదుర్గము సంతలో రాగూలంగిటికాడ కూసోర సెన్నుగా
రాగులాకు వక్కరూక యిచ్చిపోర సెన్నుగా "నీతోడు"

ఏయ్

కల్యాన దుర్గము సంతలో కమ్మలంగిటి కాడ కూసోర సెన్నుగా
కమ్మలాకు వక్కరూక యిచ్చిపోర సెన్నుగా "నీతోడు"

ఏయ్

వురవకొండ సంతాలో వులవాలంగిటి కాడకూసోర సెన్నుగా
వులవలాకు వక్కరూక యిచ్చి పోర సెన్నుగా "నీతోడు"

ఏయ్

కదిరి సంతలో దవనామంగిటికాడ కూసోర సెన్నుగా
దవనమూకు వక్క రూక యిచ్చిపోర సెన్నుగా "నీతోడు"

ఏయ్

తయ్యకు తద్ధిమిత

## 7. బాలనారి కోపు (ఈడిగనారి కోపు)

ఎత్తుగడ తయ్యా
దిరధతయ్యా
తయ్యాకు తద్దిమితా
బాలబాల బాలనయ్యా
బాలసంజీవరామ
యల్లనూరి సెలియరార
సామి సంజీవ
దీదత్

తాళాల గతులు, తా-కిట
తా-కిట
తా-కిట
తా-కిట
తా-కిట
తా-కిట
దీతత్

తకిట
తకిట
తకిట
తకిట
తకిట
తకిట

చిటుకులు : టకా-టక
టకా-టక
టకా-టక
టకా-టక
టకా-టక్
టకా-టక్
ధీతత్

టక్టక్
టక్టక్
టక్టక్
టక్టక్
టక్టక్
టక్టక్

ఈ కోపులో 'ధీతత్' అనే మాటవల్లా నృత్యగతికి మారిపోతుంది అంతకు ముందుగ వేస్తున్న అంచును 'దీతత్' అనే మాటవల్లా మారుస్తారు అపుడు అడుగులు విరావిరా సాగిపోతాయి ఎత్తుగడలోవుద్ది వెలద్ది తమ తమ కట్టెలపై చిటుకు వేసుకొంటూ ఎదురుగా మ్గురికి అందుకొంటూ మారేవుద్దికాడ నేలపై నాలుగు కట్టెలు కొడతారు (ట్లుక్) అపుడు గుండ్రాకారంగ అందరూ వంగుతారు ఇదొక భంగిమ తర్వాత వారిచే వెనక్కు అందుకొంటూలోవుద్ది వెలుపలికి వెలుద్ది లోపలికివెళ్లి ముందు మాదిరిగా చిటికెలు వేసుకొని బయటికి వస్తున్నపుడు ముగ్గురిలో ఒక్కర్ని దాటవేస్తూ వస్తారు అలా ప్రతిసారి దాటవేస్తూ గుండ్రాకారంగా తిరుగుతారు ధీతత్ అనే గరువు గేయం సగం అయిన తర్వాత లేదా గేయం అయిపోయేలోగా రెండు మూడు సార్లు అంటారు నేలపై కాలితో కొట్టటం మాత్రం ఉంటుంది

బాలబాలనయ్య ముద్దు బాలసంజీవరాయ
యల్లనూరి సెలియరారా సామి సంజీవ "బాల"

వత్తనంటె వయిపుకాదు వాగిటాన రచ్చబండ
మచ్చరంపుసిన్న వాడు మరదికాయిలి "బాల"

దీతత్

బాలబాలనయ్య ముద్దు బాలసంజీవరాయ
యల్లనూరి చలియరారా సామి సంజీవ
వత్తనంటె వయిపుకాదు వాగిటాన రచ్చబండ
మచ్చరంపు సిన్న వాడు మరిది కాయిలి "బాల"

వో యక్కాటి దానవే యక్కాటి దానవే
సక్కాని కోమలి నీవక్కదాని వడులిలో

వో ఏ వో బామురో సెంచితా నీవక్క
దానివడవిలో వో వో ఏ
మల్లు మల్లంగి వనము
ముందిరక్క ముత్తివనమురో చెంచితా
ముందిరక్క ముత్తివనములో చెంచితా "యక్క"

ఆరికాల్లు కిరిగినాయి ఆరూ్నట మల్లు
ముంజేతికిరిగినాయి మున్నూటమల్లు

## 8. ముంగారి కోపు

ఎత్తుగడ : తయ్యకు
దిరదతయ్యకు
తయ్యకుతద్దిమిత
ముంగారివానలే ముంగారివానలే

తాళం గతులు త-త-తక్
త-త-తక్
త-త-తక్

చిటుకులు టక్-టక్ ట్లుక్
టక్-టక్-ట్లుక్
టక్-టక్-ట్లుక్
టక్-టక్-ట్లుక్
టక్-టక్-ట్లుక్
టక్-టక్-ట్లుక్
టక్-టక్-ట్లుక్
టక్-టక్-ట్లుక్

ఎత్తుగడ పాడి గేయాన్ని ఎత్తుకొన్నవెంటనే తమ తమ కర్రలపై టక్ టక్' మనే చిటికెలు వేసుకొని లోవృద్ధి వెలుద్ది 'ట్లుక్' మనే కుప్పటి కట్టి మరలా వ్యక్తికి అదే విధంగా కొట్టి, తర్వాత నేలపై ఎదురెదురుగా కర్రలన్ని గిస్తూ చిటికె

లేస్తారు (ట్రిక్) తర్వాత వారికే (మగ్గుకి) అందుకొంటూ వెలుపలి లోపలికి, లోవృద్ధి బయటికి మారుతూ వస్తారు అలా ప్రతి చిటికెకు నేలపై మునికాళ్లను వేళ్లను కొట్టటం గజ్జెలు నినదించటం వుంటుంది కోపు గేయం నిదానంగా వుంటుంది. లోపలికి లోవృద్ధి వెళ్లినపుడు వృద్ధిని మార్చుకోవటం, బయటికి వెలుద్ధి వచ్చినపుడు వృద్ధిని మార్చుకోంటూ గుండ్రాకారంగా తిరుగుతారు నేలపై లోవృద్ధి వెలుద్ధి కాళ్లు నడుములు వంచి చిటికె వేసేటపుడు భంగిమ చాల అందంగా వుంటుంది అలాగే లోపలికి బయటికి మారే సమయంలో కోలాట కర్రలన్నీ తలలమీద కుప్పదికట్టికొట్టే భంగిమ మన హృదయాన్ని అలరిస్తుంది.

ముంగారి వానలే ముంగారి వానలే
మురిపించి కురవంగ ఉంగించికురవంగ
మునియాకు చిగురేసేనమ్మ సైసై
నాగమ్మ చిగులేసెకొమ్మ
గండుకోయిలి కూసెనమ్మనా
గుండె జల్లుజల్లుర మానెకొమ్మ "ముంగారి"

వానాదకురిసెర వాన నా సామి
వరద రాజుల కోనలోన
మల్లుకొని కురిసెర వాన నాసామి
మల్లియేసుని కోనలోన "ముంగారి"

తల్లిలేనివారు తండ్రిలేనివారు
తరలి వచ్చి కొండలెక్కిటి
కాటమొచ్చెర గంపమాల
యిన్నివారికి పున్నెమన్న యంకటరమన
వన్నెగల్లది గంపమాల "ముంగారి"

దూడలా కోసరము దూడలా కోసరము
దుసర మానెక్కిటి కానవచ్చెర గంపమాల
వోరన్న కానవచ్చెర గంప మాల
యిన్ని వారికి పున్నె యంకటరమన
వన్నెగల్లది గంపమాల "ముంగారి"

ఆవలా కోసరము ఆవలా కోసరము
అందిపుమానెక్కాలి కానవచ్చెరగంపమాల
వోరన్న కాన వచ్చెగ గంపమాల
యిన్ని వారికి పున్నెమన్న యింకటరమన
వన్నెగల్లది గంపమాల "ము గారి"

నందికొండన పుట్టినంది కొండన పెరిగి
చిన్న దొగిశిలమోరన్న వోరన్న
భూమికి దొడ్డది బుక్కపట్నంచెర్వు
కట్రాల్లు కదిలిచ్చె పెన్నదానికి దొడ్డది
దర్మాకరం చెర్వుదండి మరవలు పారెరన్న
వోరన్న దండి మరవలు పారెనన్న "ముంగారి"

సిన్నారి వారంత సిన్నారివారంత
సిరినల మొదలుకొని వద్దు దెమ్మ చొని
వారంతపాతమని నోటితాల వేసిరన్న
రొమ్ముతప్పిది కొట్టిరన్న "ముంగారి"

కట్టమిందోటి కట్టమిందోటి
కడయమ్మ యా సామి కడకోపు సెలవిచ్చెను
యింటింట దీపాలు యింటింట దీపాలు
యినపదీటికట్లు యింగచూడర మనవూరు
బంగారి పల్లకిలో బయిలెల్లెగంగమ్మ
సింగారమే సుబ్బరాంపేట "ముంగారి"

"తయ్యకు తధ్ధిమిత"

ఇంకా అయిదు చిటుకలు పూలచెండ్లకోపు, రెడ్డివారికోపు వుద్ది తిరుగుడు కోపు, జడకోపు, బజారు కోపు మొదలైనవి ఉన్నాయి వాటికనుగుణంగా వుండే పాటలు దొరకలేదు కొన్ని అడుగంటిపోయాయి కనీసం నలబైరకాల కోపులున్నాయని ఈ మండలంలోని కోలాట గురువుల నమ్మకంగా చెబుతున్నారు.

కోలాటం చూడటానికి పల్లీయులంతా ఆసక్తితో వస్తారు అడుగులు బాగా వేసేవారికి పూలుతెచ్చిమెడలో వేయటం, ఈలలువేస్తూ చప్పట్లు కొడుతూఉంటారు

చూడటానికి వచ్చిన వారిలో ముసలి స్త్రీలు కూడా అడుగులో అడుగులు వేస్తారు. బాగా తాగినవారు గుంపులో కోలాట పాటలతో ప్రతిపలుకుతూ ఉంటారు. కేరింతలు కొడుతూ జనమంతా నేలపై కూర్చొని, నిలబడి కోలాటాన్ని చూస్తుంటారు. ఆలనాటి నందగోకులం మళ్లీ ఆవతరించిందా అన్నట్టుగా కోలాటం 'శ్రీకృష్ణుని లీలలు' తలపిస్తాయి.

## కోలాటం జానపద విలువలు

1. కోలన్న(కర్ర) లైంగిక ప్రతీక. దీనిలో చాల తిట్లు, బూతులు ఉంటాయి.
2. కర్రల చిటుకులు 'X ఇలా ఉంటాయి. ఆటకు సహజమైన లక్షణం, విమర్శ, గతులు 'X' స్పర్థ ఇందులో ప్రాముఖ్యం.



కోలాట బృందం - సుబ్బారావుపేట

## కళాకారులు

బోయ నరసింహులు - 40 సం॥ లు - ఇటికెలు వేయటం
బోయ ఆదినారాయణ - 30 సం॥ లు - కూలి
బోయ పీరన్న - 28 సం॥ లు - కట్టెలమ్మటం
హరిజన పుల్లన్న - 30 సం॥ లు - కూలి - తప్పెటకొట్టటం
హరిజన నాగన్న - 35 సం॥ లు - చెప్పులుకట్టటం - కూలి
హరిజన నాగప్ప - 36 సం॥ లు - కూలి
హరిజన బుడ్డప్ప - 28 సం॥ లు - కూలి
తలారి ఈరప్ప - 38 సం॥ లు - కూలి
తలారి గంగప్ప - 35 సం॥ లు - కూలి
తలారి నాగులప్ప - 30 సం॥ లు - కూలి
గొర్ల నరసింహారెడ్డి - 35 సం॥ లు - కూలి
గొట్లూరి నారపరెడ్డి - 35 సం॥ లు - వ్యవసాయం
సూరం శివారెడ్డి - 35 సం॥ లు - వ్యవసాయం
చిగిచర్ల పెద్దిరెడ్డి - 50 సం॥ లు - వ్యవసాయం
చిగిచర్ల నారాయణరెడ్డి - 38 సం॥ లు - వ్యవసాయం
చిగిచర్ల ఆదినారాయణరెడ్డి - 35 సం॥ లు - వ్యవసాయం
చిగిచర్ల కృష్ణారెడ్డి - 31 సం॥ లు - (ప్రస్తుత వ్యాసకర్త)
జూటూరు నారాయణరెడ్డి - 31 సం॥ లు - వ్యవసాయం
గంగిరెడ్డిగారి నాగిరెడ్డి - 35 సం॥ లు - వ్యవసాయం
గొట్లూరి శంకర నారాయణరెడ్డి - 40 సం॥ లు - వ్యవసాయం
గొట్లూరి నారాయణరెడ్డి - 45 సం॥ లు - వ్యవసాయం
గొట్లూరి గంగిరెడ్డి - 35 సం॥ లు - వ్యవసాయం

(సుబ్బారావుపేట - కోలాటబృందం)

## గురువులు

తలారి నరసింహులు - 37 సం॥ లు - కూలి
తలారి లక్ష్మన్న - 42 సం॥ లు గొర్రెల కాపరి
హరిజన నాగన్న - 50 సం॥ లు - కూలి

## కోలాట గుంపులున్న గ్రామాలు

సుబ్బరావుపేట - ఓన్నూరిబత్తలపల్లి - వేల్పుమడుగు - తంబాపురం - తాడిమర్రి - బత్తలపల్లి - ధర్మవరం - దర్శినమల-యర్రగుంటపల్లి - చిన్నకోట్ల పెద్దకోట్ల-రేగాటిపల్లె-తిప్పేపల్లి-నేలకోట

చిరునామా

**జానపద యువకళాకారుల సంఘం**

రిజిస్టర్డ్ 215/88

సుబ్బారావుపేట పోస్ట్, ధర్మవరం మండలం,

అనంతపురం జిల్లా



## 5. గొరవయ్యల నృత్యం

గొరవయ్యలు కురువ(బ) వంశస్థులు ఈ వంశంలో పెద్ద కుమారుడు లేదా చిన్నకుమారుడు తప్పనిసరిగా గొరవయ్య కావాలి. అని వారే స్వయంగా తెలియచేస్తారు శ్రీశైలం మల్లికార్జునిపై అనేక భక్తి పాటలు పాడతారు కర్నూలు జిల్లా, అనంతపురం జిల్లాలో గొరవయ్యలు తయారవుతున్నారు గొరవయ్యను తయారు చేయాలంటే గురువు లేదా 'గణాచారి' అవసరం గురువులు కర్నూలు జిల్లా ఆలూరులో 'గట్టమల్లయ్య' కొండలో ఉన్నారు. గణాచారులు అనంతపురం జిల్లా కాట్నేకాలవలో ఉన్నారు.

ఈ జిల్లాల్లో వుండే కురువ వంశస్థులు గొరవయ్యలు కావాలంటే పిల్లవాన్ని గట్టు మల్లయ్య కొండలో మల్లేపుని గుడిదగ్గరకి తీసుకు వెళతారు అక్కడ కోనేటిలో స్నానము చేయించి నల్ల 'కంబడి' పరచి జాడిపోసి[21] కూర్చొబెడతారు పిల్లవాని మేనమామ పాలతో ప్రమాణం చేయిస్తారు అపుడు అక్కడుండే గురవు (కులపెద్ద) గవ్వలతో కూడిన దండను 'ముద్రాదానం' చేస్తాడు ముద్రాదానాన్ని పిల్లవాని మెడలో కడతాడు. గురువు పాదా కు సమస్కరించి కానుక సమర్పించు కొంటారు పిల్లవానికి గురువు చెప్పేమాటలు

"మన కుల వృత్తికి ద్రోహం చేయకూడదు
ఇతరులను మోసం చెయ్యొద్దు
అబద్ధం చెప్పొద్దు" అని పిల్లవాని నోటివెంబడి పలికిస్తాడు

ఇలా ప్రమాణం చేయించిన పిల్లవాడు ఆ వంశంలో కోటీశ్వరుడైనప్పటికి "సంక్రాంతి" పండగనాడు మాత్రం గొరవయ్యలాగా అలంకరించు కొని ఐదు ఇండ్లు అడుక్కొని రావాలి ఇది వంశపారంపర్యంగా జగగాల్సిన నియమం మెడలో గవ్వల దండను ధరించి, నల్లకమ్మిడి (కంబళి) శరీరమంతా కప్పుకొని, (కుట్టించుకొని) కుడిచేతిలో డమరుకాన్ని పట్టుకొని, యడమచేతిలో పిల్లంగోయ్యి (పిల్లనగ్రోవి) పట్టుకొని, కాళ్లకు గజ్జెలు కట్టుకొని, తలకు కిరీటంలాగా ఎలుగు బంటి చర్మాని ధరించి, నుదుట బండారు పెట్టి, నడుముకు జింక చర్మంతో చేసిన బండారు తిత్తి (బాగ్)ని కట్టుకొని ప్రతి ఇంటి దగ్గరకు వస్తూ పోతూ అడుక్కొంటూ ఇంటిలోని పిల్లలకు పెద్దలకు బండారు బొట్టుపెడ్తూ డమరుకాన్ని వాయిస్తూ పిల్లనగ్రోవి నూదుతూ ఇలా పాడుతారు

శివా మల్లేశ్వరా
బండారుదయ్యా
కాపాడప్పా
పిల్లలను పెద్దలను దీవించు
గాదెెద్దులు కలిగి
గూటావులు కలిగి
కోటి సంపదలు కలిగి
కనక పాత్రగలికి

మల్లేయునట్లు మగబిడ్డగలిగి
మల్లికార్జున నీపాద పద్మాలకు
నమస్తే

గొరవయ్యలంతా 'దసరా' పండగనాడు ఆటూరులోని మల్లేశ్వరసామి సన్నిధిలో వివిధ పద్ధతుల్లో పాటలు పాడుతూ నాట్యం చేస్తారు అంతేగాక వారి శరీరం నుంచి కొంత రక్తాన్ని తీసి 'దాసోహం' దేవునికి నైవేద్యం చేస్తారు వీరి నాట్యపద్ధతి కూడా చాల వింతగా వుంటుంది చివరిగా కుక్కల మాదిరిగా[22] అరుస్తూ కొట్టుకొంటూ తర్వాత కుక్కలలాగా నాలుకతోపాలు తాగుతారు దీనికి నిదర్శనంగా గొరవయ్యలు చిన్నపిల్లల్ని చూస్తే తప్పుకొని పోతారు[23] వారి చెవులు కొరుకుతారు అందుకోసం గొరవయ్యల్ని చూస్తే చిన్నపిల్లలు భయ పడతారు డమరుకం శబ్దాల్ని వింటూనే పిల్లలు జడుసుకోవటం కూడా ఉంటుంది

గొరవయ్యలు నృత్యం చేస్తున్నపుడు పాటలు పాడరు పాట పాడేసమ యంలో డమరుకాన్ని ఒక్కపక్క మాత్రమే నాలుగు వ్రేళ్లతో వాయిస్తారు. ఇళ్లదగ్గర కొచ్చి అడుక్కొనే సమయంలోనూ, నృత్యం చేసే సమయంలోనూ డమరుకాన్ని వాయిస్తారు పిల్లనగ్రోవిని లయాత్మకంగా ఊదుతారు. డమరుకం నుంచి పుట్టే ధ్వనులిలా ఉంటాయి

"డడ బుడ్డ బుడ్
యిరడ డడబుడ్డ
బుడ బుడ్డ బుడ్
బుడ బుడ్డ బుడ్
బుడ బుడ్డ బుడ్"

"బుడ బుడ్డ బుడ్
బుడ బుడ్డ బుడ్
బుడ బుడ్డ బుడ్"

గొరవయ్యల నృత్యం ఒకరు మొదలు ఎంతమందైనా చేస్తారు. సరిసంఖ్య లో పాల్గొంటారు ఇల్లిల్లూ తిరిగే సమయంలో ఒకరు మాత్రమే నృత్యం చేస్తారు ఇళ్ల ముంగిట డమరుకాన్ని వాయిస్తూ పిల్లనగ్రోవిని ఊదుతూ గుండ్రాకారంగా

తిరగటం, ఒక్కొక్క కాలితో నేలపై కొట్టటం తల త్రిప్పటం, పిల్లల్ని భయ పెట్టటానికి ఢమరకాన్ని ఉన్నట్టుండి 'బుఢ ఒడ్డ', మనే శబ్దాన్ని పుట్టిస్తూ పరుగెత్తటం నడుమును వయ్యారంగా ఆడించటం చేస్తాడు

సరిసంఖ్యలో పాల్గొని నృత్యం చేసే సమయంలో ఒక్కొక్క వరుసగా అందరూ నిలబడి ఢమరుకాన్ని ఒక్కసారిగా బుఢబుఢ్డబుడ్ అనే గతిలో వాయి స్తుండగా అందరు మొదటిగా గుండ్రాకారంగా తిరిగి వరుసలో నిలబడతారు తర్వాత ఒక్కొక్క వరుసలోని వారు ఎదురుబదురుగా పోటీగా అడుగులు వేస్తూ కూర్చొని లేవటం, కూర్చొని తిరగటం ఒక్కొక్క అడుగు వేసుకొంటూ వరుసలోని వారు ఇంకో వరుసలోకి మారుతారు అలా మారిన తర్వాత ఇంకో జత అలాగే చేస్తూమారుతారు ఇలా ఎంతమంది వుంటే అందరు ఒకటవ వరుసలోని వారంత రెండవ వరసలోకి, రెండవ వరసలోని వారంతా ఒకటవ వరసలోనికి మారుతారు ఇంత చేస్తున్న ఢమరుకం, పిల్లనగ్రోవి వాయిస్తూనే ఉంటారు. తర్వాత అందరు గుండ్రాకారంగా తిరుగుతూ ఒక్కొక్క కాలిని నేలపై కొడుతూ మార్చుకొంటూ ఉంటారు ఢమరుకం 'బుఢ బుడ్డ బుడ్' అనే గతిలోనే వాయిస్తూ నృత్యం చేస్తుటూరు.

తర్వాత ఒకరు పాట పాడుతుండగా మిగిలిన వారు అందరూ ఢమరుకాన్ని ఒకప్రక్క మాత్రమే నాలుగు వ్రేళ్ల సహాయంలో వాయిస్తూ వ తపాడతారు అపుడుపుట్టే ధ్వనులిలా ఉంటాయి.

తక తక్క తక
తక తక్క తక
తక తక్క తక

ఒకరు పాట పాడుతుండగా మిగిలిన వారంత పాటకు వంత పాడుతారు అలా అన్ని గొంతులు కలపటం ఒక్కొక్క కాలిని కొద్దిమంది నేలపై కొడుతుం టారు అపుడు గజ్జెలు వినవిస్తూ వుంటాయి

అలాంటి పాట

శివుడు నీవయ్యా శ్రీశైలమల్లయ్యా
కానగరావయ్యా శివయ్యా

సికుక్క జడలవాడు శివనీలకంటుడు
పైనిండ యీబూది మహాశివుని
మెడలోన రుద్రాచ్చలు దేవాదిదేవా "శివుడు"

సన్నాకమ్మడితెచ్చి సరిమదత వేయించి
గుండుమల్లెలు పోసి దేవాదిదేవా
గుండుమల్లెంపైన శివుని కొప్పెరిపెట్టి
పాలబెల్లం పోసెనే మహాశివుని
మనసార తనుకొలిసెను దేవాదిదేవా
వారమారమునాడు సోమవారమునాడు
నానందమయ్యేడు శివుడు వానందమయ్యేడు "శివుడు"

ఢమరుకాన్ని కొద్ది మార్పు చేస్తూ పాడే పాట మల్లేసుని వేట వర్ణనకు సంబంధించింది వేటలో పరుగెత్తటం సహజం అలాగే పాటలోనూ, వాద్యం వాయించే సమయంలోను బిరబిరా పాడటం, వాయించటం ఉంది పాటంతా బిరబిరా పాడుతారు పల్లవిని అందరూ కలిసి పాడుతాను ఢమరుకం నుంచి వుట్టే ధ్వనులిలా ఉంటాయి.

"తక తక తక్
తక తక టక్
తక తక్ తక్
తక్ తక్ తక్"

యాట వెళ్లిన చూడరే మల్లేసుడు
యాట వెళ్లిన చూడరే మల్లేసుడు
స్వామి యాట ఎళ్లిన చూడు కాడు కాపురమందు
సాటిలేని గట్టసామి మల్లేసురుడు ॥యాట॥

సామి మెరుపుచందన కాయ మెరుపు చందనకాయ
మెదనిండా తెల్వాలు మంతుగంగవపాలు
ముడిసి పుట్టనబోసి కున్నులు దాగిన గురసీల జంగాము
కన్నె జింకను బట్టి కొంత యీబూదిని బట్టి
తనలోన బల్కిన శివసీలకంటూడు ॥యాట॥

సామి వేలు బండ, నాదమేటి వసంతూరు
వార్య బంతీశ్వరుల బంగారు గొలుసులు
పై రేన 'ఒగ్గాలు' పెద్ద గంగుళమ్మ
సేరితుప్పెదవేళ సెలియ లిద్దరు గూడి
సేవసేవకులంత సెసేరు నీసేవ
వాలూక జగమెల్ల యేలేటి సామి ॥యాట॥

చూడరమ్మ వందనిండ్లు చూడరమ్మ
చురటీలు జిమిటీలు చూడుగ వెలుగాయె
గగనకి ముట్టంగ కదిలార నీ పరష
కడను కర్నూలు వరకు, ఏ వంక చూసినా
వెలలేక నీపరష ॥యాట॥

శివరాత్రినాడు 'మల్లయ్యకొండ' కు ఎలా గొరవయ్యలంతా పోతూ పాట లెలాపాడుతారో తెలిపేద ఈ పాట శివరాత్రికి పోతూ పోతూ మధ్యలో వచ్చే గ్రామాలవారికి తెలియచేయాలనే సత్సంకల్పంతో పాటలో ఆ మల్లయ్య కొండను, దేవాలయాన్ని గూర్చి తెలియజేయటం కష్టాలు కడతేర్చే దేవుడు, కోనేరు లోతు పాతలు తెలివంటూ కోనేరు ప్రస్తావనచేయుటం మల్లయ్య ఒంటిస్తంభము మాలలో నివసిస్తున్నాడని అందరికి పాట రూపంలో తెలియచేస్తూ కొండకెళతారు. ఈ పాటలో 'పల్లవి' ఎత్తుకొనే సమయంలో చివరిగా రెండు పాదాలు పల్లవిలాగ ఆలపించటంతో పాటకొక తూగు పూపు వస్తుంది డమరుకం 'తక తక తక' గతిలో కొడుతుంటారు

## శివరాత్రి

శివకొండకనిపోదాము రారమ్మ
మల్లయ్య కొండస్వామినే చూతాము
శివాపుామికి పరమటంట
శిద్దులేలే మల్లయ్య కొండ
సిన్నగనే పోదాము రారమ్మ
ఆపరవతాలకు మెల్లగనే పోదామ్మ "శివ"

శివ మల్లిపూవల కోనలోన
మల్లికార్జునుడున్నడంట
యిష్టముతో పూజించేవారికి
కష్టములు యెడబాసె దేవుడు
సిన్నగనే బోదాము రారమ్మ
ఆ పరవతాలకు మెల్లగనే పోదాము రారమ్మ "శివ"

కొండపైన దేవళంబు
కొండదిగవన మందిరంబు
మందిరంబులో వెలిగేటి
మల్లికార్జునుడున్నడంట
సిన్నగనే పోదాము రారమ్మ
లోతైన కోనేరంట
గాతమెవరికి తెలియదంట
అందులోన స్నానంబుచేసి
నిందయోచ్చంబు కలిగె కొండ
సిన్నగనే పోదాము రారమ్మ
అ పరవతాలకు మెల్లగానే బోదాము రారమ్మ "శివ"

గల్లుగల్లున లేసెగదవమ్మ
ఆ పరమశివుడు యెన్ని మాయలుగల్లవాడమ్మ
సుట్టుతిరిగె కొండలవిగో
నట్టనడుమన దేవళంబు
ఒంటిస్తంబము మాలలోన
ఒక్కడే మల్లయ్య నిలిసె "శివ"

రెండు మూడు చరణాలు అయిన తర్వాత చివరిలో పల్లవి ఉంటుంది. గేయానికనుగుణంగా ఆ పల్లవి అందాన్ని స్తోంది ఢమరుకం వాయించేటపుడు నాలుగు వేళ్లతో గట్టిగా కొడుతుండగా 'బుఢబుఢ్డ' మనే శబ్దం వస్తుంది. మల్లయ్యకు నిద్రలేపుమని తెలిపే పాట గేయానికొక తూగునిస్తోంది, గేయాన్ని ఒకరు

పాడుతుండగా మిగిలిన వారంతా వంతపాడుతారు పల్లవి కొన్ని చరణాలు పాడిన తర్వాత మొదలవుతుంది అలాంటి గేయం

కురువ త్రె మైలారులింగ జరజరాలింగాలు
పాములే వరసంబు పార్వతీ మల్లయ్య
మల్లయ్యను లేపురమ్మ
మల్లయ్య పూజారి మైలారు లింగన్న
సద్గురునిలేపురమ్మ
పరమట దేశాన పాలుకావల్లొచ్చె
పంచనే దిగినాయి మల్లయ్యను లేపురమ్మ
మల్లయ్య పూజరి మైలారు లింగన్న
సద్గురుని లేపురమ్మ

దక్షణమ్ము దేశాన టెంకాయ ఓంబూళు
ఒప్పగనే పంచుకొలువు చేరున్నాయి
మల్లయ్యను లేపురమ్మ సద్గురుని లేపురమ్మ
జీనిగుల కుంటకు జిమ కులొచ్చినాయి
వేట మార్గముతోన మల్లయ్యను లేపురమ్మ
కానగలగుంటాకు కముజులొచ్చిన్నాయి
వేట మార్గముతోన మల్లయ్యను లేపురమ్మ
మల్లయ్య పూజారి మైలారు లింగన్న
సద్గురుని లేపురమ్మ

ఢమరుకాన్ని బిరబిరా వాయిస్తూ నేలమీదపాదే వ్యక్తి కుడికాలిని కొడుతుండగా మిగిలిన వారంతా అతనికి వంతకలుపుతారు పల్లవిని ఎత్తుకొనే సమయంలో చివరి పాదాన్ని రెండుసార్లు పాడుతారు. అలాంటి సమయంలో కుడికాలును లయాత్మకంగా నేలపైకొట్టటంతో గేయానికొక ఊపు వస్తుంది ఢమరుకం 'బుడ బుడ్డ బుడ్' మనే గతిలో వాయిస్తుంటారు. శివుడు కాటిలో వుండే భూతాలను 'సిందాము' తొక్కించినాడని ప్రతి సోమవారం నాడు జంగమయినాడు కాబట్టి పూజిస్తున్నారని తెలిపే గేయం

మనయింటి మల్లయ్య మనయింటి మల్లయ్య
వేటలాడేటోగ తిరబాయె గోరయ్యంటి మంద
ఆకోని వస్తేను పల్లునోయంగ
మాపిటికి మందాకు రావయ్య
మందాకు పెద్దోడు బోయడు మారెప్ప
కనకొన్న కాముదేవుడమ్మ
నేనే మానదేవ శివునకు తానాల ఆలిగనాడు ||మన||

క్రాటిలో కూర్చొని వేడిక్షూతములన్ని
నాటకము లాటింపినాడు
దేవుడు సింధాము తొక్కించినాడు ||మన||

బారు వారము నాడు సోమవారమునాడు
మరియె జంగామయినాడు శివుడు మల్లయ్య
వేదాముంగటాను శూలం చేతాబట్టి
యెదుట శంకపూపినాడు ||మన||

చివరిగా మంగళం పాటలాంటిది గొరువయ్యలు పాడతారు ఎవరైనా వీరిని శుభకార్యాలకు, ఇంటిలో అరిష్టాలు రాకుండా ఉండాలనే కోరికతో బండారిచ్చి పిలిపిస్తారు గొరవయ్యలొచ్చి ఇంటిలో శివున్ని పూజించి కొలిచి, ఇంటియజమానులతో కొలిపించిన తర్వాత వారికి ఇంటి యజమాని ఇనాములిస్తారు దానికి బదులుగా 'జింక' చర్మంతో చేయబడిన తిత్తికోని బండారును వారికి ఇస్తూ పాడుతారు. ప్రతి నృత్యం సందర్భంలోనూ ఈ పాటతో నిలుపుదల చేస్తారు' డమరుకం నిదానంగా 'బుడ-బుడ-బుడ్' గతిలో కొడుతుండగా మిగిలినవారంతా గట్టిగా పాడుతారు. తర్వాత అందరూ గుండ్రాకారంగా తిరుగుతూ పిల్లనగ్రోవి నూదుతూ నృత్యాన్ని నిలుపుదల చేస్తారు.

శివ బండారు బండారు తలలో మల్లయ్య
యాబూడి బండారు తలలో
శ్రీశైల మల్లయ్య యాబూడి
శివమానందింపాశురుని యాబూడి "బండారు"

గట్టుమల్లయ్యసామి బండారు
మాగంగు మాళమ్మదేవి బండారు "బండారు"

మైలారు లింగయ్య బండారు
మాగంటి ఈశరుని బండారు "బండారు"

తిరపతి తిమ్మమ్మ బండారు
శివసామి గోవిందురాజుని బండారు "బండారు"

సువ్వెక్కలాడెనె బండారు
సామి కల్యాన మాడెనె బండారు
వై బోగమాడెనె బండారు "బండారు"

గొరవయ్యల నృత్యాన్ని చూస్తున్నపుడు పిల్లలు భయపడుతుంటారు కానీ పెద్దలు ఎత్తుకొని ఒడిలో కూర్చొ పెట్టుకొంటారు కాబట్టి అనుకొని కళ్లనుగట్టిగా మూసుకొంటు అపుడపుడు చూస్తుంటారు అందరి గుండెలు గభేలుమనేలాగా ధ్వనులుంటాయి. పెద్దగొరవయ్యలు అపుడపుడే తయారైన చిన్న గొరవయ్యలు నృత్యం చేస్తుండగా అందరూ చూస్తూ నవ్వుతుంటారు పాటలు పాడుతున్న సందర్భంలో చిన్నపిల్లలు బాగా వింటూ చప్పట్లు కొట్టటం పెద్దలు వార్ని చూసి నవ్వటం ఉంటుంది. గొరవయ్యలు ఇంటి దగ్గరకొచ్చి అడుక్కొంటున్న సమయంలో దాన్యాన్ని పెడితే, వారు బండారు పెట్టి పోతుంటారు

**కళాకారులు**

గొరవరామాంజనేయులు - 85 సం.లు - వేషం వేసుకొని ఇల్లిల్లూ తిరగటం పల్లెల్ని తిరగటం
గొరవ కాటమయ్య - 40 సం.లు ,,
గొరవ చినకాటమయ్య - 40 సం.లు ,,

కళను ప్రదర్శించటానికి ఏ ప్రాంతమైన బయలుదేరటం, పొట్టకూటి కోసం సంచారం చేయటం.

చిరునామా :

**1. గొరవ రామాంజనేయులు (గొరవయ్య)**
చెరువు కట్టకింద కొట్టాలు
టెలివిజన్ కేంద్రం వెనకభాగం
పాతూరు - అనంతపురం జిల్లా

## 2. జానపద యువకళాకారుల సంఘం

రిజిస్టర్డ్ 245/88
సుబ్బారావుపేట పోస్ట్, ధర్మవరం మండలం,
అనంతపురం జిల్లా



## 6. పండరి భజన

పండరిపురంలోని పాండురంగన్ని వేడుకొంటూ చేసే నృత్యం పండరి భజన భక్తితో కూడుకొని వుంటుంది జానపదులు భగవంతుని అనేక రకాలుగా పూజిస్తారు పల్లెలోని రామాలయంలో రామదాసు కీర్తనలు, త్యాగరాజు కీర్తనలు కూర్చొని చేతులతో చప్పట్లు లయగా కొడుతూ భజన చేయటం వుంది. ఇంకా

'హరేరామ హరేరామ రామ రామ హరే హరే
హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే'

అనే పల్లవిని ఆలపిస్తూ వేడుకొంటారు ఇలా భగవంతుని భజన చేయటంలో అనేక రకాలుగా కనిపిస్తున్నాయి[24]

పండరి భజనలో అన్ని తెగలవారు పాల్గొంటారు వీరికి గురువు వుంటాడు. ఇతడు పల్లెలు తిరగుతూ పండరి భజనను నేర్పిస్తూ పొట్టపోసుకొంటాడు పాండురంగని నిరంతరం స్మరిస్తూ వుంటాడు

గురువు కాషాయవస్త్రాల్ని ధరించి మెడలో రుద్రాక్షమాలను ధరించి గోచి పంచె కట్టి తాళాలు చేతపట్టుకొని కాళ్లకు గజ్జెలు కట్టుకొని నడుముకు గడ్డకట్టుకొని వుంటాడు నుదుట బండారు బొట్టుపెట్టుకొంటారు

ఈ నృత్యంలో చిన్నపిల్లలే ఎక్కువ పాల్గొంటారు. పిల్లలకు కాషాయ గుడ్డనునడుముకు కట్టించి పసుపుపచ్చని జెండాను మూరెడు పొడవు కర్రకు

కట్టించి కుడిచేతిలో పట్టిస్తారు కాళ్లకు గజ్జెలు కట్టించి బాలబాలికలు సుమారు ఇరవై మంది దాకా పాల్గొంటారు గురువు మధ్యలో వుంటూ ఒక్కొక్క భంగిమ చూపిస్తుండగా చుట్టూపిల్లలు వృత్తాకారంలో నిలబడి అవే భంగిమలు చేస్తారు ఉదాహరణకు చేతిని నడుముపై వుదేటట్లు గురువుచూపిస్తే వెంటనే పిల్లలంతా ఆ విధంగా చేస్తారు ఇలాంటివన్నీ ఎక్కువగా గురువే చూపిస్తాడు

## నేర్పే పద్ధతి

పల్లెలో బాలబాలికల్ని ప్రోగుచేసుకొని రాత్రి సమయంలో ఆరుబయట వెన్నెల్లో రెండు మూడు నెలలు నేర్పిస్తాడు ఒక్కొక్కరి దగ్గర కొంత డబ్బును వసూలు చేసుకొంటారు పాటలు బాగా నేర్పించిన తర్వాత నృత్యశిక్షణ పూర్తి అయిన తర్వాత 'పండగ' దినం నృత్యాన్ని ఏర్పాటు చేస్తాడు ఆ శుభంశుభం తెలియని బాలబాలికలకు గురువు ఎంతో కష్టపడి నేర్పించిన ఆ నృత్యాని తిలకించటానికి తల్లి తండ్రులతో ఎంతో సంబరంతో చేరతారు పిల్లల్ని ఇంటిదగ్గరే బాగ ముస్తాబుచేసి పంపిస్తారు పిల్లలు వస్తూ తల్లిదండ్రుల కాళ్లకు మొక్కి వస్తారు ఇది నృత్య శిక్షణలో నేర్చుకొన్న భంగిమ తర్వాత గురువు కాళ్లకు మొక్కి చుట్టూరా పిల్లలంతా నిలబడతారు

పండరి భజనలో ఉపయోగించే వాద్యాలలో కంచుతో చేసిన తాళాలు, (ఇనుముతో చేసినవి) ఇటీవల హార్మోనియం, తబలా కూడా వాడుతున్నారు.

గురువు మొదటిగా తాళాన్ని కొద్దిసేపు కొడతాడు అంతలోపుగ పిల్లలంతా కెండాను చేతపట్టుకొని గురువు చుట్టూ నిలబడతారు. తాళం గతులు ఇలా ఉంటాయి.

త - తక
త - తక
తకతక
తకిట
తా - కిట
తకిట
తకిట
తకిట్"

తర్వాత పిల్లలంతా గురువు దగ్గరికెళ్ళి వరుసగా తాంబూలమిచ్చి కాళ్ళకు మొక్కి అదే స్థానాల్లో నిలబడతారు పిల్లల తలిదండ్రులకు గురువుకు (కొత్త) బట్టలు పెడతారు గురువు పిల్లల్నే గుండ్రాకారంగా ఎవరెవర్ని ఎలా నిలబెట్టాలో చూసి కన్నుసైగలతో సరిచేస్తాడు మొదటిగా కుడిచేతిలో జెండాను పట్టుకొని నడుముపై ఎడమ చేతిని వుంచుకొనేలా నిలబెడతాడు గురువు మొదటిగా మనసులో తనకు నృత్యాన్ని నేర్పించిన గురువు పేరుని స్మరించుకొని తాళాలు కొడతాడు

నృత్యం మొదలు పెట్టేముందుగా గ్రామంలోని అన్నిదేవతల పేర్లను చెప్తాడు అపుడు పిల్లలంతా 'జై' అంటారు జై అనిచెప్పే సమయంలో కుడిచేతిలోని జెండాను పైకెత్తి ఎడమకాలిని నేలపైకొడతారు శరీరమంతా అలా ఊగుతుంది. ఇది మొదటి భంగిమ మొట్టమొదటిగా గురువు 'శ్రీ మద్ రమారమ గోవిందా హరి" అని గట్టిగా పిల్లలంతా శృతి కలువుతారు తాళం బిరబిరా 'తక తక' గతిలో కొడతాడు

తర్వాత కొందరి దేవుళ్ళపేర్లు చెపుతుండాగా పిల్లలు 'జై' అని అంటూ వుంటారు గురువు మధ్యలో అటూ ఇటూ తిరుగుతూ పిల్లల్ని కళ్ళ సైగలతో నృత్యం చేపిస్తూ ఉంటాడు

శ్రీ పండరి పాండురంగసామికి -జై
శ్రీ కదిరి నరసిమ్మసామికి -జై
శ్రీ కసాపురం ఆంజనేయసామికి -జై
శ్రీ గండివాంజనేయస్వామికి -జై
శ్రీ గంగాభవాని పాదారవిందములకు -జై
శ్రీ తిరపతి వెంకటేశ్వరస్వామికి -జై
శ్రీ భక్తతుకారామునకు -జై
శ్రీ పండరిభక్త పాదధూళికి -జై

పై మాటల్లో "జై" అక్షరాన్ని బాలబాలికలు లయాత్మకంగా అంటారు. అలాంటి సమయంలో కుడికాలును మునివేళ్ళ సహాయంతో నేలపై కొడుతూ జెండాను పైకెత్తి నడుముపై ఎడమ చేతినుంచి వయ్యారంగా శరీరాన్ని కదిలిస్తారు. గురువు తాళాన్ని బిరబిరా వాయిస్తాడు-

త - త - కిట
త తకిట
తా - కిట
తకిట

తర్వాత భజన ప్రారంభమవుతుంది. తాళం "తా-తకిట" అనే గతిలో కొడుతుండగా, గురువు ఒక్కొక్క భంగిమ చూపిస్తాడు, మధ్యలో నడుములు వంచి కుడికాలును ఒకసారి, ఎడమ కాలునొకసారి నేలపై కొట్టటం దానికనుగుణంగా పిల్లలు భంగిమను తెల్సుకొని మసలుకొంటారు. గణేశ్వర ప్రార్థనతో భజన మొదలుపెడతారు. గేయంలోని ప్రతిచరణాన్ని గురువు పాడుతుండగా పిల్లలు వంతపాడతారు. చేతిలోని జెండాను ఒక్కొక్కసారి కదిలిస్తూ, నడుంమీద చేతిని వయ్యారంగా త్రిప్పుతూ, నడుంమీదనే వుంచుకొంటారు. కాళ్ళను పైకెత్తి 'మెడిమ'లు అందరూ ఒక్కసారి నేలమీద కొడతారు. కాలిగజ్జెలు గల్లుమంటాయి. నడుము కదలించి వంచుతారు. తర్వాత ఒక్కొక్క కాలును నేలమీద కొడతారు.

శరణు శరణు శరణు యిగ్నేశ్వర శరణు
శరణు శరణు శరణు చేసేదమయ్యా
శివుని ముద్దుల తనయ గనమూగ నీపూజ
గడిపె యిగ్నేశ్వర మారేడు నేరేడు
మల్లెపుష్పాముతో చాలాగా
నీపూజ సలిపేము విగ్నేశ్వర "శరణు"

గందము కింతవె కర్పూర ఆరతులు
గనమూగ టెంకాయలేరా గనమైన కుడుములె
గనమూగ నీపూజ గడిపేము విగ్నేశ్వరా "శరణు"

గేయం పాడిన వెంటనే నృత్యాన్ని నిలపడానికి ముందుగా కొన్ని లయాత్మకమైన మాటలుంటాయి. అపుడు నృత్యం విరవిరా సాగుతుంది. తాళం 'తకిట తకిట' గతిలో కొడుతూ గురువు కొన్ని మాటలు అంటుండగా పిల్లలు ఆ మాటలకు సమాధానంగా మాటలంటారు.

| గురువు | పిల్లలు |
| --- | --- |
| విట్టల్ విట్టల్ | జై జై విట్టల్ |
| పాండురంగ విట్టల్ | పండరినాథ విట్టల్ |
| గోవిందమ్ | హరిగోవిందమ్ |
| ఆనందమ్ | బ్రహ్మానందమ్ |

పై విధంగా అనే సమయంలో నృత్యం నడుంమీద చేతిని, జెండా పట్టు కొన్న చేతిని అలాగే వుంచి ఒక్కొక్క కాలిని వెనక్కి ముందుకి జరుపుతూ నేలపై కొడుతూ గుండ్రాకారంగా తిరుగుతారు. నృత్యాన్ని నిలపడానికి "హరి-హరి-హరి" అని గురువు అంటాడు.

మొదటి సారిగా 'హరి' అన్నపుడు కుడికాలు వేళ్లను ఎడమకాలుకు దాటవేసి నేలమీద కొండతారు (కత్తెరలాగా) రెండవసారి 'హరి' అన్నపుడు కాలిని యదాస్థానానికి తెచ్చుకొని నేలమీద కొడతారు మూడవసారి 'హరి' అన్నపుడు నేలమీద కొడుతూ నిశ్చలంగా నిలబడతారు ఈ అడుగులన్నీ గురువు 'హరి-హరి-హరి' అని బిరబిరా అంటూనే పిల్లలు పై అడుగులు వేసి నృత్యం నిలుపు దల చేస్తారు. ఇలా ప్రతిగేయాంపూర్తి కాగానే 'హరి-హరి-హరి' - అనే మాటలు అయిపోగానే ఎవరిస్థానాల్లో వారు నిశ్శబ్దంగా నిలబడతారు వెంటనే గురువు తాళాన్ని 'తా-తకిట' అనే గతిలో కొడుతూ మరోగేయాన్ని ఎత్తుకొంటూ భంగిమ చూపిస్తాడు గేయంలోని అర్థానికనుగుణంగా నృత్యం ఉంటుంది. గోపికలాగా ఈక్రింది గేయంలో పిల్లలంతా అభినయిస్తారు ఒకరిని శ్రీకృష్ణునిగా అలంకరించి మధ్యలో నిలబెడతారు.

ఒక్కొక్క గేయంలో సగంపాడిన వెంటనే 'చలో-అహా' అనే మాటల వల్లా గేయాన్ని బిరబిరా పాడటం, 'పల్లవి' ని ఎత్తుకోవటం ఉంటుంది ఇలాంటి సమయంలో నెత్తిమీద నీటితో నింపిన సీసానుగాని గ్లాసు (లోటా) కానీ వుంచు కొని అడుగులువేస్తారు అపుడు జెండానుపయోగించరు. రెండుచేతుల్ని అలా చాపి నెత్తిమీదనున్న సీసా పడిపోకుండా అడుగులు వేస్తూ కూర్చొంటూ, పైకిలేస్తూ నిదానంగా గుండ్రాకారంగ తిరుగుతారు తాళం మార్పుతో (తకిట తకిట) బిర బిరా అడుతూ పల్లవిని మాత్రమే పిల్లలు పాడుతూ ఒక్కొక్క కాలిని నేలపై కొడుతూ గుండ్రాకారంగ తిరుగుతారు. పిల్లలంతా ఒకేసారి కింద కూర్చొని

లేవటంతో పల్లవిని పాడుతారు ఇదొక భంగిమ ఒక్కొక్క కాలిని ఒక్కొక్క సారి కొడుతూ మార్చుకొంటూ పోవటం ఈ పాటలో ప్రత్యేకత పల్లవిని మాత్రము క్రింద కూర్చొని లేచే సమయంలో పాడుతారు అపుడు 'ఆహా-చలో' అనే మాటలు కరెక్టుగా గురువు అంటాడు

పురము చూడండీ పండిరి క్షేత్రము చూడండి ॥పు॥

మీరు పావనమైన చంద్రాభాగతీరము చూడండీ
మీరు పురము నామదేవుని జ్ఞానదేవుని నమ్మి కొలవండి
మీరు ముందుగయా తుకారాముని అండచేరండి ॥పు॥

తల్లిచంద్రుడం పూజలుచేసిన తండ్రిని చూడండీ
మీరు సర్వ త్యాగియైన చొకయేశ్వని చూడండి ॥పు॥
మీరు పరమ అత్తమామల సేవలు చేసిన తల్లిని చూడండి
మీరు సత్యమైన సక్కూబాయి దేవిని చూడండి
మీరు ధరనిలో ధర్మవరము గ్రామము చూడండి
అందమైన బాలభక్తుల భజన చూడండి ॥పు॥

ఒక్కొక్కసారి నృత్యంలో పిల్లలంతా గొలుసు ఆకారంలో ఒక్కొసారి మెడమీద చేతులు వేసుకుని గుండ్రాకారంగా నిలబడి ఒక్కొక్క కాలిని నేలమీద కొడతారు వెనక్కి ముందుకి రావటం ఉంటుంది తాళం 'తకిట-తా-తకిట' గతిలో గురువు కొడుతుంటాడు. ఒక్కొక్క చరణాన్ని పాడినవెంటనే తాళాన్ని వేగం పెంచుతాడు. అపుడు గొలుసు ఆకారాన్ని తీసివేసి జెండాలలో నేలమీద కొట్టే అడుగులు వెనక్కి ముందుకి వేసె అడుగుల వేగాన్ని తాళానికనుగుణంగా వేస్తారు. ఇలా ప్రతిచరణం పూర్తిఅవగానే నిదానంగా కొద్దిసేపు ఆడుతూ పాడుతారు.

భజనెల్లిపోతున్నదే రంగని
ధ్వజమెల్లి పోతున్నదే
భజనెల్లి పోతున్నది
బత్తూలతో గూడి బజనెల్లి పోతున్నది ॥భజ॥

బక్తాబృందాముతోటి బజనెల్లి పోతున్నది
బజనే గంభీరమయ్యె సరంగని భజనే ॥భజ॥

ఆనందమయ్య
రంగడే సుంగారుడయ్య
రంగని సూచన సాలువయ్య
సేవింప వలెగాని యెన్ని సెప్పిన తీరదయా ॥భజ॥

ఈ నృత్యంలో యశోద-గోపికలు - శ్రీకృష్ణుడు మనకు కన్పిస్తారు పిల్లలందర్ని గుండ్రాకారంగా నిలబెట్టి వారిలో కొంతమందిని యశోద-గోపికలు శ్రీకృష్ణునిలాగా అలంకరించి, వారి మధ్యలో నిలబడతారు గురువు పాటపాడు తుండగా పాటకనుగుణంగా ఆ పాత్రధారులు నృత్యంచేస్తారు కిందిగేయంలో గోపాలకృష్ణున్ని గోపికలు ఎలా బతిమాలుతున్నారో చూడండి

## 1. యశోదా శ్రీకృష్ణ గోపికల నృత్యం

గోపికలంతా చేతులూపుతూ పయ్యాకంగా అడుగులు వేసుకొంటూ, శ్రీకృష్ణుని దగ్గరకెళ్ళిరెండు చేతులెత్తి మొక్కుతూ పాటకనుగుణంగా అభినయి స్తారు శ్రీకృష్ణుడు వారి మాటలు పట్టించుకోకుండా తిరుగుతూ ఉంటాడు అలాంటి పాట

గొల్లవారి నల్లసామిగా గోపాలకిట్న
యిల్లు యిల్లు తిరగ వాకుమా
వారుపోతే దారికడ్డము పోకుమా
గొపాలకిట్న యిల్లు యిల్లు తిరగమాకుమా
తల్లితండ్రి నీవేనని నమ్మియున్న వారము
యిడిచి పెట్టి పోవాకుమా
గోపాలకిట్నయిల్లు యిల్లు తిరగవాకుమా
జగమంత యేలినావు గోపాలబాలుడవు
గోవులమేపుచుండు మా గోపాలకిట్న
యిల్లు యిల్లు తిరగవాకుమా"

"బత్తూల పాలిదేవుడా పండారిలోన
దేవుడవై వెలసినావురా
విట్టాలరాయుడని విరోచదేవుడవని

యేనుగానలోలుడాని వన్నెకెక్కిన దేవుడాని
వక్కపాషని గాచివావురా బత్తాలపాలి
బాందవుడప్ప వెలసినావురా
గోకూల వాసుడైన గోవిందారాయుడా
రంగరంగ నిన్నే నిమ్మితి
యేనాటికైన రంగ నీ పాదమేగతి
సారసాంక నిన్ను సన్నుతింపక వళముకాదు
సమయమిదే కాపాడరావయ్య శ్రీ పాండురంగ

పండరి భజనలో 'కృష్ణలీలలు' చాల ముఖ్యం (యశోద - గోపికలు శ్రీకృష్ణుడు) శ్రీకృష్ణుడు చీరలు దొంగలించటం, గోపికలు బంగపోవటం ఇద్దరి మధ్య సంవాదం. ఈ సంవాదం గోపికలోకసారి పాడుతూ శ్రీకృష్ణుని దగ్గరిగా వెళ్ళుతుండగా అతడు పరుగెత్తుతు గుండ్రాకారంగా వుండే పిల్లల చూట్టూ తిరుగు తాడు మరలా గురువు ప్రతిపాదాన్ని పాడినవెంటనే వేషదారులుగా ఉండే బాలబాలికలు వంతపాడుతూ అభినయిస్తారు తర్వాత యశోద పాత్రధారి దగ్గరికి గోపికలంతా వెళ్ళి కృష్ణుని చిలిపి చేష్టలు తెలియచేయటం ఆమె శ్రీకృష్ణున్ని చెవి పట్టుకొని వేలిని చూపిస్తు భయపెట్టటం ఈ భంగిమలన్నీ గురువు పాడిన పాట కనుగుణంగా పాత్రధారులు అభినయిస్తూ వుంటారు ఈ నృత్యభంగిమ అందర్ని ఆకట్టుకొంటుంది

గల్లుగల్లాన రా గల్లుగల్లానరా గంతులిడరా నందకుమారా
జగదేకమోహన గోపకిచోర
మన్నేల తింటివోయి మా సిన్ని కన్నయ్య
నిన్నేమినందునో మా మంచి కృస్నయ్య
పొరుగిండ్లకేల పోతివిరా అల్లరివాడ
నెమ్మోము వాడిపోయెనిక ఇంటికీ రావా
నామాటలినవా మరినీ యాటమానవా
యిక లాలిపోసుకొందువురా బాలగోపాలా
యినరా యినరా జగదేహమోహన గోపకిసోరా

అలా వచ్చిన కృష్ణునికి యశోద ఎంతచప్పినా వినలేదు ఎక్కడో

స్నానం చేస్తున్న గోపికల సీరల్ని దొంగలించి పట్టేక్కాడు పాపం గోపికలు అతనితో ఏమంటున్నారో తెలిపే గేయం-

గోపి శ్రీలోల జాలియేల చేసెదమ గోపబాల
సీరలిచ్చి సెట్టుదిగవయ్యా గోపాలా
బాలసీరలిచ్చి చెట్టుదిగవయ్యా

కృ శ్రీలోల జాలియేల చేసితివి గోపిబాల
సీరలివ్వను సెట్టుదిగనే వో బామలార
సీరలివ్వను సెట్టుదిగనూ

గో కమ్మలిత్తాము కడియాలిత్తాము
కమ్మని పాలుపెరుగులిత్తాము
సీరలిచ్చి సెట్టుదిగవయ్యా గోపాలబాల

కృ కమ్మలొద్దే కడియాలొద్దే
కమ్మనిపాలుపెరుగులొద్దే
సీరలివ్వనే సెట్టుదిగనే వో బామలారా

గో. ఆవులిత్తాము గోవులిత్తాము
అద్దాల మాడలిత్తాము
సీరలిచ్చి సెట్టుదిగవయ్యా
యశోద తనయా సీరలిచ్చి సెట్టుదిగవయ్యా

కృ. అవులొద్దే గోవులొద్దే
అద్దాలమాడలొద్దే
సీరలివ్వను సెట్టుదిగను
వో బామలార సీరలివ్వనే చెట్టుదిగనే

య. యేరా గోపాలకిట్నా యింటిదగ్గరనుండి
యిటుయేల వచ్చినావురా తుంటారి కిట్నా
యిటు యేల వచ్చినావురా

కృ. అదియను నన్నుపిలిసె యిదియును ముద్దుపెట్టె
అదియునుకన్నుకొట్టె వో యశోదమ్మా
యిదియును రమ్మాని పిలిచెనే

య ఔరా నా ముద్దుల కిట్నా రమ్మా గోపాలకిట్నా
వలపుల నించుచు చెలువముగించుచు
ఔరా తేనియలొలికెడు తియ్యని పలుకుల
మరువక ముద్దున నొసగు తనయా
ఔరా నా ముద్దులకిట్నా మౌక్తికాహారాలు
బొజ్జపై వెలయగ మురిపెములనించెడి
రాజగోపాలకిట్న ఔరా నా ముద్దులకిట్నా

గో గొల్లవారి వాడలకు కిట్నమూరితి
నీకువేమి పని యున్నదయ్య సిన్నిమాదవ

కృ. గొల్లవారి వాడలకే గొల్లబామ
గోవులకొరకు వచ్చినానె పల్లవాదరి

గో. కిట్నా కొత్తాకోడండ్లమయ్యా కిట్నమూరితి
మా యత్తమామనడుగవయ్యా సిన్నిమాదవా

కృ బామా కొత్త కోడలివైతే గొల్లబామ
నేరాక్కమిత్త పాలుపొయ్యే పల్లవాదరి

గో యిట్టిమాటలాడితేను కిట్నమూరితి
రోటకట్టివేచి కొట్టుతాము సిన్నిమాదవా

కృ: బామా యిట్టిమాటలాడకుండ గొల్లబామా
నాకు మనసునిలువదేమి చేతు పల్లవాదరి

గో: ఓ యశోదయేమి చేయుదుమే నీ దుదుకులాకు
ఓ యశోదయేమి చేయుదుమే నిన్న సందకాడ సిన్ని
జిల్కాంటులాడె యెన్నదొచ్చి యెత్తుకొని యెల్లెగదమ్మ
కన్నెరో యీ అన్యాయము యెన్నడూ మే మెరుగమ్మా
చిన్నెలన్ని చెప్పబోతే యెన్నెన్నో కలుగునమ్మా
ఓ యశోద మెల్లమెల్లగాను రేపల్లెలోన వచ్చినాడు
గొల్లపాల చల్లలన్ని కొల్లబెట్టినే
వలపాపములు మావారితోను చెపబోతే

మల్లవాడు కౌగిలించి ముద్దుబెట్టి వెళ్లెనమ్మా
ఓ యశోద అద్దరాతిరి వేలమ్మా మిద్దెలెక్కి వచ్చినాడు
దొడ్డిగోడకాడి కొచ్చి తొంగిచూచెనే
చిలుకుతున్న పాలుయన్న పుట్టిమీదయెబెట్టి
నీతో చెప్పవలెనని మేము యీడికొచ్చినాము
ఓ యశోద యిట్లనైన కాపురమిట్లు చేస్తుమమ్మా
మేము పట్టిదండించుకొంచెంపాపమేమమ్మా
ఓ యశోదమ్మా నీవే తెల్పగదవమ్మా

య కిట్నా కిట్నా ట్టమి దినాన పుట్టిదుష్టుల నమ్మరింప
నిదుకుకు తనముంకు మాను నినుబూసికి పట్టించేనా

కృ : అమ్మా ఆ బూసెట్లుండునమ్మా నేదమైనపుదొమ్మా
లేకపెద్ద గంగమ్మా వాని రూపెట్లుండునోయమ్మా
నాకు దాచిపెట్టక చెప్పావమ్మా

య కిట్నా బల్ పొక్కినోటివాడు పండ్లు యిగిలించుకొన్నాడు
గోరులు పెంచినాడు నామాలు పెట్టినాడు
నల్లాని బూచివాడు నిసుపట్టుకొనేవాడు
నిన్నిడిచిపెట్టిపోలేదు

కృ అమ్మా అపన్న చెట్టుమీద మాగోసిక చీరలాను
నేనపకరించి తెచ్చాను నేనెవరిండ్లకు పోనమ్మా
నన్నుకొట్టవద్దు మాయమ్మ నన్ను తిట్టవద్దు మాయమ్మా

య కిట్నా నీవెవరిండ్లకు పోకుంటే చల్లానిలాల పోసేను
సొమ్ములు పెట్టేను పువ్వాలు వాడిన కట్టేను
కొండకి నూలు చుట్టేను నిన్నుంచి తొట్లలోన
నీకు మంగల ఆరతునిచ్చేను

కృ అమ్మా యిటు బంగారు బండివాకియవే
బండినియ్యావే గుర్రంబునీయవె
యక్కేను తొక్కేను లక్ లక్ లక్ లక్ అమ్మయిటూ

బంగారు టోపియు సొంపారు అంగీలు
దేరుందవై నందు సై సై సై సై సై

గో రేపల్లెవాడ రోజూన నీకు యేమి పనియున్నాదయ్యా కిట్నా
కిట్నా కిట్నా కిట్నా కిట్నారంగారంగా

కృ. మిమ్ములనే ప్రేమించినా నాపై కోపమికె దుకే రావే
రావేరావే రావే రావే గొల్లబామరావే

గో పాలుయన్న పెరుగునీకు రోజున మీకు తేలేమయ్యా
కిట్నా కిట్నాకిట్నా రంగా రంగా

కృ పాలుయన్న పోయక జోత్తే బానలు పగులగొట్టుతానే
రావే రావే రావే రావే గొల్లబామ రావె

గో యింటిదగ్గర పెద్దవారితో మాకు మాటవత్తాదయ్యా
కిట్నా కిట్నా కిట్నా రంగ రంగా

కృ. యింటిదగ్గర మూటలొత్తే యిప్పుడేరావే పోదామూ
రావే రావే రావే గొల్లబామ రావే

గో. రానుపోరాగొల్లోడా రాతిరికి నల్లోడా
రానుపోను గొల్లోడా నన్ను ముట్టమాకురా
నామాలు గొల్లవాడ శఖ్ఖాసు గొల్లోడా
చెయిసైగ చేసేవు రానుపోరా గొల్లోడా
నన్ను నీ వెరుగవు నిన్ను నేనెరుగను
కనిబూసి నన్ను పట్టితే కార్యము చెడిపోనురా
నిండు పున్నమినాడు పండువెన్నెలలోన
పరపూర తొట్టిలో పండియుండినవాడ

య : మన్న తినవాకురా తనయా నా మాట యినరా
బంగారుగిన్నెల్లోన పంచపచ్చపరమాన్నము
పెడితే తినవు మన్న తినవాకురా తనయ్యా
పాదరపేడ మైసూరపాకు పాలుకోవ
పరివేబిల్జల్ పచ్చిదాచ్చి పండునీకు

జాలకిట్న తెచ్చిపెడితె తినవేమిరా
చెప్పినమాట యినవేరా యిట్లనైతే రోలుకట్టి
వేతునిన్ను సిన్ని కిట్నా మన్ను తినమాకురా

చివరిగా మంగళం పాటతో నృత్యాన్ని నిలిపివేస్తారు. మంగళం పాటకు అడుగులు నిదానంగా ఉంటాయి కుడిచేతిలోని జెండాను పైకెత్తుతూ ఎడమ చేతిని నడుములమీద నుంచుకొని వయ్యారంగా శరీరాన్ని కదిలిస్తూ అడుగు మార్చుకొంటూ గుండ్రాకారంగా తిరుగుతారు. తాళం 'తా-తకిట' గతిలో గురువు కొడుతు పాటపాడుతుండగా అందరు వంతపాడుతారు

జయరాదపతి మంగలంరంగ రాదపతి మంగలం
బీరాగము బోర శృంగారరగై కోర రంగా
అల్లారి బాలుదవు నీవెకాక కిట్న
నల్లాని దేవుడవు నీవే కదా రంగ
యేల ఊలా జాగేలా గోపాలరంగ
గోపాలరంగ పాండురంగపండరిపురిరంగా మంగలం

ఈ నృత్యంలో హిందీతో కూడిన గేయాన్ని కొందరు పాండురంగ భక్తులు రచనచేశారు అంతేగాక క్షేత్రాన్ని చూసి, తరించి భక్తి ఆవేశాలతో ఆ పండరి పాండురంగని పై అనేక గేయాలు రచన చేశారు[25]

నృత్యాన్ని చేస్తున్నపుడు బాలబాలికల వేషాలు చూస్తున్న ప్రేక్షకులు సంతోషంతో చూస్తుంటారు నృత్యం చేస్తున్నపుడు చూస్తున్నవారు సంతోషాన్ని పట్టలేక 'పూలమాలలు వేస్తూ రూపాయి రెండురూపయల నోట్లు వారి జెండాలకు తగిలిస్తూంటారు ఇంకా ఈలలు (ఓటీలు), కేకలు గంతులు వేస్తారు. కొద్ది మంది నృత్యం కూడా చేస్తుంటారు ఇంకా కొద్ది మంది కళారాధకులు నృత్యాన్ని నేర్పించినగురువు మెడలో పూలమాలలు కూడా వేస్తారు. కొత్తబట్టలు గ్రామస్తులంతా కలిసి గుట్టిస్తారు. నృత్య ప్రదర్శన రోజు గురువుకిచ్చి సత్కరిస్తారు.

## కళాకారులు

**గురువులు :**

ధర్మవరం వెంకట్రాముడు - వర్క్‌షాప్ - వెల్డింగ్ చేయటం ఈయన

పాండురంగస్వామిని దర్శించాడు ఉచితంగా ధర్మవరం ప్రాంతం పల్లెల్లో భజన' నేర్పుతూ, ఆడుతూ, పాడుతూ ఆ దేవదేవున్ని తలుస్తూ జీవితాన్ని సాగిస్తున్నాడు.

చిరునామా .

ధర్మవరం వెంకట్రాముడు
శ్రీ లక్ష్మి వెల్డింగ్ వర్క్‌షాప్,
దుర్గమ్మ గుడి దగ్గర,
ధర్మవరం, అనంతపురం జిల్లా

## 7. బయిల్నాటకం

జానపదులు బయట్లో (వీధిలో) ఆడే ఆటను బయిల్నాటకం అంటారు దీన్నే వీధినాటకం-బయిలాట - యక్షగానం అని అంటారు. చెంచు నాటకము అని మరో పేరుంది. జానపదులు ఎక్కువగా బయిల్నాటకం చెంచునాటకం అనే పేర్లతో పిలుస్తారు

గరుడాచల మహత్మ్యములోని ఇతివృత్తాన్ని పాటల్ని తీసుకొని జానపదులు ఈ నాటకాన్ని ఆడతారు. ఇందులో నాటకం, నృత్యం రెండు కలిసి ఉంటాయి తాళాలు, హార్మోనియం గజ్జెలు మాత్రమే వాడుతారు. ఈ నాటక నృత్యంలో వచ్చే పాత్రలు.

1. సిగి నాయకుడు
2. రంభ
3. ఊర్వశి
4. నరసింహ్మసామి
5. ఆదిలక్ష్మి
6. చెంచులక్ష్మి
7. ఎరుకలసాని (సింగి)
8. సింగడు
9. ద్వారాపాలకులు

జానపదులు తయారుచేసుకొన్న కిరీటాలు భుజకీరీటాలు ధరించి, పురుషులే స్త్రీ పాత్రలను ధరించి జడను తయారుచేసు కొంటారు ఇలా అన్ని పాత్రలు ధరించిన తర్వాత సన్నివేశం అయిపోగానే పాత్రధారులు అభినయించే పాత్రలకు వారిచుట్టూరా వుంటూ వంతపాడుతూ ఉంటారు అందరూ నిలబడి బయల్లోనే ఆడుతూ పాడుతూ ఉంటారు ప్రతి పాత్రధారి గుండ్రాకారంగ తిరగటం, చేతులను వయ్యారంగా త్రిప్పటం, కూర్చుని లేవటం వుంటుంది. నరసింహస్వామి పాత్రధారి ఠీవిగా రెండు చేతులను గాలిలో త్రిప్పుతూ, రౌద్రంగా అడుగులు వేస్తూ కళ్ళుపృగించి చూడటం అభినయిస్తారు నరసింహస్వామితో ఆదిలక్ష్మి చెంచులక్ష్మిల సంవాదం అతను ఏమితెలియని వానివలె ఉండటం చెంచులక్ష్మి విషయాన్ని ఎరుకలసాని (సింగి) ఆదిలక్ష్మికి చెప్పటం ముఖ్యమైన కథ ఇంకా సిగినాయకుని బిడ్డలుగా రంభ, ఊర్వశలు చిత్రీకరించారు దీంట్లో సింగి సింగడు సన్నివేశంలో పాడుకొనే రెండు గేయాల్ని పరిశీలించటం జరుగుతోంది.

సింగి, సింగని భార్య, ఇంటినుంచి వచ్చి సింగన్ని సింగి నిలదీసి ఇంటిని మేకల్ని, గాడిదలను ముసలిదాన్ని పిల్లలను వదలివచ్చావు అని అడగడం సింగడు వాటికి సమాధానంగా చమత్కారంతో చెప్పిన విషయాలు గమనించ దగ్గని సింగి సింగడు ఈ చెంచునాటకంలో ప్రధానం అంతేగాక ఈ నాటకానికి వూపిరి అలాంటి వారి సంభాషణ లోని రెండు పాటలిలా వున్నాయి. తాళం 'తకతక' వరుసతో కొడుతుండగా పాట సింగి-సింగడు పాడుతుంటే మిలిగిన పాత్రధారులు చుట్టూ నిలబడి వంతపాడుతారు.

సింగి   మేకలన్ని యాడయిడిచి
యెప్పుడొత్తెవిరా సింగా
నువ్వెప్పుడొత్తివిరా సింగా

సింగడు   మేకలన్ని కొండకుతోలి
కత్తెకొరకను కావలిపెట్టి
ఇప్పుడె వత్తినే సింగి
నే ఇప్పుడె వత్తినే సింగి

సింగి ' గాడుదలన్ని యాదతోలి
ఎప్పుడొత్తివిరా సింగానువు
ఎప్పుడొత్తవిరా సింగా

సింగడు గాడుదలన్ని గరకుక్కతోలి
తోలిరాజునుకావలిపెట్టి
ఇప్పుడె వత్తిని సింగినే
ఇప్పుడె వత్తిని సింగి

సింగి గుడిసెలన్ని యాదయిడిసి
ఎప్పుడొత్తివిరా సింగా నువు
ఎప్పుడొత్తివిరా సింగా

సింగడు గుడిసెలాకు అగ్గిపెట్టి
యలకరాజును కావలిపెట్టి
ఇప్పుడె వత్తిని సింగినే
ఇప్పుడె వత్తిని సింగి

సింగి ముసలిదాన్ని యాదయిడిసి
ఎప్పుడొత్తివిరా సింగా నువు
ఎప్పుడొత్తివిరా సింగా

సింగడు ముసలిదాన్ని గుంతలో యేసి
గుంతనక్కను కావలిపెట్టి
ఇప్పుడె వత్తిని సింగినే
ఇప్పుడె వత్తిని సింగి

సింగి పిల్లోల్లాను యాడయిడిసి
ఎప్పుడొత్తివిరా సింగానువ్వు
ఎప్పుడొత్తివిరా సింగా

సింగడు పిల్లోల్లాను బాయిలో వేసి
గాండ్రకప్పను గావలిపెట్టి
ఇప్పుడె వత్తిని సింగినే
ఇప్పుడె వత్తిని సింగి

సింగి . కొంగరెక్కలు యానబెట్టి
ఎప్పుడొత్తివిరా సింగా నువు
ఎప్పుడొత్తివిరా సింగా

సింగడు . కొంగరెక్కను బాయిలోవేసి
గొంగ్రకప్పను కావలిబెట్టి
ఇప్పుడె వత్తిని సింగినే
ఇప్పుడె వత్తిని సింగి

సింగడు కట్టుకొన్న పట్టుచీర
ఎటువలనా వచ్చానే సింగీ
ఎటువలనా వచ్చేనే

సింగి పూరిలోటి అమ్మగారికి
అడిగినట్లా గెద్దిసెప్పి
తెచ్చుకొన్న పట్టుచీరాకు
వాదులాలరా సింగా
గుద్దులాటేరా

సింగడు . ముక్కులోటి ముక్కురాయి
యట్లవచ్చానే సింగీ నీకు
యట్లవచ్చానే సింగీ

సింగి : కమసలింటికి నేనేబోతి
వప్పుగానే గెద్దిసెప్పి
తెచ్చుకొన్న సొమ్ములాకె
వాదులాటేరా సింగా
గుద్దు లాటేరా

సింగడు . నడుములోటి గెజ్జిలడావు
యట్లవచ్చానే సింగీ నీకు
యట్లవచ్చానే సింగి

సింగి పూరిలోటి అమ్మగార్లకు
వప్పినట్లుగెద్ది సెప్పి

తెచ్చుకొన్న సొమ్ములాకు
వాదులా చేరా సింగా
గుద్దులా చేరా

ఇక నరసింహుని పాత్రకు సంబంధించిన ఒక విషయం ప్రచారంలో వుంది తెల్లవార్లూ ఈ నాటక నృత్యాన్ని ప్రదర్శిస్తారు నరసింహుని పాత్రను ఇద్దరు వేయటం ఆచారం వీరిని 'సందకాడ నరసింహుడు, తెల్లవారు జామున నరసింహుడు' అని అంటారు సందకాడ నరసింహుడు ప్రదర్శిస్తు-డగ, అర్ధరాత్రి తర్వాత అలంకరణ చేసుకొన్న తెల్లవారుజామున నరసింహుడు ప్రక్కనే వున్న ఎరువు బండిపై నిదురపోయాడట ఇంతలో నాటకనృత్యాన్ని చూస్తున్న (ఆ బండి) రైతు తొందరగా ఎరువును తన చేలో వదలాలని బండి కట్టుకొని వెళ్ళి ఎరువును చేన్లో వదలాడు అపుడు బండిలో వున్న తెల్లవారు జామున నరసింహుడు మేల్కొని 'నాకథ వచ్చిందనుకొని అలాగే లేచె "వచ్చె చెంచతా చూడారే రే భళి వచ్చే చెంచీతా చూడారే" అంటూ పాడుతు ఆడుతున్నారట బండి రైతు భయపడి నాటకం ఆడే వారిదగ్గరకు రావటం చెప్పటం జరిగిందట ఇంతలోపుగానే అతని కోసం వెతకివెతకి సందకాడ నరసింహునితోనే తెల్లవారేసరకు నాటకనృత్యాన్ని ప్రదర్శించారట ఇది ఈనాటికి పెద్దలు అనుకొంటూ నవ్వుకొంటూ వుంటారు

ఇలాంటి నాటకాలు పండగల్లోనూ జాతర సమయాల్లోనూ గ్రామస్థులు ఏర్పాటు చేస్తారు. వారికి అయ్యే ఖర్చులు భరిస్తే ఆడతారు.

**కళాకారులు:**

సిగినాయకుడు - మాల చంద్రప్ప - 55 సం లు
రంభ - కుమ్మరి నారాయణ - 25 సం లు
ఊర్వశి - చాకలి గంగన్న - 25 సం లు
నరసింహస్వామి - కుమ్మరి నారాయణస్వామి - 45 సం లు
ఆదిలక్ష్మి - హరిజన నాగన్న - 35 సం లు
చెంచులక్ష్మి - మాలనాగప్ప - 50 సం లు

ఎరుకలసాని (సింగి) - కుమ్మరి నారాయణ - 38 సం లు
సింగడు - కుమ్మరి నారాయణస్వామి - 25 సం లు

చిరునామా

**జానపద యువకళాకారుల సంఘం**

సుబ్బరాపుపేట,

ధర్మవరం తాలూకా, అనంతపురం జిల్లా



# 2. వ్యష్టి నృత్యాలు

## 1. జ్యోతి నృత్యం

తొగట వంశస్థులు (నేసేకులం) ఆట పైభక్తితో తయారు చేసిన 'జ్యోతిని' వెలిగించి చౌడమ్మదేవతను వర్ణించే పాటల కనుగుణంగా చేసే నృత్యం జ్యోతి నృత్యం' దీన్ని పల్లెల్లో "జ్యోతులు బోనాం" అని అంటారు ఈ నృత్యాన్ని ఏడాదికొకమారు మాత్రమే కులవృత్తి పరంగా చేస్తున్నారు నేసేకులస్థులంతా ఏకమై, ధనమో పణమో వసూలు చేసి 'నృత్యాన్ని' చేస్తారు

ఈ నృత్యానికి కంచుతో చేసిన తాళాలు చేతుల చప్పట్లు ఉంటాయి వీటి కనుగుణంగా పాటకనుగుణంగా పాటననుసరించి తాళగతిని మార్పుచేస్తూ వుంటారు పాటలన్నీ చౌడమ్మపైన, శివునిపై ఉంటాయి

### 1. జ్యోతిని తయారుచేసే విధానం

ఉరిబయట ఆవుపేడతో అలికి ఒకరు స్నానంచేసి 'ఒక్కపొద్దు' వుండి జ్యోతిని తయారు చేస్తారు గోదుమపిండిని ముద్దలాగా కలిపి మధ్యలో కొత్తగుడ్డ నుంచి (మైనపువత్తిలాగా) జ్యోతిని తయారుచేస్తారు క్రింద భాగాన వెడల్పుగా నెత్తిపై నుంచుకోవటానికి వీలుగా చేస్తారు. పైభాగంలో వత్తికి నెయ్యిపోయటానికి వీలుగా తయారుచేస్తారు వత్తిని వెలిగిస్తారు రతి[26] పోసిన తర్వాత జ్యోతిని దానిపై వుంచి పూజచేస్తారు తర్వాత జ్యోతిని వంశపారం పర్యంగ నెత్తినెత్తు కొనే వారు మొదటిగా బాయిలో మునిగి లేదా బిందెలతో నెత్తిన నీళ్ళుపోసిన తర్వాత జ్యోతినెత్తుకొంటారు తర్వాత ఎవరైనా ఎత్తుకోవచ్చు కాళ్ళకు గజ్జెలు కట్టుకొని, యర్రటిగుడ్డను నడుముకు అడ్డగుడ్డలాగ కట్టుకొంటారు వుత్తపయ్యి తో (ఒట్టి శరీరం) వుంటారు మెడలో కొన్ని హారాలు వస్తారు నుదుట బండారు బొట్టు పెట్టుకొంటారు అలా జ్యోతిని ఎత్తుకొని వుండగా ఆ జ్యోతి చుట్టూ గుండ్రాకారంగా జనమంతా నిలబడతారు వీరిలో కొద్దిమంది తాళాలు పట్టుకొని ఉంటారు అందరూ గుండ్రాకారంగా తిరుగుతూ పాటలుపాడుతారు ఒకరుపాట

పాడుతుండగా మిగిలిన వారంతా వంతపాడతారు జ్యోతినెత్తుకొన్న వ్యక్తి పాటకనుగుణంగా అడుగులు వేస్తుంటారు జ్యోతులు రెండులేదా మూడు కూడ ఉంటాయి అల నడిబజార్లో జ్యోతి నృత్యం చేస్తువస్తుండగా ఆ జ్యోతికి బలి ఇస్తూ ఉంటారు

జ్యోతిని తలపై నుంచుకొని రెండు చేతులు వదలిపెట్టి గిర్రున తిరగటం, ఒక చేతిని నడుంపై నుంచి ఇంకోచేతిని గాలిలో వూపుతూ గిర్రున తిరగటం, నేలపై కూర్చొని లేవటం-పాటలోని వస్తువునాధారంగా చేతులనూపటం జ్యోతినెత్తి కొన్నవారు చేసే భంగిమలు

తాళాలు పాటకనుగుణంగా కొడుతుంటారు అలాగే చప్పట్లు కూడ కొడ్తారు మొదటిగా తాళాన్ని ఇలావాయిస్తారు.

తక తక తక
తక తక తక
తక తక తక

తర్వాత పాట ఎత్తుకొంటూనే గతిని మార్చి పాటకనుగుణమైన గతిని ఎన్నుకొంటూ ఇలా వాయిస్తాడు

తక తక తక్
తక తక తక్
తక తక తక్

పై తాళగతికనుగుణంగా తాళాలు లేనివారంతా రెండుచేతుల్ని మూడు సార్లు చప్పట్లు కొడుతూ ఒక్కొక్క అడుగుముందుకి వెనక్కివేస్తూ గుండ్రటాకారంగా తిరుగుతారు

మొదటిగా విఘ్నేశ్వరుని ప్రార్థనతో నృత్యం మొదలవుతుంది జ్యోతి నెత్తుకొనే వ్యక్తి తలస్నానంచేసి వస్తాడు. తలపై జ్యోతినెత్తుకొన దాన్ని పట్టుకోకుండా రెండు చేతులను చాపి గాలిలో అలాఅలా త్రిప్పుతూ కాళ్ళను మునివేళ్ళపై నిలిపి నేలపైకొడుతూ గుండ్రాకారంగ తిరుగుతూ వుంటాడు అపుడు గిర్రున తిరగటం. చూడముచ్చటగా వుంటుంది నేలపై పొర్లుతూ వుండటం చూడగగ్గది జ్యోతి అలాంటి సమయంలో క్రింద పడితే ఆ ఏడు పంటలు బాగా

పండవని జానపదులు భయపడతారు అందుకు మరో జ్యోతిని తయారుచేసుకొని నృత్యంచేస్తూ చౌడమ్మ గుడిదగ్గరకు వస్తారు

విఘ్నేశ్వరుని ప్రార్థనా గేయంతో నృత్యం ప్రారంభమవుతాయి

తాళగతులు - తక తక తక్
తక తక తక్
తక తక కక్

ఒకరు జ్యోతిని ఎత్తుకొని నట్టనడుమ నిలబడి పాటకనుగుణంగా చుట్టూ గుండ్రాకారంగా నిలబడి వున్నవారంతా అడుగులు మారుస్తూ తిరుగుతారు పాట ఇలా మొదలవుతుంది

పార్వతీ పుత్రుడు పరమేశ్వరుని సూడ
ఎలుక వాహన మెక్కి వేళ్ళేతనవేడ్క
అమరంగ బెనకయ్యను ఆత్మలో తలచేరు
సంతోషమున కల్గుసకల జనులకును
హర హర మిమ్ము దలకు వారుని పుత్రుండు
నకల విద్యల గురువు స్వామి గననాత
నేలి విద్యల గురువు గననాత "హర హర"

విష్ణుబ్రహ్మదేవుదేశ్వరుడు మొదలుకొని
మదిలోన బెనకయ్యను మదిలోనదలచేరు
సర్వనలములలోను సాధించె త్రిపురాలు
కైలాస వాసుడై కార్యనవెలసే "హర హర"

వేదశాస్త్రములందు ఎంచేర బెనకయ్యను
మోదముతో సిద్ధులేమ్రొక్కి కొలువంగ
సంగీత సాహిత్య సకలవిద్యల కెల్ల
రవికోటి తేజుడే రాజు బెనకయ్య "హర హర"

ఎన్నకల దేవతలు బెనకయ్యను దలచేరు
వ్యాస వాల్మీకులే బెనకయ్యను దలచేరు

భక్తితో బెంకయ్యను భావంటుననుతలచ
కలిగె వైభాగ్యములు కంకారమెల్ల
సప్త మహాఋషులకే స్వామిగననాత "హర హర"
కురుచనీ పాదములు గుజ్జు రూపము బొజ్జ
ఏకదంతముకోడ ఏనుగరూపు
కావించె గుజ్జు బు సర్వయ్యమునలోనా
గౌరమ్మనీ కొడుకు కరుణతో నిలిచె "హర హర"[27]

ఇంకొపాటలో చౌడమ్మ కదిలే దృశ్యాన్ని కళ్ళకు కట్టినట్టు పాట బిరబిరా సాగుతుంది నృత్యం అడుగులు బిరాబిరా వేయటం గుండ్రంగా తిరగటం జ్యోతినెత్తికొన్న వ్యక్తి గిర్రున తిరుగుతూ అడుగు ముందుకు వేస్తూ కళ్ళప్పగించి చౌడమ్మలాగా కనిపిస్తాడు తాళం ఇలా వాయిస్తూ పాటపాడుతారు

తక తక్
తక తక్
తక తక్

కదిలెను చౌడమయ్యత తోడను గాంభీర్యనాదములాతో
గొడుగులు పడిగెలుగో రాళంఖాలు యింతటసిద్ధులు యిరుజడలు
ఠంతులునే మగరాడుచౌడమ రానువు కదలిను రమ్యముతో
ఎప్పుడు మనకు యిచ్చిన వరములు యేకొదువాలేదు
తప్పక కొలువండి ధారునిలోపుల దైవంబనలే చౌడమ్మ
నులదైవం బనరే చౌడమ్మ "ఎప్పుడు మనకు"
బాకులు మొలనా బల్లెపుసీటెలు మూకలుగూడుకయేకముగా
మేటికదుపుల మెగాల కెల్లిసోపట బెట్టిరిసోద్యముగ
పరమేశుని కల్యానదుమ పట్టిరి కొట్టిరి బలిమితిమెగాల
చొచ్చిరి పీరుల చౌడమ నగరికి తెలివితో కొలువండి ప్రజలారా
పంచను జ్యోతులు పరంజ్యోతులై బాగుగదుదు వసుమల్లయ్యకు
ఎక్కువైనదో పీరాజాజులు యిచ్చెద వలయ్యపీరులకూ
స్వామీ యేలినగుర్రము సరువయ స్వామిదేవర సాలీలును
సీమాతాగట ప్రజలందరు గూడి శివాలక్ష్మని కొలువండి మహాలక్ష్మని
కొలవండి[28]

ఇంకో గేయంలో పల్లవితో నృత్యానికి కొంత బాగు వూపు వస్తుంది జ్యోతి నెత్తుకొన్న వ్యక్తి ప్రతిసారి పల్లవినెత్తుకొనే సమయంలో రెండు చేతుల్ని చాపి ఒక్కొక్క కాలినే నేలపై నిలుపుతూ, లేదా చేతుల్ని పైననేస్తూ ఉంటాడు పాట లోని అర్థానికనుగుణంగా అభినయంచేస్తాడు చుట్టూ వున్నవారంతా గుండ్రా కారంగానే తిరుగతూ అడుగులు మార్చుకొంటారు గేయంలో పల్లవి రెండు రకాలుగా వుంటుంది గేయం మధ్యలో రెండోపల్లవి మొదలవుతుంది అప్పటి నుంచి నృత్యం వేగాన్ని పుంజుకొంటుంది మొదటిగా తాళం 'తా-తకిట' అనే గతిలోనూ తర్వాత 'తకతక' తగితోనూ వాయిస్తారు.

గజ చర్మముపై గప్పినాడురా, బ్రహ్మనుగొట్టి కపాలమే బట్టినాడురా
నిజముగ జగములు తిరిగినాడురా మహానుభావుడు
అజాటి బిక్షముఅడిగినాడురా యితడే మాపాలిటదేవుడు
మా కోడివల్లె నెలకొన్న మలయ్యదేవుడు "గజ"

నల్లని జడలో పాయని సతిగలిగి
భల్లాన భూపతి యిల్లాయి తానడిగినాడుర
చెల్లమదేవిక భావముతా తెలిసి మహానుభావుడు
చేతులు బాలుడైన వాడురా "యిదే మా పాలిట"

బలితనయుని మదినిలచినాడురా
బహుకాలమెల్ల బంటై వాకిట నిలిచినాడురా
భక్తులపాలిట దైవమానర
మహానుభావుడు పాపములన్ని ద్రుంచినారురా "యితడే"

సకలముతానై తెలిపినాడురా
సరిలేని మహిషనందుని మదిలో నిలిచినాడురా
గతినీవేయని అనుదినములు గొలువ
మహానుభావుడు అనేక సంపదలిచ్చినాడురా "యితడే"

అతులిత మహిషులుగల్గువాడురా
కనరాని పొడుగై అది మంతయులేనివాడురా
ఆనందాగులు నెమ్మదిగా యేలువాడురా
మహానుభావుడు మదిలోగురువయ నేలినాడురా "యితడే"[29]

ఇంకో గేయంలో 'తానతాన తందన' అనే ఊతపదంతో గేయానికొక ప్రత్యేకత గేయంలో శివుని వర్ణన తెలుపుతుంది నృత్యంలో కూడా ఆ వర్ణాని కనుగుణంగా చేతులతో చూపిస్తాడు రెండు కాళ్ళను ఒక్కసారి ఎగురుతూ గంతులు వేయటం, బిరబిరా కూర్చొనిలేవటం గమనించతగ్గది

**తాళం గతులు**

తక తకిట
తక తకిట
తక తకిట

పల్లవి లేకుండా వూతపంతో పాడే గేయం

పావుకోళ్లు తొడిగి త్రిశూలంబట్టి బుఱ్ఱచేతాబట్టి తిరిగెనమ్మా వాడు
పాయకున్న మమ్మేలిన కోడిపల్లె దేశాములో బిక్షమడిగనమ్మా వాడు
'తాన తాన తందన'

పూసేన బూడిద పులితోలు కసటాము వాసాన తోడూ తవచ్చెనమ్మా వాడు
వేషధారి మమ్మేలిన కోడిపల్లె దేశాములో బిక్షామడిగనమ్మా వాడు
'తాన తాన తందాన'

లాలానతోడుత లక్ష్మయ్య మల్లాదు, రమ్మాని వరములు యిచ్చెనమ్మా వాడు
కొమ్మాని ప్రజలాకు కోడిపల్లెలలో అప్పారి సాపారికొన్నాదమ్మా వాడు
'తాన తాన తందాన'

పల్లెఒడల మీదనున్న పామునుంగువల్లె పూలాదండవేసెనెమ్మా వాడు
పల్లాటమాడేరు వైరూనిబట్టూక, పదిలాముగాపదిలకొన్నదమ్మా వాడు
'తాన తాన తందాన'

పట్టుపీరాగట్టి తాళలోసుకొని పట్టేకువంకీలు పదిలాముగ
కట్టాడితనమున పట్టాడి రీకుకదిట్టాడి కోడిపల్లె మల్లదమ్మా వాడు
'తాన తాన తందన'[30]

చౌడమ్మ గుడి దగ్గరకు జ్యోతి సమీపిస్తుండగా కొన్ని చరణాలు నెమ్మదిగా కొన్ని చరణాలు బిరబిరా పాడుతారు. గేయంలోని అర్థాని కనుగుణంగా బిగ్గరగా

పాడటం నేలపై అడుగులు గేయ పాదానికనుగుణంగా వేయటం, జ్యోతి గిర్రున తిరుగుతూ ఎగిరి గంతులేయటం ఈ పాటలో ముఖ్యం కొన్ని చరణాలకు నృత్య గతిలో మార్పులు రావటం పల్లవి గేయంలో మొదలవుతుంది ప్రతిసారి పల్లవిని ఎత్తుకొనే సమయంలో తాళం 'తా-తకిట' అని కొడుతూ పల్లవి నెత్తుకొంటూరు.

తాళగతులు

తకిట తకిట
తకిట తకిట
తకిటతక తక
తక తక తక
తా తకిట
తా తకిట

ముందూగ ముగురు మూర్తులగన్న ముదితా
ఓయమ్మా అమ్మయ్య ముదితా ఓయమ్మా
నీవు యేకాందముగాను యెల్లలోకములాకు
యెఱుకజెప్పితివమ్మా అమ్మయ్య యెరుకనెప్పితివమ్మ
ఆకాశవీధిన త్రిపురాలు మూడు అమరకూర్చితివమ్మా
నీవురాకాసినూతాల చీకాగు పరచీన
శివుని పుత్రివమ్మా అమ్మయ్య శివుని పుత్రివమ్మా
శ్రీకారంబుగ లోకములేలీన సృష్టికర్తవమ్మా
అమ్మయ్య సృష్టికర్తవమ్మా
నీవు పానుగళ్ళు య దు పరగనాటించిన బాలాఓయమ్మా
అమ్మయ్య బాలా ఓయమ్మా "శ్రీకారంబుగ"

చక్కాగళంకారు చెమటాన్కట్టురాత పుట్టితివమ్మా
అమ్మయ్య రాతబుట్టితివమ్మా
నీవు సకల వేదములాకు సరచూన నురురాసరుసుకుంటివమ్మా
అమ్మయ్య సరసుకుంటివమ్మా

రక్తబీజునిగొట్టి రక్త మారగించి రణముగెల్చివమ్మా
అమ్మయ్యా రణము గెల్చితివమ్మా
నీవు గద్దారి (రైతర్గ) రాక్షసులయిద్దరిని బడమాల్చిగద్దె నిల్చితి
వమ్మా అమ్మయ్యా గద్దెనిల్చితివమ్మా "శ్రీకారంబుగ"

వేడుకతోన యేడేడు భువనాలు యెరుకచెప్పితివమ్మా
అమ్మయ్యా యెరుకచెప్పితివమ్మా
నీవు భవుని పాపను బాసి బహుదేశములు తిరిగి
భిక్షమెత్తితివమ్మా అమ్మయ్యా భిక్షమెత్తితివమ్మా
అమ్మయ్యా కమ్మలిచ్చితివమ్మా
నీవుతొగటవీరుల పాలితోడు నీడెవట్టితోయజాక్షివమ్మా
అమ్మయ్యాతోయజాక్షివమ్మా "శ్రీకారంబున"

ద్వాపరమున లేగ మామయ్యా కృష్ణునితోడబుట్టితివమ్మ
అమ్మయ్యా తోడబుట్టితివమ్మా
అమ్మయ్యా పరగబుట్టితివమ్మా
గండకత్తెర యందుగమకించి విక్రమార్కుగా సితివమ్మా
అమ్మయ్యా విక్రమార్కుగా సితివమ్మా
నీవు పాంచాలరాజుకు పరగ జన్మించిన బాలా ఓయమ్మ
అమ్మాయ్యా బాలా ఓయమ్మా "శ్రీకారంబుగ"

భూమిలో పులయుండు పుష్పాండమునికి పుత్రులిచ్చితివమ్మా
అమ్మయ్యా పుత్రులిచ్చితివమ్మా
నీవు అసురులబాధకు అమరులు వేడిన అభయమిచ్చితివమ్మ
అమ్మయ్యా అభయమిచ్చితివమ్మా
ధరలోనగుట్టంబు గురువయ్యానేలిన దైవమూర్తివమ్మా
అమ్మయ్యా దైవమూర్తివయ్యా
మమ్ము కరుణించి కృపజూడు పెదకోట్ల
చౌడు మాయమ్మ అమ్మయ్యా చౌడుమాయమ్మ "శ్రీకారంబుగ"[31]

ఇంకో గేయంలో రాక్షసులు దేవతలు మందరగిరిని, కవ్వంగా ఆదిశేషుని త్రాటిగా చేసుకొని చిలకటం శివున్ని వేడుకోవటం మొదలగు సన్నివేశాలు తెలిపేది

పాటలోని అడుగులు మోకాలిని బిరాబిరా పైకెత్తుతూ నేలపై పాదాన్ని కొట్టటం చేతుల్ని రెండింటిని మజ్జిగలాగ చిలుకుతూ అభినయాన్ని చూపించటం జ్యోతి నెత్తుకొన్నవారు శివునిలాగా ఎగిరిగంతులేస్తూ అడుగులు బిరబిరగా కొడుతూ గుండ్రాకారంగా తిరుగుతారు రెండు చేతుల్ని చూపుతూ ఉ టారు తాళంగతులు

తక తకిట తక
తక తకిట తక
తక తకిట తక

పని బూని దేవతలు పాలసముద్రముదరువ
పరగవేడుకతోన పయనమయ్యేరు
మందరాగిరితెచ్చి మరికవ్వముగజేసి
ఆదిశేషుని తాను వాసిగా సరితాడు
వలనొప్పకూర్మమై జన్మించి
ఆదారమైనిలిచె అకిలలోకములాకు
వినరయ్యాజనులారా యీపున్య కతలు
సజ్జనులు పాడేరు చౌడమ్మ కతలు "వినరయ్య"

దేవతలు రాచ్చసులు డీకొని దరువంగ
బుగబుగా పొగలెగిసె భూమండలమునిండె
కులకూటము బుట్టె కరిగె బ్రహ్మాండంబు
పారిపోయిరి సురులు పరమేశ్వరుని కడకు
హరుడుకోపాగించి అంటె ఆనందంబు
కాలకూటావిషము కంఠనానిలుపంగ
కరకంరుడనగ నీవు వెలసినావయ్య "వినరయ్య"

దనయాంతరంబున దనమంత్రియై బుట్టె
ఐరావతముబుట్టెఅకిలలో కములాకు
ఐరావతముబుట్టె అశ్వరధములు బుట్టె
తామరాకమలములు తరువాత బుట్టె "వినరయ్య"

అరటి పూవలుబుట్టె అందజామునిబుట్టె
గనుడు పున్యాత్ముడై యోగరాహనమెక్కి

బ్రహ్మదంతముచేత కానికామండలము
కస్తూరినామంబుపై పల్లె పీబూది
పల్లజడాలతోన "వినరయ్యా"

ముగురు త్రిపురాలు పంపించినారు
సంతులేదని ముని చౌదకునువరమడిగి
శేషభియ్యముల్చి చెలగి వేడుకతోన
మున్నూటరువది పీరందరికోరి
మోదముతో చౌదమను మ్రొక్కి కొలువంగ "వినరయ్యా"

పీరులు కొలువంగ వేడుకా చౌదమ్మ
త్రిపురపురము గెలిచి తిరిగి వచ్చె
అండజాముని బిడ్డ అమరంగదీసుకొని
ప్రేమతో పీరులకు పెండ్లిండ్లుజేసె
తారముగముని బిడ్డ తొగటకులములోన
మునిసంపతై నిలిచె మూడులోకములాకు "వినరయ్యా"

పీరులా పుట్టువడి విన్నవారలకెల్ల
పుణ్యములు నిద్దించు పుత్రసంతానంబు
కలుగునో బాగ్యములు తామెరలు తామెరలు దరలోన
పరగపటవు పెదకోట్లచౌదమ్మ వినరయ్యా[32]

జ్యోతి నృత్యం చేసుకొంటూ, పాటలు పాడుకొంటూ నడిబజార్లో వెళుతుండగా భక్తులు ఆమెకు బలులిస్తూ వుంటారు ఆ చౌదమ్మ దేవతను రక్తపు బొట్టుతో అలంకరిస్తారు బలులిస్తున్నపుడు బలిజంతువును (గొర్రె పొట్టేలు - మేకపోతు) భుజంపై నెత్తుకొని మెడను వెనకి వంచి ఒక్కరే కత్తితో కోస్తారు. బలిజంతువు కెవ్వుమని కేకనేయటం మాత్రమే వినిపిస్తుంది తర్వాత ఆ రక్తమంతా నేలపై పడుతుంది జ్యోతి ఆ రక్తపు మరకలపై వెలుతూ వుంటుంది చివరి సారిగా మంగళం పాటపాడుతారు పాట నిధానంగా పాడుతూ జ్యోతినెత్తు కొన్నవారు నిదానంగ వూగుతూ అడుగువేస్తారు

తాళం    తా - తకిట
        తా - తకిట
        తా తకిట

## 2. మంగళంపాట

అగ్గురాలా జాలుకమ్మలు నిగ్గూనా పూజద్దేవేయక
అగ్గూనా గంధాము తీసిరి అలసిరి జయజయమంగాళం
మంగాళం మంగాళం సోభం మంగాళం నందారికిని
మంగాళం నేటికి చౌడమ్మకు జయ జయమంగాళము
జగదంబకు జయజయమంగళం మంగాళం
సోబం మంగాళం నందారికేసి
దే - చంద్రమూలే బ్రోన దేవరాకు తెరలేగట్టి
దేవరాకు అరగింపులు చేసిరి జయజయమంగాళం "మంగళ"

బొజ్జంగి పల్లాకి భట్టుక అభరణాలే శృంగారించి
బొజ్జంగి పువ్వేల్ల పూజలు జేసిరి జయజయమంగాళం
అఖిలాలోకసేనులెల్ల ఆరగింపులివ్వంగా
అక్కమ్మా ముద్దమ్మా కూడిరి జయ జయ మంగళం
మంగళం మంగాళం సోభం మంగాళం నందారికిని[33]

జ్యోతి నృత్యాన్ని చూస్తున్న శ్రోతలు రెండు చేతులెత్తి మొక్కటం, భక్తితో ఇంటి దగ్గర వెళ్ళేటపుడు టెంకాయలు కొట్టటం, బలిజంతువును ఇవ్వటం చేస్తారు కొద్దిమంది స్త్రీ పురుషులు కలిసి ఆడటం అక్కడక్కడ గుంపులో చేస్తారు ఇంకా కొద్దిమంది బాగ తాగి ఊగతూ తూగుతూ ఆడుతూ పాడుతుం టారు చౌడమ్మను గట్టిగా పిలుస్తూ అరుస్తుంటారు గుంపులో ఎక్కువగా రెండు చేతులెత్తి మొక్కటం కనిపిస్తుంది

## జ్యోతినృత్యాన్ని చేసే గ్రామాలు

1 ధర్మవరం చేసే (సాలె)కులంవారు
2 రేగాటిపల్లి ,,
3. పెద్ద కోట్ల ,,

## 2 నామాలసింగని నృత్యం

ఉగాది పండగ, పీర్ల పండగ (మోహరం) ఉరుసు, తిరనాలలో నామాల సింగని నృత్యం చేస్తారు ముఖానికి నల్లటి బొట్లు, ఎర్రటి రంగు మచ్చల్లాగా, అలంకరణచేసి, నదుట నామాలు పెడ్తారు నాలుకను పెద్దదిగా మామూలు నాలుకకు అమర్చుకొంటారు తలమీద రుమాల కట్టి వేపమండల్ని చెక్కుతారు రెండు చేతులను పెనవేస్తూ గొలుసుతో కడతారు రెండు చేతుల్లోనూ పిడిబాకులుంటాయి. నడుముకు దట్టి గుడ్డ కడతారు యర్రటి సల్లడం తొడుక్కొంటారు కాళ్ళకు గజ్జెలు కడ్తారు ఇలాంటి అలంకరణచేసిన తర్వాత రెండు చేతులకు భుజాలకు నూలు పగ్గాంతో ఇరుప్రక్కలా పట్టుకొంటారు తర్వాత తప్పెటగతులకు అనుగుణంగా నామాల సింగడు అడుగులువేస్తాడు పగ్గాలు పట్టుకొన్నవాళ్ళు అతనికనుగుణంగా అడుగువేస్తూ తిరుగుతూ ఉంటారు

నామాల సింగడు ముఖ్యంగా రెండు చేతుల్ని పైకెత్తుతూ కత్తుల్ని తిప్పుతూ ఒక్కొక్క కాలిని వెనక్కి ముందుకు నేలపై కొడతాడు మీసాలు మెలేస్తూ ఉంటాడు నాలుక యర్రగా వేలాడుతూ పూనడిగా సోరకం[34] వచ్చినట్లు వుంటాడు అపుడపుడు నేలపై కూర్చోవటం, ఒక్కొక్క కాలిని వెనక్కి చాపుతూ అడుగులు వేస్తాడు. ఈ అడుగులే బస్కీలు అంటారు తప్పెట గతులిలా వుంటాయి

మొదటిగా

జగ్ నకన్
జగ్ నకన్
జగ్ నకన్

నామాల సింగడు రెండు కాళ్ళను రెండు చేతుల్ని ఒక్కసారిగా కదిలిస్తూ గుంపు మధ్యలో వస్తూ వుంటాడు వెంటనే ఒక్కసారిగా తప్పెట గతిమారుస్తాడు ఆగతులిలా ఉంటాయి

జగ్‌జగ్ జగ్ నకన్
జగ్‌జగ్ జగ్ నకన్
జగ్‌జగ్ జగ్ నకన్

అలా గుంపులోని స్త్రీ పురుషులు చూస్తుండగా నామాలసింగడు వస్తుండగా తప్పెట్లు వెనక్కి వెనక్కి సర్దుకొంటూ గతులు మార్చుచేసుకొంటూ పోతారు మూడులేదా ఐదు తప్పెట్లు కొడుతూ ఉంటారు అడుగులు బిరబిరా వేసేటపుడు తప్పెట గతిమార్చేస్తాడు, అలాంటి గతులిలా ఉంటాయి

జెగ్ నకన్ జెగ్
జెగ్ నకన్ జగ్
జెగ్ నకన్ జెగ్

తప్పెట గతిమార్పుచేసేటపుడు నామాల సింగడు కొద్దిసేపు విరామం తీసుకొంటాడు అపుడు ముఖానికి గుడ్డ అడ్డంగా కప్పుతారు అతనికి బొరుగులుపై బాగాన చల్లుతారు యర్రటి నీళ్ళు దిగదీస్తూపోయా వుంటారు ఇవన్నీ చేయటం నామాల సింగని నృత్యగానికి ఎటువంటి ఆటంకాలు రాకుండా వుండాలని చేస్తారట ఇలా గుంపు అందరికీ నృత్యాన్ని చూపించి ఇంటికి వెళ్తాడు ఈ చరిత్ర ఈ ప్రాంతంలో ఇలా ప్రచారంలో ఉంది

నామాలసింగడు అనే పేరుగల్గిన వ్యక్తి ఈ ప్రాంతంలో దారి దోపిడి చేసేవాడట సంతకెళ్ళి సరుకులు తీసుకొని వస్తున్న స్త్రీ పురుషులు బలవంతంగా బట్టలు ఉడబెరికించి కోలాటం వేయించాడట దీనికి చూట్టూ గ్రామస్థులంతా ఏకమై అతన్ని బట్టి బందించి గ్రామంలో తాళ్ళతోకట్టి పట్టుకొని వచ్చారట అపుడు నాలుక బయటికి కొచ్చి పూగుతూ కాళ్ళు అలా అలా నేలపై ఈడుస్తూ వచ్చాడట తర్వాత గ్రామంలోకి వచ్చిన తర్వాత చంపేశారట దీనికి నిదర్శనం ఈ నామాల సింగని నృత్యం ఈనాటికీ ఈ ప్రాంతంలో మొహరం పండుగనాడు తప్పనిసరిగా చేస్తున్నారు. పాటలుండవు తప్పెటగతులు, అడుగులు మాత్రమే

**కళాకారులు :**

గొట్లూరి ఓబిరెడ్డి - సుబ్బరావుపేట - 60 సం లు
చాకలి కొండన్న - సుబ్బారావుపేట - 22 సం లు
హరిజనగంగప్ప - తిప్పేపల్లి - 25 సం లు
బోయ ఆదినారాయణ - అప్పరాచెర్వు - 30 సం లు
హరిజన నాగన్న - వేప్పమడుగు - 40 సం లు

ప్రతిపల్లెలోనూ ఈ నృత్యాన్ని పిన్న పదగ (మోహరం) నాడు తప్పని సరిగా ఎవరో ఒకరు చేస్తున్నారు

## 3. యామయ్యస్వామి నృత్యం

యోగివేమన శిష్యులమంటూ ఒకప్పుడు కాషాయవస్త్రాల్ని ధరించి గుఱ్ఱం పై వస్తుండగా గుఱ్ఱం ముందు పోట్లేలు వచ్చేది ప్రతి గ్రామాన్ని సందర్శిస్తూ వెళ్ళేవారు ప్రతి గ్రామంలోనూ బియ్యం బేడలు భోజనం ఏర్పాటు చేసేవాళ్ళు యామయ్యస్వామిగా కాషాయ వస్త్రాలు ధరించిన వ్యక్తి గుఱ్ఱంపై బిరాబిరా వచ్చే వారు పోట్లేలు పరుగెత్తుతు వచ్చేది గ్రామస్థులంతా భక్తితో చూసేవారు గుఱ్ఱం అడుగులు వేసేది గ్రామకూడలిలో గుఱ్ఱాన్ని సకిలింపచేస్తూ ముందరి కాళ్ళను పైకి ఎత్తేలా కళ్ళాన్ని గట్టిగా లాగుతూ, యామయసామి చేసేవాడు గుండ్రా కారంగా గుఱ్ఱాన్ని త్రిప్పుతూండేవాడు కానీ ఇటీవలకాలంలో యామయ్య సాములు రావటం మానేశారు

ఈ కళాకారులు ఎప్పుడో ఒకసారి వచ్చేవారు కానీ ఇటీవల కాలంలో ఎప్పుడు రాలేదు

## 4 లంకిణీ నృత్యం

రామాయణంలోని లంకిణీస్త్రీ పాత్రను జానపదులు ఈనాటికి పురుషుడు అలంకరణ చేసుకొని పండగల్లో ఆడుతున్నాడు అన్ని అవయవాలు కృత్రిమం గా తయారు చేసుకొని తన శరీరానికి అమర్చుకొంటాడు శరీరాన్ని లావుగా చేసాడు తరాత నోటిలో ఇనుపకడ్డీకి ఇరువైపులా గడ్డకట్టి కిరసనాయిలుతో తడుపుతాడు రెండుచేతుల్లో కూడా అలాంటివే పట్టుకొంటాడు గుండ్రాకారంగా తిరుగుతూ, రెండు చతుల్ని ఆడిస్తూ తప్పెటగతుల కనుగుణంగా చేసే నృత్యం లంకిణీ నృత్యం.

స్త్రీ పాత్రను పురుషుడు అలంకరణ చేసుకొంటాడు పాతగంపల్ని పాత గుడ్డల్ని ప్రోగుచేసి చాటను ముఖాల్లాగా తయారుచేసి ముక్కుకళ్ళు తయారు చేస్తారు తప్పెటగతులు ఇలా వుటిటాయి

ాగ్ నకన్
ఝగ్ నకన
ఝగ్ నకన

పై గతులే నృత్యం అయిపోయేంత వరకు వాయిస్తారు ఒక తప్పెట మాత్రమే ఉపయోగిస్తారు గుంపులోనివారంతా నేలపై కూర్చొని చూస్తుంటారు చిన్నపిల్లలు లంకిణిని చూస్తూ జడుసుకొంటారు భయపడతారు

**కళాకారులు**

సూరంశివారెడ్డి - 58 సం లు - సుబ్బరావుపేట

ప్రతిపల్లెలోనూ ఉగాదిపండగ, మోహరం పర్వదినాల్లో ఎవరో ఒకరు వేస్తూనే ఉంటారు



# ౩. బొమ్మలాటలు

## 1. తాటాకు బొమ్మలాట

తాటిచెట్టు ఆకును నరికి పట్టలు చీల్చుకొని ఆడ మగ బొమ్మల్ని తయారు చేస్తారు చిన్న చిన్న బొమ్మల్నికూడా తయారుచేసి పెద్ద బొమ్మల దగ్గర ఉంచుతారు గుడ్డపేలికల్ని ఆ బొమ్మలకు కడతారు బొమ్మలు జానెడు పొడవు కల్గివుంటాయి ఆకారము అంతగా కనిపించదు ఆ బొమ్మలదగ్గర చిన్న పెంకుల్లో మట్టివిపోసి అన్నం పప్పుఅనుకొంటూ చిన్నపిల్లలు మొండిగోడలకింద ఇప్పటికి ఆడుకొంటున్నారు

## 2. చెక్క బొమ్మలాట.

జానపదులు చెక్కతో స్త్రీపురుషుల బొమ్మల్ని తయారుచేసుకొంటారు చూడటానికి ఎంతో అందంగా వుంటాయి చిన్నపిల్లలు ఆ బొమ్మల్ని సంకలో ఎత్తుకొంటూ ముద్దాడుతారు అన్ని బొమ్మల్ని ఒకచోట పెట్టి ఇంటిలో అమ్మనడిగి బియ్యం బెల్లం అడిగి తీసుకొని వచ్చి ఆ బొమ్మల దగ్గర ఇద్దరు ముగ్గురు పిల్లలు కూర్చొని తింటారు ఆ బొమ్మలకు పెండ్లిచేయటం, ఒకచోట కూర్చొ పెట్టటం, పెండ్లి తతంగమంతా ఆ పిల్లలు ఆ బొమ్మలకు చేస్తారు. బొమ్మల్ని ఇంటికి తీసుకొనిపోతారు

ఈ బొమ్మలాటల్లో కొంతమంది పిల్లలు పెండ్లి చేసే సమయములో ముందుగా పెండ్లికుమారుని బొమ్మ పక్షం, పెండ్లికుమార్తెబొమ్మ పక్షంవారు ఇలా పాడుకొంటూ పెండ్లికి ఒప్పందం చేసుకొంటారు

చిన్ని మీరేంటివారు చిన్నక్కా మీరేంటివారు
దాదీ మీరేంటివారు దాదిరిమొగ్గల్లే
చిన్నిమేం బాపనివారము చిన్నక్కా మేంబాపనివారం
దాదీ మేంబాపనివారం దాదిరి మొగ్గల్లే
చిన్ని మా జంజాలేవి చిన్నక్కా మీ జంజాలేవి
దాదీ మీ జంజాలేవి దాదిరి మొగ్గల్లే "చిన్ని"

చిన్ని మేం కాపువారం చిన్నక్కా మేం కాపువారం
దాదీమేం కాపువారం దాదిరి మొగ్గల్లే
చిన్ని మీ జడిగాలేవి చిన్నక్కా మీ జడిగాలేవి
దాదీ మీ జడిగాలేవి దాదిరి మొగ్గల్లే

పై గేయాన్ని పాడుతున్నపుడు చేతులనూపుతూ, ప్రశ్నార్థంగా ఒకొక్క చేయిని పిడికిలి పట్టుకొనిఅడగటం చూపిస్తారు

పై బొమ్మల్ని తయారుచేసుకొని ఈ నాటికి పల్లెల్లో జానపదులు వినోదిస్తూ ఉన్నారు.

## 3 తోలుబొమ్మలాట

### 1. తోలుబొమ్మల తయారుచేసే విధానం

తోలు (చర్మం) తో తయారుచేసిన రకరకాల బొమ్మలను తెరపై ఆడించే ఆట 'తోలుబొమ్మలాట' ఇది ప్రాచీన చలన చిత్రం మేక చర్మాన్ని తీసుకొని వేడినీళ్ళలో శుద్ధిచేసి నేలపై ఆరబెడతారు తర్వాత ఎండిన చర్మంపై కావాల్సిన బొమ్మ ఆకారాన్ని గీసుకొంటారు రంగుల్ని వేస్తారు ఇలా తయారుచేయటాని కుపయోగించే పరికరాలను 'పోగర గుండు పోగర-దబ్బపోగర-కత్తెర-చెక్క-సూది' అంటారు. తయారైన బొమ్మకు మధ్యలో వెదురు దబ్బను అమర్చుతారు దీని సహాయంతో తెరపై ఆడిస్తారు బొమ్మలు రామాయణంలోని పాత్రలు, మహాభారతంలోని పాత్రలు, హాస్యానికి కేతిగాడు-జుట్టు పోలిగాడు సడుగుల్లే నోడు-పిల్లేబి త్తిరిగాడు బంగారక్క అనే బొమ్మల్ని తయారు చేస్తారు వినాయకుని బొమ్మ సరస్వతి బొమ్మల్ని ప్రార్థనలలో ఉపయోగిస్తారు

అన్ని బొమ్మలను వెదురుతో తయారుచేసిన పెట్టెల్లో భద్రపరుస్తారు గుడ్డలతో కప్పుతారు అటకు కావాల్సిన బొమ్మల్ని సామాగ్రినంతా 'రథం బండి' లో సవారి అమర్చుకొని పెట్టుకొంటారు వీరి సంసారమంతా బండిలోనే ఉంటుంది వీరు 'మరాఠి' బాషను మాట్లాడతారు. తోలుబొమ్మలాటనే 'బావాలా సమూరవి' అని మరాఠీ బాషలో అంటారు స్త్రీ పురుషులు ఎనిమిది మంది ఆట ఆడించటానికి అవసరమౌతారు గ్రామ గ్రామాలు తిరుగుతు ఆటను ప్రచారం చేస్తుంటారు. జీవనం సాగిస్తూంటారు.

## 2. రంగస్థల నిర్మాణం

గ్రామంలో గ్రామ పెద్దల దయాదాక్షిణ్యాలపై ఆటను ఆడటానికి మొదలు పెడతారు రైతుల ఇళ్ళ దగ్గరకెళ్ళి నాలుగు గుంజల్ని తెస్తారు నాలుగుగుంజల్ని పాతి రంగస్థలాన్ని ఏర్పాటు చేస్తారు గ్రామస్థులందరికి వీలుగా ఉండేచోట కడతారు చాకలి ఇంటికెళ్ళి తెల్లటి పంచను తెచ్చి తెరకడతారు తెరలోపలి భాగంలో వెడల్పు చెక్కల్ని కింద వేసుకొంటారు మొదటిగా విఘ్నేశ్వరుని బొమ్మ సరస్వతి బొమ్మను తెరపైకడతారు బొమ్మల్ని తుమ్మముల్లులతో గుచ్చుతారు అందరూ గ్రామస్థులంతా గుమికూడిన తర్వాత ఆటను మొదలు పెడతారు లోపలి భాగంలో సమురు దీపాలను పెడతారు ఈ దీపాలతో బొమ్మలు చూడటానికి బాగుంటాయనే ఉద్దేశ్యంతోనూ, బొమ్మలనాడించేవారు చూసేవారికి కనిపించకుండా ఉండటానికిగానూ ఉపయోగిస్తారు

తెరలోపలి భాగంలో వాడే వాయిద్యాలు 'హార్మోనియం మద్దెల - గజ్జెలు - తొక్కుడుచెక్క - తాళాలు - తప్పెట' - హార్మోనియంతో శృతి మాత్రమే వాయిస్తారు

మద్దెలను ఒకరే కూర్చొని పాటలకనుగుణంగా వాయిస్తారు మూరెడు పొడవుకల్గిన చెక్కను కాలితో తొక్కుతూ 'టక టక టక' మనే శబ్దాన్ని ఎపుడు తొక్కుతుంటారు 'తక తక' వరుసలో తాళాలు కొడుతుంటారు, తప్పెటతో 'నగారా' మ్రోత మాత్రమే వాయిస్తారు తోలుబొమ్మలాటవారు తప్పెటను వాయించటం గమనించాల్సిన విషయం తప్పెటను బంగారక్క అనే బొమ్మ ప్రవేశించే సమయంలో వాయిస్తారు[35] తొక్కుడు చెక్కతొక్కే వారు కాలికి గజ్జెలు కట్టుకోవటంవల్లా ఘలుఘల్లు మనే శబ్దంతోపాటుగా టక్ టక్ మనే శబ్దం కలిసివస్తుంది హార్మోనియం శ్రుతికలుస్తుంది

తెరలో ఆడించే వారంతా వుండగా చూడటానికి వచ్చిన గ్రామస్థులంతా నేలపైన, మంచాలమీద, ఈతచాపలపైన కంబళిపైన కూర్చుంటారు

వీరు ముఖ్యంగా ఆడే బొమ్మలాటలు రామాయణం, భారతాల సంబంధం కల్గినవి అవి

### 3. రామాయణం

1 లంకాదహనం
2 సతీసులోచన
3 మైరావణ చరిత్ర
4 లక్ష్మణమూర్ఛ
5 ఇంద్రజిత్తు యుద్ధం
6 పాతాళహోమం
7 అంగదరాయభారం

### 4 భారతం

1 ఉత్తర గోగ్రహణం
2. విరాట పర్వం

పై కథలన్నీ ఆదే సందర్భంలో రామాయణ భారత కథను చెపుతూ కేతిగాడు, బంగారక్కల సంభాషనల ద్వారా తెలియచేస్తూ ఆరోజు ఆదే కథా ఘట్టం రాగానే బొమ్మల్ని తెరపై ఆడిస్తూ మొదలు పెడతారు ప్రతి కథను ఆదే ముందుగా భూదేవి ప్రార్థన చేస్తారు అపుడు శృతి కలువుతూ తాళాలు తక తక' వరుసలలో కొడుతూ పురుషులు పాడుతుండగా స్త్రీలు వంతపాడుతారు ఆలాంటి ప్రార్థన

"భూమి ఆకాశయసార్దనే
భూదే శక్తివినాశాయ
సూర్యకిరణ సమానయే
భాగే రత్న లలాంకారే
శ్రీభూమిదేవి ఆకాశాయ
నమస్తుతే నమోనమః"[36]

వెంటనే అన్ని వాద్యాలు ఒక్కసారి మ్రోగిస్తారు. అపుడు సరస్వతి, విఘ్నేశ్వరుని బొమ్మలు తెరపై కదతారు వాద్యాల గతులిలా ఉంటాయి

### 5. తాళాలు :

తాళాల అంచుల్ని ఒకదానికొకటి తాకిస్తూ 'త' (రెండుసార్లు కొట్టి) ఒకసారి

రెండింటిని మూతగా కొడతారు అప్పుడు తక తః టక్ అనే శబ్దాలు పుడతాయి బిరబిరా కొట్టే సమయంలో తాళపు అంచుల్ని మాత్రమే 'తక తక' శబ్దంతో కొండుతుంటారు

## 6. మద్దెల.

రెండు ప్రక్కలా వుండే చర్మంపై జానెడు పొడవు కల్గిన పుల్లను ఇంకో ప్రక్క చేతివ్రేళ్ళకు తగిలించుకొన్న ఉంగరాలద్వారా తక ౦ం తకదిం తకతోం అనే గతుల్ని కొడతారు

## 7. తొక్కుడుచెక్క.

రెండు కాళ్ళ సహాయంతో తొక్కుడు 'టక టక్' అనే శబ్దాల్ని పుట్టిస్తారు

## 8 హార్మోనియం.

వుయ్ వుయ్ వుయ్ మనే శృతిని మాత్రమే వాయిస్తుంటారు

## 9. తప్పెట:

జగ్ జగ్ జగ్ జగ్ అనే వరుసను కొడతాడు

భూదేవి ప్రార్థన అయిపోగానే స్త్రీలు క్రింది పాటను పాడుతారు

కృపాహాయ శ్రీరామనారాయణ
నారాయణ వేదపారాయణ "కృ"
మనోరక్ష సంరక్ష నారాయణ
మనోద్ధామ శ్రీరామ యోగాగనా "కృ"

గణేశ్వరుని బొమ్మ తెరమైవుంచి ప్రార్థనచేస్తారు ఈ ప్రార్థన ఒకరు పాడుతుండగా మిగిలిన వారంతా వంతపాడుతారు తాళాలు తక తక తక్ వరుసలోనూ హార్మోనియం శ్రుతితోను, మద్దెల 'తకద్దిం' గతిలోనూ ప్రయోగు తుండగా అందరి గొంతులు కలిసిపోతాయి

గననాత బ్రోవవయ్యా గననాత[37]
- నిన్నునిరతము ప్రార్థితుమయా గననాత

ఆవి విద్యలకెల్ల గననాత
వేద గురుడు సుతుడావయ్యా విగ్నేశ్వరా
యిద్దరూ తల్లలా కుమారుడావయ్యా విగ్నేశా
ముద్దు గౌరిగురుడ సుతుడవయ్య గననాత
నిన్ను బావమలర తలుతుమయ్య విగ్నేశ
బలపనూరి విగ్నేశ గననాత
నిన్నుబావమలర దలతుమయ్య విగ్నేశ

ఇంకా విగ్నేశ్వరుని గూర్చి కొన్ని స్తుతులు చేస్తారు అపుడు శృతి మాత్రం ఉంటుంది ఒక్కొక్క మాట అయిపోగానే మద్దెల 'తకతోం' అంటూ వాయిస్తారు

"విగ్నా విగ్నములకును
గన గనంబులకును
యిశాదిరాజులు యుండబడినట్టి

విగ్నేశ్వర వార్థసమాచారంబెట్టిదనినా" అనిరాగాలాపన చేస్తారు. ఇంకొకరు ఇలా పాడుతారు

సూర్య సూర్యాది మాదిత్య ద్వాదశాఖర
దినమొక్క పగటి కాలమున ప్రకాశింపు సున్నట్టి
విష్ణుదేవుని కుడినేత్రముగ యుండబడినట్టి
ఆ సూర్యప్రకాశతేజముతో సమానమైనట్టి వాడయ్యా విగ్నేశా
ఇంకొకరు ఇలా అంటారు
మరీ యెటువంటి వాడయ్యా అంటే
హిమవత్ చంద్రమా యిందుకుముదబాంధవ
కుమదంబులకు బందువుగలగినట్టి
పదహారవనాటి రోజు వెలుగుబడిన
అబాల చంద్రునితో సమానమైనట్టి
వాడయ్యా విగ్నేశ్వరుడు

మాట ఇతని వర్ణాశ్రమసారముచెప్పటానికి చాల పొద్దుపోతుంది కనుక ఇతని తండ్రి ఎవరు? తల్లి ఎవరు? తెలుపవయ్యా బాగవతా

మాట ఇతని తండ్రి ఎవరంటే యీశ్వర సర్వలోకాన్ని శంకర చంద్రశేఖర, లలాటంబున ధరించినట్టివాడు విషమే అన్నంగా తిన్నట్టివాడు మూడు మొనల త్రిశూలం ధరించినట్టివాడు పాశుపతుడైన యీశుని కుమారుడు ఇతడు వినాయకుండయ్యా భాగవతా

మాట ఇతని తల్లియెవరయ్యా భాగవతా

మాట ఉమా, కాత్యాయనీ, గౌరీ-కాళీ-హైమవతీశ్వరీ, శివభవాని-రుద్రాణి-సర్వాణి సర్వమంగళం పార్వతీదేవి గంగకు ముద్దు సుతుడైన గనపతిని యక్కడ నాటకము లాడిన కోలాటాలు వేసినా భజనలు చేసినా పురాణాలు పఠించినా ముందుగా ఇతన్ని నమస్కారముగావిస్తున్నారయ్యా

వినాయక .
విఘ్నరాజా
దయామాధురా
అప్యేకదంత
హేరంబ
లంబోదర
గజానన

పై మాటలు ఒక్కొక్కదాన్ని పలుకుతుండగా మద్దెల మ్రోత ఉంటుంది తర్వాత పాట ఒకరు పాడుతుండగా మిగిలిన వారు వంత పాడుతారు

ముందుగనపతి నిన్ను ముదమొప్పదలచెదము
సదమాల గుణధీర గౌరీసుకుమార
నిటల నెపుది సుతుని నిగమగమునంది తని
తటితానిభగాత్ర కుండలా ధరుని

తర్వాత వినాయకుని బొమ్మను తెరపై ఒకపైపు చెక్కుతారు ఇంకో ప్రక్క నుంచీ సరస్వతీ బొమ్మను స్త్రీ ఆడిస్తూ తెరపైకి తెస్తుంది అన్ని వాయిద్యాలు కొద్దిసేపు మ్రోగిస్తారు అపుడు "తయ్యాకు దిరద తయ్యకు తకతోం" అంటూ స్త్రీ పాటపాడుతుండగా పురుషులు వంత పాడతారు సరస్వతీ ప్రార్థనలో స్త్రీ రాగమెత్తి పాడుతుండగా పురుషులు పాటగతిలో మార్పుతెస్తూ పల్లవిని ఎత్తుకొనే

సమయంలో తాళం 'తక తక' పదుసలోను మద్దెం 'తకతోం' అంటూ నిలపటం మామూలుగా అన్ని వాద్యాలు వాయించటం ఉంటుంది

బ్రహ్మరానీవచ్చె సఖకూడగ బ్రహ్మరానీ వచ్చె
బ్రహ్మరానీ వచ్చె యిమ్ముగసురాక్షి
సమ్మతా మనవిద్యలెల్ల ప్రార్థింతుచు "బ్రహ్మ"
మీ విద్యలకెల్ల వానికిపుస్తకపాని వాణియై "బ్రహ్మ"
ధరనిష్టావెరి పురమున వెలసెన వరదుడు
శ్రీ వెంకటేశుని తలమీద "బ్రహ్మ"

మాట ఆహా! నీవెవరివమ్మ! తల్లీ కనకవల్లీ

మాట ఓహో! బాలకా! నేనెవరినా? 'బ్రహ్మత్మా భూసుర శ్రేష్ఠ పరమేష్టి పితామహాకి' ఆ బ్రహ్మదేవుని పట్టపురాణి నాపేరు భారతిదేవి అందురోరి బాలకా

మాట నీవీ నాట్యమందిరానికి వచ్చిన కారణమేమితల్లీ!

సరస్వతి ఈ రాత్రి ఆడుచున్నట్టి లంకాదహనం అను నాటకం ఇందులో బాలురు-బాలికలు జ్ఞానోపదేశముకలుగజేయుటకై మీరందరూ ప్రార్థింపగా నేను ప్రసన్నమైనానోయి బాలకా!

మాట చాలా భాగ్యమైనది కానీ నీవెక్కడ పోతున్నావుతల్లీ

సరస్వతి నేను బ్రహ్మపట్టణానికి పోతున్నాను బాలా!

పై మాటలుకు స్త్రీ సమాధానం చెపుతుండగా పురుషుడు అడుగుతుంటాడు ఒక్కొక్క మాట అయిపోగానే 'మద్దెల' రెండు చేతులతో ఒక్కసారి కొడుతుంటాడు చివరిగా సరస్వతి బొమ్మను స్త్రీ ఆడిస్తుండగా అందరూ సరస్వతిని వేడుకొనే పాట-అన్నివాద్యాలు కలుస్తాయి

పాలనాసేయవమ్మా శారదాదేవి
పాలనాసేయవమ్మ సేయవమ్మా "పాల"
పాలనాసేయవే జాలాముసేయక
చాలానమ్మితివమ్మ బాలాసరస్వతీ "పాల"

అందరిలోమమ్మ ఆదరించుమమ్మా
బాలనమ్మితిమమ్మ బాలా సరస్వతీ "పాల"

వినాయకుని బొమ్మకు ప్రక్కన సరస్వతీ బొమ్మను పెట్టి కొద్దిసేపు అన్ని వాద్యాలు వాస్తుండగా పురుషులలో ఒకరు పీఠిక చెప్తాడు అపుడు హార్మోనియం మాత్రం శ్రుతి చేస్తుండగా చెప్పే మాటలు నిలిపిన వెంటనే మద్దెల మ్రోత మోగిస్తారు అలాంటి పీఠిక-

ముందుగా భూదేవి ఆకాశ ప్రార్థనంబుగావించినాము, విఘ్నములకు నాయకుడైన వినాయకున్ని ప్రార్థనగావించినాము వాక్కులిచ్చినట్టి సరస్వతీదేవి ప్రార్థన చేసినాము, ఈ సభను గూర్చి ఇపుడు బ్రాహ్మణ, వైశ్య శూద్ర, మహ్మదీయ, బోయ, బెస్త, యగతాళీ, సగతాళి యావన్మంది గురించి ఇంక సభ ప్రార్థన చేయవయ్యా భాగవతార్-

శ్లోకం సభకల్పతరువందే
ఖేదోపశాఖోప జీవితం
శాస్త్ర పురుష నమాయుక్తం
మూరబ్ఖల్యమ్ శోభతమ్
సభాజనంబులారా !

## 10. సభాప్రార్థన

సభా ప్రార్థనలో పల్లవికి ప్రాధాన్యం ఉంది. అందరూ కలిసి పల్లవిని ఎత్తుకొనే సమయంలో స్త్రీల గొంతు ప్రత్యేకంగా పాడుతూ రాగాలాపన చేస్తారు అన్ని వాద్యాలు మ్రోగుతుంటాయి

వందనంబు సభవారికి మా
వందనంబు సభవారికీ ॥వంద॥

మాయెందు తప్పులుదిద్దు వారికి మా
వందనంబు సభవారికీ ॥వంద॥

అందముగ గోవిందుని చరితము
స్వంధముగ మీరందరూ భజించెదరు ॥వంధ॥

కవులా గ్రథాములకు శాస్త్రి పండితులు
వాగ్మనులకు బేపండితులకు ॥వంద॥

## 11. బంగారక్క ప్రవేశ ఘట్టం

తర్వాత కొద్దిసేపు వాద్యాల్ని మ్రోగించే పురుషులలో ఒకరు ఇలా అంటాడు

ఈ సభనుగూర్చి యావన్మందికి నమస్కారము ఈ నాటకానికి ఎవ రొస్తారయ్యా ముందుగా తూర్పునాటి చిన్నది- ఒకే పుట్టుబడి అయిన చిన్నది[38] బంగారక్క పేరుగలది- నున్నగా తలదువ్వుకొని- కొప్పునిండా సన్నమల్లెలు ముడుచుకొని, చీరవిడచి రవిక తొడుక్కొని, రవిక యిడిచి చీరకట్టుకోని, ఆభరణ మైన నగలు పెట్టుకోని కండ్లకు కాటుక పెట్టుకోని పండ్లకు దాచ్చిని పూసుకొని రెండు పిర్లసందున కుంకుమా బొట్టు పెట్టుకోని ఆ బంగారక్క అనే కాంతసాకే వాళ్ల అరబిడ్డ యట్లావస్తుందంటే అని బొమ్మను తెరపైకి తీస్తుండగా తప్పెట మాత్రమే

"జగ్ జగ్ జగ్
జగ్ జగ్ జగ్
జగ్ జగ్ జగ్" అని వాయిస్తుండగా బంగారక్క బొమ్మను తెరపై ఆడిస్తుంటారు

తర్వాత తప్పెటని తీసివేసి తొక్కుడు చెక్క హార్మోనియం మద్దెం వాయిస్తుండగా బంగారక్క వర్ణన అందాన్ని గూర్చి ఇలా సభకు పరిచయం చేస్తారు

గజిబిజి గూడముగిజగానిగూడము
చింతపండడ బోలుచెలియన కొప్పు
పాపెన గుగ్గిళ్లు పల్లేరుకాయలు
పనుకాకు డబ్బులే పనతీసీపండ్లు
సంత సొరకాయలు సరి కొలిమిలిత్తులే
సకియా సన్నులు అందురు బంగారందురూ
యిందు ముఖులు చక్కదనమునన్ను
సభకు రమ్మందురే తడుబడి బంగారక్క

కొంతసేపు బొమ్మనాడించి, బంగారక్క పాటపాడుతుండగా మిగిలినవారు వంతపాడుతారు. శృంగారమంతా వలకబోసినట్లు కన్పించేది పాట

"తాలనేనమ్మ విరహము తాలనే విరహము
అమ్మనే తాలనేనమ్మ కొత్తగానాన మేనత్తడిబలమాయె
పడకింటిలోపుల సామన్నశయ్యపై
అడవికాచిన విదమలాయె విరహము ॥అమ్మ॥
కొత్తగా నానమే వత్తాడి బలమాయె"

బంగారక్క ఇంత జనంలో నా మొగుణ్ణి ఎలా పిలిచేది! అరుమంది పిల్లలు పుట్టారు నేనంతనేనే అయనంత ఆయనే లోలోపల చేసుకొన్నాం సరే అరుస్తా ఓరిగందోడి రారా! రెడ్లు పిలుస్తున్నారు! ఈ వూరిసిల్లు తాగి వళ్లంతా దురద లోపలాదురద రారా!

అయిన వెంటనే తప్పెట 'జెగ్ జెగ్ జెగ్' అనే గతిలో వాయిస్తారు వెంటనే తెరపైకి గందోడిగాడు జుట్టుపోలిగాడు- కేతిగాడు అనే బొమ్మలు ప్రవేశం చేస్తాయి

బంగారక్క పాట

రారా గందోడిరాపోలేరస్వామి
కట్టువంటి కాళ్లసేతులు
మిటువోక చక్కని చాలా
పిల్లు జుట్టు దువ్వుకోని
పొలిమేర దయ్యమువలె ॥రారా॥

తెల్లని తిరనామదిద్ది
అల్లనల్లన జోగొట్టుదు
చిన్నగానూ తరువులిడుచు ॥రారా॥

అంటు గందోడిగాని బంగారక్క సంభాషణ జరుపుతారు. ఈ సంభాషణంతా వచ్చి బూతులతోను, శృంగారపరంగా సాగుతుంది. పురుషుని మర్మాంగం బొమ్మకు తయారుచేసి బంగారక్క బొమ్మకు బ్యాటరీ అంటూ చూపించటం జరిగిన తరువాత ఆ గ్రామంలోని పెద్దల్ని పేరుపేరున ఫొగిడి కాపుల్ని గూర్చి ఇలా పొగడుతారు

'కాపులు కలిగి వుంటేనే కాపురము సేయనేతురా
కాపతులకు బాఽతులకు వేల్పులకు
కాపేర కన్ను' అన్నట్టుగా

అని కొద్దిసేపు వాద్యాలు ప్రయోగించి ఆరోజు ఆడబోయే 'ఆట' ను గూర్చి కథ మొదలుపెడతారు లంకాదహనం, అదే సమయంలో ముందు కథఅంతా బంగారక్క గందోడిగాని సంభాషణలో చెప్పి ఆ కథకనుగుణంగా బొమ్మల్ని ప్రవేశపెడతారు అప్పటినుంచి స్త్రీబొమ్మలు స్త్రీలు, పురుషుల బొమ్మలు పురుషులు, మాటలు పాటలు పద్యాలు చెపుతూ ఉంటారు ఇలాంటి కథల్లో రావణ సీత సంవాదం ఇలా వుంది

## 12. రావణుడు-సీత సంవాదం

రామాయణంలో 'లంకాదహనం' ఆట ఆడించే సమయంలో కథకనుగుణంగా సన్నివేశానుగుణంగా మన కళ్ళకు కట్టినట్లు చూపిస్తారు అశోకవనంలో సీతను బంధించి, రావణుడు సీత దగ్గర కొచ్చి ఆమెతో మాట్లాడే విధానం

రావణుడు-పాట

పొందుగోరి వచ్చినానే మందగామన
సీత మందగామన పొందుగా మాట్లాడరావే ఇందువదనా
అందుకుంద వేళనన్ను పొందురాలేద సీత కూడరాదేమి
బహు సుందరాంగి కన్నులెత్తి సూడరాదే
లోలాచ్చివంటి కన్నెలోకమంత్రై
యీ వలయమంత వెతకిన వక్కాతె లేదె
ముచ్చకంటి రాముడచ్చిన ముట్టులేర
వారొచ్చి లంక చేరలేరు

మాట . వలపులుకులుకుచున్నవి సింగంబులు బుంగపలుకుచు, జిక్కావతెనె నసికంబులు లాడుచున్నవి మన్మధాకారుల మదలింపుచున్నవి నీ ప్రేమ బిక్షపెట్టి నన్ను కృతార్థుని చేయరాదేమె నాయట్టి వానికి భార్యగా వుండిన నిన్నిట్లు వుండనిత్తునా నేమరిసెప్పెద వినుము,

చినిగిన యీ మైలు సీరగట్టు' నేల
గనత కూలమ్ములు గట్టుకొనుము
వుపవాసములు దప్పి నొగికూసింపనేల
సరసాన్నపానములు చెవులగొనుము
కటినోర్వి సమయించికందికుందగనేల
మృదుశయ్యపై కనలారి నిదురించు
అట్టవిపిచేరి ఒకపేద మానవుండు
వనిధి బంధించి చనుదెంచినను జయించి
నిన్నుగొని పోవునను మాట వగనీళ్ళమాట

మాట. సీతా గనకనక వస్తువాహనములచేత నీ చెలువందనాతో పడి తూగును
ఈ తలవని పలుకులు పలుకక నన్నుకలియుము నిన్ను రతుల తేలించెద

సీత. పాపాత్మా నీవునా పతిదాగురించి
ఈపురిరంకలోన నన్ను చెరబట్టి
పటువార రాక్షసబాకులు నన్ను
రనటీష ఃమొత్తైన నారాముబావములపైబడి
లంకపై బారనిదరావ న నీలావు
శ్రీరాములావు నీవె చూచెదగాన వేయేలచెప్పు
నిందతో దాముచెదరించినను
కొండతో తూగుర మారుతునిచందు
మదహస్తితోదోమ మారొ నకంచు
దుదిటితో కాత్య మించదయైపగిది
శ్రీ కర్పూతో యేన కంచుతో జోగి
ధడతో విప్రుండు తనికలో వేర
వగలంక మేలచు వుచ్చెతపునీవు
సకలలోకమలెల్ల సామిరాగవుడు
నీ మాట మర్దించి నీరూపు మనచి
నన్నుతోడ్కొని పోదురు నమ్ము మింతకూ
ఏమిరా పాపాత్మ నిలువలేనను నీ మాటలాను
తగునా పాపాత్మ నోటికడ్డములేక

ఏటికీనీ కొవ్వుమాటలాడెదెవేలరా
పాపాత్మ నీచా కొలతల వలె నీమదిలోన
నిన్నుచూచి పళ్ళికిలదవేల పాపాత్మా

సీత ఓరి రావనా అసత్యపోసనా, నన్ను యీపురంబున తెచ్చునదే మహా గర్వంబని గర్వించినావా నీ పుత్ర మిత్రకళత్ర గాత్రయుతంబుగా నాశంబగు నీపని కదలక పొగడవా నన్ను తెచ్చినీవు బ్రతుకుదువాదృష్టా సకలలోకపాపిష్టా

## 13. జానపద విలువలు

1 మనిషి తోలుతో చేయబడ్డబొమ్మ (తోలుతిత్తి) మనిషికి ప్రతీక 'తోలు బొమ్మ'

2 భగవంతుడు 'సూత్రధారి' అతడు ఆడించినట్టుగామనం ఆడుతున్నాం భగవ తుని ప్రతీక బొమ్మలనాడించే సూత్రధారి (భగవతార్)

3 తెర-మనిషికి-దైవానికి నడుమవున్న 'మాయకు' ప్రతీక.

## 14. కళాకారులు

### నిమ్మలకుంట తోలుబొమ్మల బృందం

ధర్మవరం తాలూకా - అనంతపురం జిల్లా

పురుషులు - 40
స్త్రీలు - 20
పిల్లలు - 30
కుటుంబాలు - సుమారు పది
బొమ్మలాట బంధు - 3

వృత్తి వ్యవసాయపుపనులు చేయటం - బొమ్మలు తయారుచేయటం ఇటీవల ప్రభుత్వం వారిచే సొసైటీ ఏర్పాటు చేసుకొని బొమ్మలు తయారుచేసి అమ్మటం కుటుంబ నియంత్రణకు సంబంధించిన బొమ్మల్ని తయారుచేసి ప్రోగ్రాములు ఇవ్వటం

ఒక్కొక్క తోలు బొమ్మలాటకు ఖర్చు సుమారుగా రెండు వందల నుంచీ మూడు వందల వరకు అడుగుతారు.



# 4. జంతువులాటలు

## 1. ఎలుగుబంటి ఆట

ఎలుగుబంటిని అడవిలోనుంచి పట్టితెచ్చి దానికి కొన్ని భంగిమలు నేర్పించి పొట్టకడుపు కొంటారు నమస్కారము చేసే భంగిమ, పొర్లు దండాలు (పల్టీలు) చేపిస్తారు ఇల్లుల్లూ తిరుగుతూ ప్రతి ఇంటిదగ్గరా ఇలాంటి భంగిములు చేపిస్తారు ఆ జంతువు వెంట్రుకలు చిన్న పిల్లలకు మొలత్రాటికి కడతారు అలా కడితే భయపడరని జానపదుల నమ్మకం. ఇంకా చిన్న పిల్లలు భయపడకుండా ఎలుగుబంటిపై కూర్చోపెట్టి త్రిప్పుతారు నోరు లేని జంతువు. ఇలాంటి భంగిమలు చేపిస్తూ పొట్టపోసుకొని జీవనం సాగిస్తున్నారు చాటను ఎలుగుబంటి లాగా తయారుచేసుకొని కంబళిని శరీరపై కప్పుకొని పురుషుడు ఎలుగుబంటిలాగా వంగుతూ నడుస్తూ ఎలుగుబంటిని అనుకరిస్తూ పండగ సమయాల్లో వేషం వేస్తూ ఉంటారు

## 2. కోతులాట

జానపదులు జంతువులకు విద్యలు నేర్పి వాటిద్వారాపొట్టపోసు కొంటారు. కోతిని అలంకరణచేసి దానికి నమస్కారముచేసే భంగిమ పొర్లుదండాలు చేసే అభినయం పశువుల కాపరికి ఎలావెళ్ళాలంటే ప్రక్కనుండే కర్రను మెడపై పెట్టుకొని నడవటం, అన్ని ఒక్కొటికి నోటితో జానపదుడు చెప్తుంటే ఆ నోరులేని కోతి అన్నింటికి అభినయాత్మకంగా చూపెడుతుంది చివరికి డబ్బు ఇస్తున్నపుడు అందరి దగ్గరకెళ్ళి తీసకొనిరావటం చూడవచ్చు కోతి చనిపోయినపుడు ఇంటింట దగ్గరకు ఎత్తుకొని వస్తూ (కుంకుమ, బండారు వేసుకొని) పైకం వసూలుచేసుకొని పూడ్చిపెట్టివస్తారు. ఇది ఈనాటికీ ఈ ప్రాంతంలో ఆచరణలో ఉంది

## 3. గంగిరెద్దు లాట

జానపదులు పశుపక్షాదులకు సైతం, ఆటపాటల్ని నేర్పించి, వాటితో పొట్టగడుపుకోవటం వుంది. అందులో గంగిరెద్దులాట ఒకటి పశువులకు విద్యలు

నేర్పి వీటితో అనేక రకాలైన భంగిమల్ని చూపించి జానపదులు పొట్టగడుపు కొంటారు పశువులు పుట్టినపుడు గోపురము దగ్గర 'నాలుక' లాగా పుట్టటం, తోక భాగంలో నాలుకలాగా పుట్టటం, జరిగేవట. అలాంటి పశువుల్ని దూడలప్పుడు రైతులు గంగిరెద్దులవాండ్లకు దానంగా ఇచ్చేవారు ఆ చిన్న దూడకు విద్యలు నేర్పేవారు, ముఖ్యంగా తల ఆడించటం (వూపటం) ముందరి కాళ్ళు రెండు నేలపై మోకాలిపై వుంచటం ఒక్కొక్క కాలిని ఒక్కొక్కసారి పైకి తీస్తూ మరలా అదే విధంగా వుంచటం దీన్నే 'పంఢరి భజన' అంటారు ఒక మనిషి రెండు తొడలపై ఎద్దు నాలుగు కాళ్ళను వుంచుకోవటం ఎద్దు ఎగవూపిరి పట్టేలా నేర్పించటం

ఈ భంగిమల్నిటినీ జానపదుడు వాయించే మేళానికి, డోలుకనుగుణ గా ఆ గంగిరెద్దులు చూపిస్తాయి మేళంలో రాగాలాపనచేస్తారు ఆ రాగం అర్థమైన ట్టుగా గంగిరెద్దు తలూపుతుంది[39] మేళంలో కళ్యాణి, మోహన్ శ్రీరాగాలు యెక్కువగా పాడుతారు ఈ రాగాల కనుగుణంగా డోలు వాయిస్తారు.

మేళంలో వినిపించే శబ్దాలిలా వుంటాయి

తూ - తు తు తూ
తూ
తు తు తూ త్ తూ
తు తు తూత్తూ
తు తు త్ తూత్

గరుడ స్తంభంలో దీపం వెలిగించి (దానప్పలుపయోగించేది) గంటను కొడతారు గణగణ మనే శబ్దం పుడుతుంది డోలుగతులిలావుంటాయి.

తక తక
తకదింతకధిం
తక తకధిం
తకధిం
తకతోం

డోలు కుడి ఎడమల వైపున రెండు చేతులతో వాయిస్తారు అలావాయిస్తు

నప్పుడు తలనూపటం ఆడించటం ఆ వోకగా జరిగిపోతూ వుంటుంది మేళం వూదే వ్యక్తి మేళాన్ని నోటిలో వుంచుకొని పెదవులపై నిలిపి గాలిపూదుతూ రెండు చేతుల వేళ్ళను మేళానికుండే రంధ్రాలపై ఆడిస్తూ గుండ్రాకారంగా మేళాన్ని త్రిప్పటం, గుక్క తిప్పుకోవటం తలనూపటం వుంటాయి

మొదలోగా గ్రామ లోని జనమంతా వచ్చి నేలపైకూర్చొన్న వెంటనే ఈ గరుడస్తంభం చుట్టూ గంగిరెద్దున్ని త్రిప్పుతారు ఈ ఎద్దుకు రాముడు లక్ష్మణుడు-సీత అనిపేరుపెట్టి పిలుస్తారు సీతకు ఆవును ఎన్నుకొంటారు

లక్ష్మణున్ని పిలిపించి పండరి భజన అడుగులు వేయిస్తారు ఆ ఎద్దు మేళం, డోలు గతుల కనుగుణంగా రెండు కాళ్ళను మోకాళ్ళపై నిలిపి ఒక్కొక్కసారి ఒక్కొక్క కాలిని పైకిత్తిసూ ముడుచుకొంటూ వుంటుంది కాళ్ళకు గజ్జెలు కట్టి ఉండటంవల్లా ఆ గజ్జెలసవ్వడే గంగిరెద్దు నృత్యానికి శ్రుతి తర్వాత గ్రామస్థుల్ని పొగడటం రామున్ని (ఎద్దు) పిలవటం అని మేళంలోని రాగాన్ని వింటున్నట్లుగా తలవూపుతుంది తర్వాత పిల్లల్ని వరుసగా కూర్చోపెట్టి రామునితో ఒక్కొక్కరి భుజంపై కాలుమోపుతూ వారిని తొక్కకుండా వెళుతుంది అపుడు మేళం డోలు, వాయిస్తూవుంటారు తర్వాత ఒకరు నేలపై రెండు కాళ్ళను ముడుచుకొని కూర్చొని ఎద్దును పిలిచి రెండుకాళ్ళను ఒకసారి, నాలుగుకాళ్ళను ఒకసారి తన కాళ్ళపై పెట్టుకొంటారు నాలుగుకాళ్ళనుపెట్టినపుడు ముందరి కాలిని బొమ్మలపై పెట్టుకొని మేళం పడతారు అపుడు ఎద్దుపైకి కిందికి వూగుతుంది ఇలా ఇంత బరువుగల ఎద్దు జానపదునిపై ఎక్కినపుడు అతనికి ఏమిజరగదు అలా అనోరు లేని పశువు అలాంటి భంగిమ నేర్పించటంలో నేర్పరితనాన్ని వుపయోగిస్తారు

చివరిగా సీతారాములపెళ్ళి జరిపిస్తారు రాముడు (ఎద్దు) పక్షాన ఒకరు సీత పక్షాన ఒకరు రంగంలో ప్రవేశిస్తారు మామూలు పెళ్ళికి కావలసిన సామగ్రి నంతా అడిగి ఇప్పించుకొంటాడు సీత రామున్ని నల్లనివాడు, బొనికడుపు అని అంటుందని సీత పక్షాన వుండే మనిషి చెప్తాడు ఆపుడు అలిగి దూరంగా పారి పోతుంది మరలా సీత తండ్రిని రాముని తండ్రి గడ్డం పట్టుకొని ఇలా అడుగు తాడు

పిల్లనీ మామ
బిడ్డనీ మామ

పెళ్ళి చెయిమామ
పెళ్ళి చేయిమామ
పెళ్ళి చేయ్యిమామ

అని గడ్డం పట్టుకొని వంగి అడుగుతాడు తర్వాత రెండు చేతులు దోసిలిపట్టు వత్కాకు ఇస్తానంటాడు అతడు చేయిపడితే రెండు కాళ్ళను దోసిట్లో పెట్టడానికి ప్రయత్నిస్తాడు అతడు తప్పుకొంటాడు సరే సీతను నేనే లాక్కొళ్ళతాను నీవు తప్పుకో అని రాముని తండ్రి సీత (ఆవు) కుండే తాడును పట్టుకొని ఇలా అంటాడు

"అమ్మా సీతమ్మ ఎప్పటికైనా అత్తవారిల్లే చేరాలి పుట్నిల్లు పనికిరాదు లక్షణంగ రామునితో పెళ్లిచేసుకో -అని లేవగా ఆ ఆవు అతని వెంట పోటానికి లేస్తుండగా ఇంతలో సీత తండ్రి

"నువుపోతే నాకన్నంపెట్టేవారు లేరుతల్లో
నువుపోతే నేబాయిలోపడి చస్తాను తల్లో" అంటూ గట్టిగా ఏడుస్తాడు

తర్వాత ఒప్పించుకొని రామున్ని పిలిపిస్తారు పెళ్ళిచేయటానికి సీతమ్మ వస్తూవేరే వూరిదారి ఎడ్తాడు ఎమయ్యా అనిఅడిగితే నేను ఇంకోవూర్లో నా కూతురిని స్తావని చెప్పాను అంటాడు తర్వాత రామున్ని సీత పక్క పక్కలో పండుకొ నేలా చేస్తారు జానపదులు కుంకుమ బండారు పెట్టి సీతారాముల పెళ్ళి ఆ గంగి రెద్దులకు చేస్తారు మేళం డోలు మంగళ గన విషయంగా వాయిస్తారు మరుసటి రోజు ఇంటింటికివెళ్ళి అడుక్కొంటారు గంగిరెద్దులు కూడా ఇంటికింటికి వెళ్తాయి రామునికి, లక్ష్మణికి వేషాలు కొమ్ములకు గుడ్డలు చుట్టి రంగురంగులతో అలం కరిస్తారు 40 పై భాగంపై కొన్నిగుడ్డలు సంచుల్లాగా కుట్టివేస్తారు మొగతాడు గంటలు అన్ని కడ్తారు. సీత (ఆవు)కు నడుముపై చీరలు వేస్తారు బండారు. బొట్టు పెడ్తారు.

## 4. పాము-ముంగిసాట

జానపదులు పొట్టగడుపుకోనేందుకు విషసర్పాల్ని కూడా పట్టితెచ్చి కొన్ని భంగిమలు నేర్పుతారు వాటిలో 'పాము' ముఖ్యము. రకరకాల పాములు పట్టి కోరలుపీకి బుట్టలో బంధించి తిండిపెడుతూ తాను తిండి తింటాడు. నడిబజార్లో

గ్రామస్థులందరూ కూడటానికి ముందుగా డోలును వాయిస్తాడు అందరూ గుమిగూడతారు వెంటనే అందరికీ నమస్కారము చేస్తూ రకరకాలు మాటలు అంటుండగా ఒక్కొక్క మాటకు డోలు ఒక్కసారి వాయిస్తాడు ఆ మాటలు మామూలు మాటలైనా లయాత్మకంగా ఉంటాయి నాగస్వరము, బుర్ర వాయిస్తూ పామును బయటికి రప్పించి పడగనుప్పిస్తాడు బుస్సుమంటూ ఆ పాము పడగతో అటుఇటూ తలత్రిప్పుతూ ఊగుతుంది తర్వాత ముంగిసను పామును వదలిపోట్లాట పెట్టిస్తాడు రెండు పెనవేసుకొని పోర్లుదండాలు చేస్తాయి. తర్వాత రెంటింటిని బంధిస్తాడు ఏవో మంత్రాలు వేసి చిన్న పిల్లవాన్ని నోరుకోసి రక్తాన్ని బయటికి మన కళ్ళ ఎదురుగా వచ్చేలా చేస్తాడు గుమిగూడిన జానపదులు డబ్బులిస్తూ లేదా గింజలు పెడ్తే వెళ్ళిపోతారు రకరకల మాటలతో అందర్నీ ఆకట్టుకొంటాడు



# 5. పగటివేషాలు

## 1. అర్ధనారీశ్వరుడు

శివుని రూపాన్ని ముఖంపై ఒకప్రక్క, స్త్రీరూపాన్ని (పార్వతి) ఇంకో ప్రక్క అలంకరిస్తారు ముక్కుసగభాగంపై గుడ్డను తలమీదుగా అడ్డంగా కడతారు ఒకకాలికి చీర, ఒకచేతికి గాజులు, ఇకోచేతికి ఇంకోకాలికి పురుషుల అలంకరణ, తొడ భాగంలో పులిచర్మం ధరిస్తారు తలపై గంగకోసం స్త్రీ బొమ్మనుంచి వెంట్రుకలో ఉంచుకొంటారు ఆ బొమ్మనోటివెంబడి నీరు వచ్చే విధంగా అమర్చుతారు కావల్సినపుడు ఒకచేత్తో నడుము భాగంలో అమర్చుతారు నడుము భాగంలో అమర్చుకొన్న నీటి తిత్తిద్వారా వాటిని బయటికి పోని స్తారు ఇలా పండుగ దినాల్లో వేసుకొని లేదా ఇల్లిల్లూ తిరుగుతూ ఇద్దరు ముగ్గురు వెంటవస్తూ హార్మోనియం శ్రుతి తోనూ, తాళాల గతులలోనూ శివ పార్వతుల సంబంధమైన కథను తెలియచేస్తూ ఉంటారు స్త్రీ రూపాన్ని కొద్ది సేపు పురుషరూపాన్ని కొద్దిసేపు తెరను మారుస్తూ స్త్రీ పురుష భంగిమలను అభినయిస్తూ వుంటారు

## 2. కాటికాపరి

కాటికాపరి కులంవాళ్ళు ఏడాదికొకమారు ఇల్లిల్లూ తిరుగుతూ భిక్షాటన చేస్తారు తలకుకిరీటం లాంటిది వెనక భాగానుంచుకొని రకరకాల గుడ్డలు ధరించి చేతిలో చెక్కతో చేయబడ్డ గంటను పట్టుకొని ప్రతి ఇంటి ముంగిట కూర్చొని గంటను వాయిస్తూ లయాత్మకంగా మాటలు పాటలవలె పాడుతూ వుంటారు. ఇవన్నీ వారి భాషలో శివసంబంధమైన విషయాల్ని తెలియచేస్తూ వుంటాయి ఇటీవల కాలంలో ఏడాది కొకమారు కూడా రావటం మానేశారు[41]

## 3. దొమ్మరాట

దొమ్మరి కులంవారు ఆడే ఆట 'దొమ్మరాట' ఐదారుమంది కలిసి వుంటారు. చిన్నపిల్లలు మొదలు పెద్దవాళ్ళదాకా అందరూ ఆటలోపాల్గొంటారు స్త్రీలు

కూడా పాల్గొంటారు పొట్టకూటి కోసం ఆడే ఆట సర్కస్ లాంటిది డోలువాద్యాన్ని ఉపయోగిస్తారు మొదటిగా డోలును వివిధగతుల్లో వాయిస్తారు పల్లెలోని జనమంతా గుమిగూడిన వెంటనే ఆట మొదలవుతుంది మొదటిగా చిన్నపిల్లలు పల్టీలుకొట్టటం నేలపై తలను వంచి శరీరమంతాకిందపెట్టటం తర్వాత తలవంచకుండా మనిషి గాలిలోనే గిర్రున తిరిగి నిలబడటం ఒకేసారి రెండు మూడుసార్లు తిరుగుతూ యథాస్థానానికి రావటం రెండుచేతులను నేలపై మోపి కొద్ది దూరం నడచివెళ్ళటం స్త్రీలు శరీరాన్ని విల్లులాగా పిల్లన్నంతవరకు వంచి రకరకాల విన్యాసాలు చూపించటం

చిన్నపిల్లలు గుండ్రాకారంగా వుండే ఇనుపకడ్డీలలో పరుగెత్తుకొని వచ్చి తలను దూర్చి పల్టీకొడతారు దీన్నే 'కప్పదూరు' అంటారు అదే ఇనుపకడ్డీ రెండు మూడుచోట్ల నిప్పుఅంటించి మండుతున్న కడ్డీలలో కప్పదూరు[42] పోస్తారు, ఇనుపకట్టీలను పొట్టపై నుంచి వంచటం, అలాగే కంటిలో వుంచుకొని వంచటం గొంతుకింద వుంచుకొని వంచటం తర్వాత వెదురు బొంగను (సుమారు పది మూరలు పొడవు కల్గినది) చేత్తో పట్టుకొని దానిపై చిన్న పిల్లవాన్ని పొట్టపై నుంచుకొని రెండుచేతులను వాదలి 'బ్యాలెన్సు'గా పట్టుకోవటం ఇలాంటి భంగిమలు ప్రాణాలకి తెగించి ప్రాణం కోసం (పొట్టకూటికోసం) చేస్తుంటారు చూసేవారికి ఆశ్చర్యాన్ని ఒక్కొక్కసారి గుండెలు పగిలిపోయినంతగా అనిపిస్తాయి

పై భంగిమలుచేసేటపుడు డోలును ఇలావాయిస్తూ ఉంటారు.

డుబు డుబ్
డుబు డుబ్
డుబు డుబ్
డుబు డుబ్

వీరు సంచార జీవులు తమ ఆటను అన్ని గ్రామాలకు వెళ్ళి చూపిస్తుంటారు

## 4. పులివేషం

పులులులాగా అలంకరించుకొని తప్పెట వాద్యానికనుగుణంగా వేసే భంగిమలు పండగల్లో ఈ నాటికి చూడవచ్చు మోహరం, ఉగాది దసరా వేడుకల్లో 'పులివేషం' తప్పనిసరిగా చూడవచ్చు కళ్ళు చెదిరిపోయేరంగులు,

శరీరమంతా పులుల సారలుంటాయి సెడ్డీ మాత్రం మర్మాంగానికి వేసుకొంటారు ఇక మిగిలిన భాగమంతా పులిసారలు రంగులతో వేస్తారు తలకు విగ్గు లాంటిది పులితలను ధరిస్తారు వెనకవైపు తోక పైకివంచబడి వుంటుంది నోటిలో నిమ్మకాయను పండ్ల సహాయంతో పట్టుకొంటారు రెండుచేతులు, కాళ్ళను, పులిలాగా నేలపై భంగిమలకు నడకలను చూపిస్తారు తప్పెటలో పులి అడుగు 'ఆరే కోపును ఇలావాయిస్తారు దీనికనుగుణంగా అడుగులు వేస్తుంటారు

జెగ్ జెగ్ జెగ్‌నకన్
జెగ్ జెగ్ జెగ్‌నకన్
గ్ జెగ్ జెగ్‌నకన్
జెగ్ జగ్ జెగ్‌నకన్

## 5. పోతేషికం

పోటేషికాలు మోహరం (పీర్లపండగ) పండుగలో తప్పనిసరిగా వేస్తారు. ప్రతి పల్లెల్లోనూ ఈనాటికీ మనం చూడవచ్చు కాళ్ళకు గజ్జెలుకట్టుకొని యర్ర సెడ్డీతొడుక్కొని తెల్లటి పంచె సెంటల్‌కట్టు కట్టుకొని, దీనిపై సెడ్డీగజ్జెలు కడతారు ముఖానికి బొట్టు రంగు రంగులవి పెట్టుకొని, వేపమండలను తలకు రుమాలుగా అమర్చు కొంటారు తప్పెటలో పులిఅడుగు, గుండంకోపు వాయిస్తుండగా వాటి కనుగుణంగా అడుగువేస్తుంటాడు

పులిఅడుగు . జెగ్ జెగ్ జెగ్‌నకన్
గుండంకోపు జెగ్‌నకన్ జెగ్‌నకన్
జెగ్‌నకన్ జెగ్‌నకన్

పోటేషికానికి మెడకు ఇనుపకడ్డీని తగిలించి దానికి కట్టెను చెక్కి ఇంకొ కరుపట్టుకొంటారు అతడుకూడా అవే భంగిమలలో అనుసరిస్తూవుంటాడు ఐస్కాలు[43] పోయటం శరీరంలోని అవయాలను ఏ విధంగనైనా ఆడిస్తూ వుంటారు బాగా తాగికూడా ఆడతారు

## 6. బారకట్టేపికం

ఐదుఏడు సంవత్సరాల నడుమవయస్సున్న పిల్లవానికి శరీరంపై గుడ్డలు లేకుండా చేసి నులకమంచంపై వెళ్ళకిల పండబెట్టికాళ్ళు చేతులుకట్టుతారు 'మర్మాంగచుట్టూ

చూరులోదాచి పెట్టిన తలవెంట్రుకల్ని దట్టంగా కప్పుతారు 'మర్మాంగం' కనిపించే విధంగా జాగ్రత్తపడతారు ఒకరు పూజారిలాగా రుమాలుచుట్టి నామంపెట్టి పంచెకట్టుకొని చేతిలో నిప్పులున్న మూగటి వుంటుంది మంచాన్ని నలుగురు ఎత్తుకొని గుంపులో వుండేస్త్రీల దగ్గరకు వెళ్ళి మంచానికి ముందు భాగంలో వుండేవారు దించి 'మర్మాంగం' వారికి కనిపించే విధంగా చూపెడుతారు పూజారి నిప్పులున్నమూగట్లో ఎండుమిరపకాయల్ని వెంటుకల్ని వేసి, మర్మాంగం చుట్టూ తిప్పి ఆ పొగను గుంపులోటి స్త్రీలపక్క తిప్పుతాడు అందరూ గొల్లున నవ్వుతూ మిరపకాయల కారంతో దగ్గటం, కళ్ళలోనీరు రావటం వుంటుంది వెంటనే మంచాన్నెత్తుకొని ఇంకో గుంపులో వు దేవారిదగ్గరకెళ్ళటం అలా తిరుగతూ వుండటం చేస్తారు తర్వాత మంచాన్ని ఇంటికి తెచ్చి పిల్లవాన్ని విడిపించటం వుంటుంది

## 7. బూరుబూరు సుంకలమ్మ

'శక్తికి నిదర్శనం సుంకలమ్మ స్త్రీరూపంగా బొమ్మను తయారుచేసుకొని, గంపలో పెట్టుకొని వేపమండలు, గాజులు బండారు పెట్టిస్త్రీలు నెత్తినెత్తుకొని చిన్న 'ఉరుము'ను బూర్ బూర్ మంటూ వాయిస్తూ పురుషుడు కొరడా (పెట్టకోలి) ను పట్టుకొని లంగాను ధరించి నడుముకు గజ్జెలు కట్టుకొని ముందర వస్తుంటాడు. అలా ప్రతి కూడలి దగ్గర బొమ్మను దింపి ఇల్లిల్లూ తిరగుతూ అడుక్కొంటూ పొట్టగడుపుకొంటున్నారు కొరడా 'ఫెళఫెళ' మని తన వీపుకు కొట్టుకొంటాడు. చేతినుంచి రక్తాలు చుక్కచుక్కలుగా కారుస్తాడు అది చూడలేక ఇంటిలోని వారు వెంటనే భిక్షము పెట్టటం పంపించటం జరుగుతుంది. శరీరమంతా రక్తపు మరకలతోనే వుంటాడు అలా ప్రతి నెలకు రెండునెలలకొకసారి ఊరూర తిరుగుతూ 'సుంకలమ్మ' దేవతలను పూరేగిస్తూ వుంటారు. ఉరుము ఇలా వాయిస్తారు.

బూర్ బూర్ బూర్
బూర్ బూర్ బూర్
బూర్ బూర్ బూర్
బూర్ బూర్ బూర్

## 8. బుడబుడక్కలవారు

బుడబుడక (డమరుకంకంటె చిన్నది) అనే వాద్యాన్ని కుడిచేతిలో పట్టుకొని, నల్లని గొడుగు పట్టుకొని నల్లనికోటు, దానిపై రకరకాల చీరలు, మెడలో పూసల దండలు, పంచెను ధరించి నుదుట బండారు బొట్టుపెట్టి, తెల్లవారు జామునే గ్రామమంతా తిరుగుతారు ఆ బుడబుడక నుంచి తనే వాయిస్తూ ఆ శబ్దాల కనుగుణంగా మంచి చెడ్డలు జరుగబోయే దినాల్లో సంగతులను (భవిష్యత్తు) తెలియ చేస్తుంటారు అలా గ్రామమంతా తిరిగి తెల్లవారిన తర్వాత ప్రతి ఇంటిదగ్గర కొచ్చి అడుగొంటారు పీరిపై నమ్మకమెక్కువ జానపదులకు పీరు వస్తే గ్రామానికి మంచిదని భావిస్తారు. అందుకు భిక్షమేస్తూ పంపిస్తారు బుడ బుడక నుంచి పుట్టే ధ్వనులుఇలా వుంటాయి

అరడుక్
యరడుక్
వురడుక్
బుర్లడుక్
డురడుక్[44]

బుడబుడక్కవార్ని చూస్తూపిల్లలు భయపడుతూవుంటారు పీరికి భవిష్యత్తు ఇలా తెలుకొంటారని వారే చెప్తారు శ్మశానంలో (వడికోల్లే) శకునపక్షిద్వారా అర్ధరాత్రి సమయాలలో భవిష్యత్తును తెల్సుకొని గ్రామాల్లో చప్తారని అంటారు శకునపక్షిభాష పీరికి మాత్రమే తెల్సునట పీరిని చూడగానే ఎవరైన కనిపెడ తారు వాద్యం మ్రోగే మ్రోతను పట్టివారు భవిష్యత్తును శకునపక్షిద్వారా వూహించి చెప్తారట. 'బుడబుడక'ను మాత్రం తెల్లవారు జామునుంచి పొద్దుపుట్టే వరకు వాయిస్తారు తర్వాత ప్రతి ఇంటిదగ్గర వాయిస్తూఉంటారు లయాత్మక మైన మాటలు అంటూ వుంటారు కొద్దిసేపు వాద్యాన్ని మ్రోగించటం, కొద్దిసేపు మాటలు లయాత్మకంగా చెప్పటం ఉంటుంది పీరు చెప్పేమాటలపై జానపదులకు నమ్మకమెక్కువ పీరు సంచార జీవులు అపుడపుడు గ్రామాలు తిరుగుతూపోతూ ఉంటారు

## 9. రామలక్ష్మణులు-రావణుడు

రామలక్ష్మణునిల్లాగా ఇద్దరూ, రావణాసురునిలాగా ఒకరు అలకరించుకొని

ఆయుధాలు ధరించి రావణుడు ఒక ప్రక్క రామలక్ష్మణులు ఇంకో ప్రక్క ఎదురు బదురుగా నిలబడతారు ప్రక్కన హార్మోనియం శ్రుతివాయిస్తుండగా మాటలు పాటలు-పద్యాలు పాడుతూ యుద్ధ రంగంలాగా ప్రతి ఇంటి దగ్గరా యుద్ధంచేస్తూ వెళుతూ ఉంటారు ఉగాదిపండగ, మొహరం (పీర్ల పండగ) పండగల్లో తప్పనిసరిగ వేస్తూ ఉంటారు రావణుడు పది తలలు నకలీవి తయారుచేసుకొని ధరిస్తారు గ్రామంలోకి వారికి ఆ అలంకరణ పట్ల ఆసక్తితో చూస్తూవారివెంబడి పోతుంటారు

ఇంకా కొద్దిమంది సంచారా జీవులుపొట్టకూటికోసం రకరకాల పురాణ పాత్రలను రోజుకొకసారి అలంకరణ చేసుకొని పట్టణాలలో ఆడుక్కొంటూ వుంటున్నారు

## 10. గొల్లెల కాపర్లు

జానపదులు పండగల సందర్భాల్లో సల్లదం తొడుక్కొని కంబళి భుజంపై వేసుకొని, వృత్తపయ్యతో కట్టెను చేతపట్టుకొని తలకు చీరను రుమాలు కట్టుకొని, ఒక్క మీసం కుంకుమస్సితో జంపుగా తీసుకోని కుడితిసీరును 'కుండలో బెట్టుకొని, కొన్ని గడ్డపేలికలు దాల్లో వుంచుకొని గుంపుగా వుండే స్త్రీ పురుషుల దగ్గర కెళ్ళి వేషం వేసుకొన్న వారికి వరసఅయిన స్త్రీ పురుషుల దగ్గర కెళ్ళటం అపుడు

"దా దా టుర్ ఒర్
కెవ్ కెవ్ కెవ్"

అంటూ వెళ్ళటం వారుపరుగెత్తుతూ వుంటారు ముసలివాళ్ళ దగ్గర కెళ్ళి పురుషున్ని "దా దా మేకలమీదికి మేకపోతు లేక అరసి మొత్తుకుంటున్నాయి" అంటూ ఈడ్చుకొని వస్తారు అందరూ బాగా నవ్వుతూ ఉంటారు.

# పాదసూచికలు

1 ఈ వంశస్తులు పెద్దమ్మ కాపులు

2 స్త్రీ మర్మాంగాన్ని చెప్తారు

3 సాదును మూత్రం అంటారు

4 జమిడిక రూపాంతరం

5 వాద్యం మ్రోగటానికి వీలుగా వుండటానికి

6 అమ్మవారు-అల్లమ్మ-అమ్మయ్య-ఆటలమ్మ-పెద్దమ్మయ్య-నల్లలమ్మ

7 ఈ మండలంలో తిప్పుకొనిపోయింది అని వాడుక

8 మేకపోతు-గొర్రి పొటి-కోడి-దున్నపోతు (ఎనుపోతు)

9 ఇలా వరాన్ని అడిగే ఆచారం సుగాలీలలో కూడా వుంది ఇది ఇంకా ఆసక్తికరంగ వుంది వీరు మేకపోతును బలియిస్తారు మేకపోతులను అలాగే 'గొర్లపిల్లల' గూటికింద వుంచి వారంరోజులు భజనచేస్తారు. అపుడు వారిభాషలో పాటలు (చూ అధ్యాయం -4 - సుగాలి పాటలు) పాడుతూ తట్టనాదం చేస్తారు వారంరోజుల తర్వాత తలను పూజించి వరం అడుగుతారు. అపుడు వరమిస్తే ఆ ఏడాదంతా పంటలు బాగా పండుతాయని నమ్ముతారు. లేదా వరమియ్యకపోతే మరలా దేవర చేస్తారు భక్తితో సుగాలీలు ఈనాటికీ చేసే దేవర 'తండాల' లలో చూడవచ్చు

10 చూ చిగిచర్ల కృష్ణారెడ్డి-గ్రామీణసంస్కృతి (అనంతపురం జిల్లా జానపద గేయాలు) పొలిపాటలు

11. ఆషాఢశుద్ధ ఏకాదశి - తొలిఏకాదశి - దుక్కులేకాదశి-ఇత్తనాలేకాదశి

12 స్వాధీనం

13 హెచ్చరిక

14 వృద్ధి-అయ్యవారు అనే పదాలు ఈ మండలంలో వాడే మాండలికాలు

15. సంగీతంలో ఆది తాళంలాంటిదిది అంటే అప్రదక్షిణ మార్గాల్లో తిరుగుతూ ఎదురుబదురుగా పరస్పరం కట్టెతో కోపువేయటం

16. టక్‌టక్ - టుక్ అనే శబ్దాలు చేయటాన్ని తాళ్ళుటం అంటారు వెలుద్ది రెండు కట్టెల్ని అడ్డంగా పట్టుకొని వుంటాడు లోవుద్దిరెండు కట్టెల్ని టక-టక మని కొట్టుకొని టుక్ మని వెలుద్ది కట్టెలపై కొడతాడు దీన్ని తాల్చడం అంటారు

17 దీన్ని కుప్పటికట్టి అంటారు

18 గణనాథ

19. పెనుకొండకు పదిమైళ్ళ దూరం ( శనీశ్వరదేవున్ని పూజచేస్తారు ) నవగ్రహాలు

20 ఇది జానపద వైద్యం

21 పెళ్ళిళ్ళ సమయంలో బియ్యాన్ని 'సేసబ్రాలు' పోస్తారు ఆలాంటిదే జాడి

22 అందుకే వీరిని చిత్తూరుప్రాంతంలో మల్లయ్యకుక్కలు అనిపిలుస్తారు

23 తరుముకొని-వెంబడించటం

24 తాళభజన -'చిరతలభజన'-చెక్కభజన-చేతులభజన

25 నారాయణదాసు -శ్రీపాండురంగబృందావన సంకీర్తనలు

26. రతి అంటే స్త్రీపురుషుల సంగమం అనే అర్థంకాదు మనిషికి ఏమైనా గాలిచేష్ట తగిలినపుడు (దయ్యం పట్టినపుడు) అర్థరాత్రి సమయంలో మూడు త్రోవలు కలిసేచోటున ముగ్గుపిండితో రకరకాలుగా గీతలు పోస్తారు నిమ్మపండు బూడిదతో బాగా పోస్తారు దీన్నే 'రతి' పోయటం అంటారు కానీ ఇక్కడ బాగా ఆవుపేడతో అలికి ముగ్గుపిండితో అందమైన 'ముగ్గు' పోసి దానిపైజ్యోతిని తయారుచేసి ఉంచుతారు

27 గుత్తిం సర్వయ్య చౌడమ్మపదాలు -(పుట- )

28 గుత్తిం సర్వయ్య చౌడమ్మపదాలు (పుట-2)

29 గుత్తిం సర్వయ్య చౌడమ్మపదాలు (పుట-7-8)

30 గుత్తిం సర్వయ్య చౌడమ్మపదాలు (పుట-22-23)

31 గుత్తిం సర్వయ్య చౌడమ్మపదాలు (పుట-28-30)

32 గుత్తిం సర్వయ్య చౌడమ్మపదాలు (పుట-49-50)

33 గుత్తిం సర్వయ్య చౌడమ్మపదాలు (పుట-7071)

34 -పూనకం

35 చూ. వివరాలకు కేతిగాడు బంగారక్క సంభాషణ

36 ఈ శ్లోకంలో తప్పులున్నాయి కాని నేను సవరించటానికి ప్రయత్నపూర్వకంగానే ప్రయత్నించలేదు వాళ్ళు ఎలా పాడుకొంటున్నారో అలాగే వుంచటం జరిగింది

37. గణనాథ

38 బోయ కులంలో ఒక వంశం

39 ఏమిరా గంగిరెద్దులాగా అలా తలూపుతున్నావు

40 ఏమి గంగిరెద్దులా ఆముస్తాబు

41. తిలిజేపల్లి లక్ష్మీకాంతం కాటికాపరి వర్ణన 'హరిశ్చంద్రనాటకంలో' కళ్లకు కట్టినట్లు వర్ణించారు.

42 కప్పదూరు గ్రామాల్లో బావుల్లో ఈత ఈదుతారు. కప్పలు తలను ముందుకువంచి కాళ్ళను వెనక్కి చాపుకొని నీటిలో దూకుతాయి అదే మాదిరిగా ఈతాడే సమయంలో ఎత్తునుంచి నీటిలోకి అలాగే దూకుతారు నీటిలో రకరకాల విన్యాసాలు చేస్తారు నీటిలో మునగటం కాళ్ళుచేతులతో కొట్టటం, పల్టీలు కొట్టటం, నీటిలో అనేక రకాల శరీర అవయవాల చలనంచేస్తారు

43 బస్కీలు శరీరాన్ని వంచటం నేలపై కూర్చొని కుడికాలును ఎడమ చేతిని పైకెత్తటం ఒక్కొసారి చాపటం తర్వాత ఎడమకాలును చాపటం కుడిచేతిని పైకెత్తటం మరలా లేవటం ఇలా ఒక్కసారిచేస్తే బస్కీ అంటారు

44. మహేశ్వర సూత్రాలలాంటివిగా వినిపిస్తాయి వర్ణాలు డమరుక ధ్వనుల్లో అంతరిస్తాయని ఊహించటం వెనుకకూడా ఈ జానపద జీవితనేపథ్యం ఉందనిపిస్తుంది



నాల్గవ అధ్యాయం

# నాగరిక ఛాయలు కల్గిన జానపద నృత్యాలు

## అ. జానపద నృత్య నిర్వచనం :

'Folk dance is a dance done by the folk' అని నిర్వచించటం చాలా సులభం ఇంతకన్నా సులభంగా జానపద నృత్యాన్ని నిర్వచించలేం కాని అసలు సమస్య 'Folk' అంటే ఏమిటో నిర్వచించటంలో ఉంది సమగ్రంగా Alan Dundes అనే జానపద విజ్ఞాన పరిశోధకుడు Flok అంటే ఇలా నిర్వచించాడు 'Alan Dundes tells us that 'The folk' are any group of people "who share at least one common factor' Immediately we get into trouble if we consider a group whose common denominator is a non-flok dance from For example, if a classical ballet company comprises a folk Its dance, by this logic, is folk dance clearly no folklorist would find that conclusion tenable Neitheir would the ballet Company The ballet company would admit, however that much of Their choreography, many of Their steps, and several of their story themes are based on or inspired by flok dance what do they mean by folk dance? they mean "National" dance and/or "ricial" dance and they usually mean the "Unrefined" dances of European peasants [1]

జానపదులంటే సమానమైన సాంస్కృతిక ధర్మాల్ని జనసమూహమని అంగీకరిస్తే వారి నృత్యరీతులే జానపదనృత్యాలని నిర్వచించాలి ఇలా నిర్వచిస్తే జానపదం కాని నృత్యమేమిటి? అనే ప్రశ్నకు సమాధానం చెప్పవలసి వస్తుంది ఉదాహరణకు సురభినాటక 'కంపెనీ ఉంది అందులో పనిచేసే కళాకారులు

దాదాపు సమానమైన సాంస్కృతిక నేపథ్యమున్నవారు అలా గని వార్ని జానపదులని మనమన్నా వారే ఒప్పుకోరు, కానీ వారి నాటకాల్లో జానపదాంశాలు చాలా ఉండవచ్చు ఉదాహరణకు తోలు బొమ్మలాట ఉంది దీనికి ఈనాడు ప్రభుత్వం వారు శిక్షణ కేంద్రం ఏర్పాటుచేసి శిక్షితులైన ఉపాధ్యాయుల ద్వారానే వాటిని ప్రజలకు నేర్పించారనుకొందాం అప్పటికీ అది జానపదనృత్యం కాదు అందుకే జానపద నృత్యానికి దేశీయత, జాతీయత, అసంస్కృతత్వం మౌళికమైన ధర్మాలని దండస్ స్పష్టం చేశాడు కూచిపూడి నాట్యాన్ని జానపద నృత్యంగా అంగీకరిస్తామా, అంగీకరించం అసలు ఆ కళాకారులే అంగీకరించరు బృంద నృత్య రీతి, అడుగులు వేయటం, అడుగులు వేసే పద్ధతులు, ఇతి వృత్తాలు వీటిలో జానపదంశాలు కూచిపూడి నాట్యసంప్రదాయంలో కనిపించినా అది కేవలం జానపద నృత్యం కాదు [2]

## ఆ. సంప్రదాయ నృత్యం-జానపద నృత్యం

జాతీయ తెగకు సంబంధించిన అసంస్కృతమైన నృత్యాలు జానపద నృత్యాలు కావచ్చని కొందరంటారు [3] యూరప్‌లోని గ్రామీణుల్ని దృష్టిలో ఉంచుకొని చెప్పిందది

In Asia we find dance forms that, in ethnoclassifications, are not folk dance but that are traditional as opposed to innovative, Such as Gagaku, and whose choreographers are lost in the pages of time and are even imputed to be mythical beings They would reject the idia of nocation as the criterion to divide folk and Classic forms because often the most highly polished Performers of classic dance forms do not make dance a vocation For example, the classical dances of java have, until recently, been performed only by the aristocracy or those attached to the royal house and they danced for pious as well as artistic motives On the other hand, throughout Asia ther are traveling companies of Performers who make their living from dancing Their work is not considered a classical art, but it is considered a folk form, for example the Burmese Traveling Troupes [4]

ఆసియా ఖండంలో ఈ నిర్వచనం ఎంతవరకు సరిపోతుందన్న విష యంగా కొంత ఆలోచించాలి గగాకు తెగలో ఆ తెగకు సంబంధించిన సాహిత్య మంతా పోయింది పురాణాలే వారికి ఇతి వృత్తాలయ్యాయి ఆ తెగవారికి నృత్యం వృత్తికాదు జావాలో సంప్రదాయ నృత్యాలున్నాయి వాటిని చేసేవారు రాజ కుటుంబీకులు. అయిన రాజాశ్రయమున్న సంపన్న కళాకారులు వారు జానపదులు కారు కానీ అవి జానపద నృత్యాలే ఇక బర్మాలో నృత్యాన్ని ఆధారంగా పొట్టపోసుకొనే సంచార జీవులున్నారు వాళ్ళ నృత్యాల్లో శాస్త్రీయ లక్షణాలున్న వాటిని జానపద నృత్యాలుగానే పరిగణిస్తారు

ఇండియాలో కూడా సాంఘికంగా జానపదులైన వాళ్ళు శాస్త్రీయ నృత్యా లకే నాగరికులైన వాళ్ళు తోలుబొమ్మలాట వారు తమ జీవితాన్ని ప్రదర్శించ కుండా రామాయణ కథ న్ని ప్రదర్శిస్తున్నారు అలాగే నాగరికమైన ఈనాటి సినిమాల్లో నృత్యమంతా జానపదీయం, అంటే నృత్యాన్ని వృత్తిగా కలిగి వుండటం, కలిగి వుండ పోవటమనేది జానపద నృత్యాన్ని నిర్వచించటానికి పనికిరావన్నమాట ఈ సందర్భంలో Joarn wheller keallinol omoku' ఇలా అంటున్నాడు "For Asia it seems that the major distriction between folk dance and art dance is the degree of recognition and prestige awarded to the dance from by the national governament [5]

ఈ అంశం చాలా ప్రధానమైంది ప్రభుత్వం ఆదరిస్తే శిష్టమవుతోంది. నిరాదరిస్తే జానపదమవుతోంది అందుకే మాన్యాలు పొందిన భరతనాట్యం కూచిపూడి మొ॥ ఆరాధనా నృత్యాలు శిష్ట నృత్యాలుగా నాగరిక వర్గాల్లో మాత్రం మిగిలి వున్నాయి

## ఇ. ఆదిమజాతి నృత్యం-జానపద నృత్యం కాదా :

Curt Sachs అనే విమర్శకుడు ఇలా అంటున్నాడు Primitive dance is not folk dance for example, Claimed that folk dance fits on an evolutionary continuum midway between primitive and civilized dance and its presence in the contemporary world is a kind of living relic [6]

Arnold Hoskell tells us the distinction is that primitive dance is communal and segregated by sex whereas folk dance is characterized by couples dancing with partners of the opposite sex [7]

పై అభిప్రాయాల్ని గమనిస్తే ఆదిమజాతి నృత్యాలకు నాగరిక నృత్యాల మధ్యలో జానపద నృత్యమందని అంగీకరించాలి అంతే కాకుండా ఆదిమ నృత్యం గత జీవితాన్ని ప్రతిబింబిస్తుంటే, జానపద నృత్యంలో అది ప్రధమంగా కనిపించటం లేదు స్త్రీ పురుషులు విడివిడిగా ఆడటం, కలిసి ఆడటం, అన్నది కూడా జానపద నృత్యాన్ని నిర్వచించటానికి పనికిరాదు. కొంతమంది అమెరికన్లు జనప్రియ నృత్యాన్ని కూడా జానపద నృత్యం కన్నా భిన్నంగా అంగీకరిస్తున్నారు " Popular dance is nonritual, nonprofessional, unself-conscious, anonymously choreographed, and usually performed by couples of the Opposite sex " [8] ఈ నిర్వచనం కూడా జానపద నృత్యాన్ని ఎలా వేరు చేయాలో చెప్పడంలేదు

## ఈ. దేశీయ నృత్యం - జానపద నృత్యం :

ఇంకా కొంతమంది ప్రాంతీయ నృత్యమన్న పేరిట వెర్నాకులర్ డ్యాన్స్‌ని జానపద నృత్యమని పిలుస్తున్నారు [9] జాజ్ నృత్యాన్ని వాళ్ళు ప్రాంతీయ నృత్యమంటున్నారు మరి కొందరి అభిప్రాయం ప్రకారం ఇది జనప్రియ నృత్యం. ఏమైనా జాజ్ నృత్యం కూడా జానపదీయమైందే

## ఉ. జానపద విజ్ఞానం జానపద నృత్యం :

ఆలన్ డండస్ పై పద్ధతిలో కాకుండా జానపద విజ్ఞానంలో చేరగల్గిన అంశాలన్నింటిని ఒక పట్టికలో ఇచ్చాడు దానిలో నృత్యంతో సంబంధమున్న భాగాలు ఇలా ఉన్నాయి 'Folklore eucludes myths, legends, folktales, jokes, proverbs, riddles, chants, charms blessings curses, Oaths, insults, retorts tauts, teases, tongue twisting and greeting and loave taking formulas It also includes folk costume, folk dance (and mine) folk art folk belief (or superstition) folk medicine, folk instrumental music folk

**songs, folk speech, folk similies, folk metophory and names This list provides a sampling of the forms of folklore It does not include all the forms These materiale and the study of them are both referred to as folklore To avaid confus-sion it might better to use the term folklore for the materials and the them folkloristics for the study of the materils** డండస్ పట్టికలో చేరని మౌఖిక జానపదాంశమే ఇంత విస్తృతమైన పట్టిక నిచ్చి కూడా ఆయన జానపద విజ్ఞానంలో ఈ అంశాల సేకరణ విశ్లేషణ సూత్రీకరణ ఇవన్నీ భాగమే అన్నాడు

## ఊ. జానపద నృత్యంలో - రెండు దశలు.

జానపద నృత్యాన్ని జానపద సంగీతాన్ని రెండు దశలు కల్గిందిగా హేర్‌బర్గర్ గుర్తించాడు.[10] వాటిని ఆయన ప్రాథమిక దశ ద్వితీయదశ అని పేరు పెట్టాడు ప్రథమ దశలో ఇవి ఒక సమూహ జీవితంలో అవి భాజ్యంగా వున్న అంశమని, రెండవ దశలో విభక్తమై కేవలం ఆసక్తి వున్న కొందరి చేతుల్లో కళారూపంగా మిగిలిపోతుందని చెప్పారు[11] ఈ భేదాన్ని గుర్తించటం జానపద నృత్యాన్ని అతి సూక్ష్మంగా నిర్వహించటానికి సహాయపడుతుంది. అంటే ప్రాథమిక దశలో నృత్యసంగీతాలు నేర్చుకోబడనవి కావు రెండవ దశలో నేర్చుకోబడుతున్నాయి ఇపుడు నృత్యాల్లో ఈ రెంటిలో ఏ దశ కన్పిస్తుందో చూడాలి, సహజంగా చూసి నేర్చుకోడం ఉంది, కొన్ని సందర్భాల్లో నేర్పించటం ఉంది ఈ విషయాన్ని ఆలన్‌దండస్ గుర్తించాడు.[12] అంటే జానపద నృత్యంలో ఈ రెండు దశలూ ఉన్నాయనే అర్థం దీన్ని గురించి జాన్ పీ.ర్ కిలినోహామోకు ఇలా అంటున్నాడు[13]

ప్రథమ దశ - మౌఖికం .- **In any case, the method of transmission for first existence folk dance is compareble to an oral tradition in depending upon a one to-one relationship between the transmitter and the receives**

ద్వితీయదశ-అభ్యస్తం - **Second existence folk dance, as Hoerburger points, out is more fixed or less dynamic. It is usually excerpted from the dramatic context and is not a part**

of a larger complex that requires oral transmission But insofor as it is often a recreative process through how to-do it manuals, and by mnemonic aids and natation sistems used by the dance leader

అందువల్లా జానపద నృత్యాల్లో ప్రాథమిక దశ కూడా అక్కడక్కడా ప్రాచీనతకు చిహ్నంగా కన్పిస్తుంది

## ఋ. జానపద నృత్య నిర్వచనం :-

పై అంశాలన్నింటిని దృష్టిలో ఉంచకొని Joannwheeler Kaalino-homoku ఇలా జానపద నృత్యాన్ని నిర్వచిస్తున్నాడు [14]

"A vernaculal dance form performed in either its first or second existence as part of the little tradition within the great tradition of a given society It is understond that dance is an affective mode of expression which requires both time and space It employs motor behavior in redundant patterns which are closely linked to the definitive features of musicality

జానపద నృత్యం ఒక సంఘానికి చెందిన విశిష్ట సంప్రదాయాన్ని కానీ అందులో భాగమైన విలక్షణమైన సంప్రదాయాన్ని కానీ జీర్ణించుకొన్న ప్రాంతీయ నృత్యం అది ప్రాథమిక ద్వితీయ దశల్లో ఏ దశలోనైనా ఉండవచ్చు ఈ నృత్యానికి ప్రధానమైన లక్షణం భావ వ్యక్తీకృతి రసవ్యంజకత, నిర్దిష్ట దేశకాలాలు గీతాత్మకమైన అనుగుణమైన భౌతికమైన ఇంద్రియాల క్రమచలనం ఇది కూడా కేవలం ప్రాయోగికమైన నిర్వచనం మాత్రమే ఒక జాతికున్న సంప్రదాయాల్లో విశిష్టమేదో విలక్షణమేదో గుర్తించటం చాలా క్లిష్టమైన పని ఉదాహరణకు చోడిగాని కలాపం విలక్షణ మనుకుంటే లంకాదహనం విశిష్ట మనుకోవాలి కానీ అందులోనే మైరావణ చరిత్ర ఉంది అది విలక్షమైన అంశం అంటే ఈ రెండు అంశాలు కూడా ఒక జాతి జీవితంలో కలిసే వుంటాయని అర్థం అయినా పై నిర్వచనాన్ని ఆధారంగా జానపద నృత్య లక్షణాలను ఇంత వరకు చర్చించటం జరిగింది

## ఋ. భారతీయ నృత్య కళావిశిష్టత

భారతదేశంలో అనేక తెగలున్నాయి ఒక్కొక్క తెగకు ఒక్కొక్క నృత్యం ఉంది కోలాటం లాంటి నృత్యాలు కొన్నింటిని మాత్రం అన్ని తెగల వారు నేర్చుకొంటున్నారు కూచిపూడి నృత్యం జానపద నృత్యం ద్వారా ప్రభావం పొందిన శిష్ట నృత్యాలుగానే మిగిలినవి జానపద నృత్యాలు జానపద నృత్యాలుగానూ, గిరిజన నృత్యాలు గిరిజన నృత్యాలుగనూ చిరస్థాయిగా నిలిచి పోతాయి దీనికి భారతదేశ సాంస్కృతిక చరిత్ర కారణమని ప్రొజష్ బెనర్జి అభిప్రాయ పడ్డారు

**The very existence of folk-dance implies a certain complexity of development in the social order, and also even by its name, implies a distinction based more or less roughly on this complexity, whereby the ruder arts of the less cultureld members of society are distinguished from the more sophisticated arts of the educated classes.[15]**

ఈ దృష్టితో జానపద నృత్యాన్ని ఇలా నిర్వచిస్తున్నాడు **"We may say that folk-dancing is that dancing which has developed among the peasantry, and is maintained by them in a fluid tradition without the aid of the proffessional dancer, teacher or artists, and is not at least in its particular from, observed and practised in towns on the stage, or in the ball-room.[16]**

గ్రామీణ జీవితంలో పుట్టి పెరిగి ధారావాహికంగా ఏ నృత్యశైలి ప్రవహిస్తూ వుంటుందో అది జానపద నృత్యం దీన్ని నేర్చుకోవడానికి వృత్తి కళాకారుల శిక్షణ అవసరం లేదు ప్రత్యేకంగా గురువు అక్కరలేదు నగర జీవితంలో ఏ రంగంలోనూ ఈ నృత్యాలు కనిపించవు. ఈ నిర్వచనంలో సాధక బాధకాలు ఇలా వున్నాయి. గ్రామీణ జీవితంలో పుట్టటం మార్పులు రావటం, గురువు అక్కరలేకుండా పోవటం, గ్రామీణ జీవితంలో పుట్టి నగర వాతావరణంలో పెరుగుతున్నా, మార్పులు వస్తున్నా నృత్యాన్ని (విద్య) నేర్చుకోవటానికి గురువు అవసరం. గురువు లేకుండా నృత్యవిద్య ఎలా అబ్బుతుందని ప్రశ్న రావచ్చు ఇలాంటి సాధకబాధకాలతో కూడుకొన్నది జానపద నృత్యం.

## ౫. నృత్యవికాసం - జానపద నృత్య నిర్వచనం :

శిష్ట జానపద గిరిజన నృత్యాలను మూడింటిని వేరు చేస్తూ ప్రొజెష్ బెనర్జీ ఇలా అంటున్నాడు 'Unlike classical dance, folk-dance was made for the sheer pleasure of the performers and not for the entertainment of the public While the primitive and aboriginal dancing was nothing but a spontaneous and emotional rhythmic expression preparatory to a ritual or battle Folk-dance, with the progress of civilisation, has developed from aboriginal dancing and this less primitive form of dance discards much of the spontaneity, crudeness and the occasional Indecency of the other Nevertheless' primitive dance was the foundation of folk-daance and folk-dance was the foundation of the refined forms Refined when degenerates re-enters the category of folk dance, just as folk-dance with culture and development ascends to that of refined dance [17]

ఈ భేద పరిగణన చాలా సూక్ష్మంగానూ అర్థవంతంగానూ ఉంది ఆదిమ నృత్యాలే జానపద నృత్యాలకు, జానపద నృత్యాలే శిష్టనృత్యాలకు మూలమని గుర్తించటంతోపాటుగా శిష్టనృత్యం అపభ్రష్టమైతే, జానపద నృత్యమవుతుందని జానపద నృత్యాలే సంస్కృతి అభివృద్ధితోపాటుగా సంస్కరింపబడి శిష్టనృత్యా లవుతాయి అని ఆయన అభిప్రాయపడ్డాడు

శిష్టనృత్యం రంగస్థలంపై ప్రదర్శించేటపుడు రసభావ ప్రధానంగా ఉంటుంది జానపద నృత్యం అకృత్రిమంగా మౌలికంగా వుంటుంది మానవుడు నాగరికుడు కాగా వాడిలో వివేకం పెరిగి సహజస్పందం తగ్గిపోయి భావాన్ని యథాతథంగా బాహాటంగా ప్రదర్శించటానికి సిగ్గుపడతాడు భావానికి ఏదో ఒక అడుగు జతకూడనిదే ప్రదర్శించడు ఆ దృష్టితో చిన్నపిల్లలు స్వేచ్ఛగా ఎగిరి గంతులు వేయటంలాంటిది గిరిజన నృత్యం 'డ్రిల్లు' టీచరు ముందు చేసే 'ఎక్సర్‌సైజు' లాంటిది శాస్త్రీయ నృత్యం అసలు గిరిజన నృత్యాలతో పోల్చి చూస్తే జానపద నృత్యంతో కొన్ని సందర్భాల్లోనైనా కృత్రిమత కన్పిస్తుంది.

దీనికి కారణం జానపద నృత్యాలలో శిష్టనృత్య అపభ్రష్ట రూపాలు కావడం (కూచిపూడి)

జానపద నృత్యానికి మరో లక్షణం అది జాతికి దర్పణంగా ఉండటం ఒక జాతి మనుషుల స్వభావం కళాసంస్కృతి స్వచ్ఛత సామాజిక చరిత్ర ఆచార వ్యవహారాలు తెగల విలక్షణతలు అన్నీ కన్పించే నృత్యమే జానపద నృత్యం.

భారతదేశంలోని జానపద నృత్యాలలో మరో ప్రత్యేకత ఇలా ఉంది ఇతర దేశాలలో శిష్టనృత్యాలలో కనిపించే తాత్వికనేపథనం జానపద నృత్యంలో కన్పించదు కానీ భారతదేశంలో తత్వనేపధ్య విషయంలో జానపద శిష్ట అన్న భేదాలు కన్పించటం లేదు.

కూచిపూడిని భరతనాట్యాన్ని పోల్చి చూస్తే ఈ విషయం బాగా తెలుస్తుంది. భరతనాట్యంలో కన్నా కూచిపూడిలో ఉన్న అభినయ ప్రాధాన్యం దేశీయమైన సంస్కృతి సంప్రదాయం భాగవత తత్వదృష్టిని బాగా ప్రదర్శిస్తారు

భారతదేశంలో జానపద నృత్యానికి మరో లక్షణం ఇలా వుంది ప్రకృతితో ప్రత్యక్ష సంబంధం ఉదాహరణకు పాచ్య పాశ్చాత్య నృతరీతుల్లోనే ఆయా ప్రదేశాల నైసర్గిక పరిస్థితుల ప్రభావం కనిపిస్తోందని బెనర్జీలాంటివారు ఇలా తెలియజేస్తున్నారు

**"This influence of natural environment on the movements of the dance is perhaps to some extent responsible for the difference between the energetic activity of the dance of the west, with its generally exhilarating climate, and the gentler swaying movements of that of the East with its heavy atmosphere drained by the hot sun of all incentive to physical energy** [18] ఆయన ఒక ఉదాహరణ చూపించాడు మణిపూర్ ప్రాంతంలో ఎక్కడ చూచిన భయంకరమైన అరణ్యాలు కన్పిస్తాయి గాలివానల బెడద విపరీతం. చెట్లు భయంకరంగా ఊగిపోతూ ప్రేళ్ళతోసహా పైకి లేచి పోవటం చాలా సహజం మణిపూరి నృత్యంలో ఈ ప్రాకృతి బీభత్సాన్ని ప్రతీ

కరించే అభినయ మొకటుంది నాట్యంచేస్తూ వున్నట్టుండి నటులు క్రిందికి కూలబడతారు నడుముకు పై భాగాన్ని చేతులు పైకి సాపి అతివేగంగా ఆడిస్తారు [19]

జానపద నృత్యం కొన్ని సాంఘిక మత సంబంధమైన కార్యకలాపాలకు సంబంధించిన చేష్టలను ముద్రాల రూపంలోనూ, గతుల రూపంలోనూ ప్రదర్శిస్తుంది నాట్యమాడే వారి సంఖ్య కూడా జానపద జీవిత విలువలతో ముడిపడే వుంటుంది అందుకే ఉదయశంకర్ ప్రతిభారతీయుడు ఒక నృత్యకళాకారుడే అన్నాడు [20] ఈనాటికీ ప్రతిభారతీయుడూ జానపదుడే జానపదుడికి శ్రుతిలయ జ్ఞానాలు పుట్టుకతోనే వస్తాయి జానపదులు వాయించే వాద్యాలు కూడా అతి సులభంగా చేర్చుకోగలుగుతారు పాడే రాగాలు అంతే

పాశ్చాత్య దేశాల్లో నాట్యాలు మతంచేత చాలా తక్కువగా ప్రభావితమైన దన్న విషయం ముందే సూచింపబడింది భారతదేశంలో నృత్యం మతంతో అనివార్యంగా ముడిపడింది అందుకే పురాణేతిహాసాలు వస్తువులతో సంబంధమున్న నృత్యాలే ఎక్కువ ఆదిమజాతి నృత్యాలు స్త్రీ పురుషులు ఇద్దరూ పాల్గొంటారు స్త్రీకి కొన్ని బాధ్యతలు స్త్రీ పురుషులలో కుటుంబ సంఘ జీవితల్లో అధికారాలూ బాధ్యతల్లో వచ్చిన మార్పుకి సూచనమా అన్నట్లు జానపద నృత్యంలో స్త్రీ పురుషులు కలిసి పాల్గొనటం రానురాను తగ్గిపోవటాన్ని చూడవచ్చు వారికి వీరికి వేర్వేరుగా ఆటలు పాటలు ఏర్పడటం కూడా జానపద జీవిత విధానంలో స్త్రీ పురుషుల నడుమ ఏర్పడిన శ్రమజీవన సూచిస్తోంది

## ఇా. దాక్షిణాత్య నృత్యాలు :

ద్రావిడ భాషా సంబంధమున్న తమిళ, మళయాళ, కర్నాటక, కేరళ, ప్రాంతాలలో ప్రచార యత్నంగా వ్యవహరించే దాక్షిణాత్యనృత్యాలతో తెలుగులో కూడా చాలా సన్నిహిత సంబంధాలున్నాయి

1 తమిళనాడు .- బిందునృత్యం, కరగం, కుమ్మి (కోలాటం)

2 కేరళ - కథాకళి, పులియన్ల నృత్యం, ఏనేలకండి నృత్యం, ఫలయార్ కలి నృత్యం, మోహ్లాకలి, వెలక్కలి, కోల్ కలియో పిల్లపట్టు, ఒట్టంటుల్లర్ (కుమ్మి)

3 కర్నాటక బాలకట్ నృత్యాలు

4 బతకమ్మ, సిద్ధీ, దండారియా నృత్యాలు

కొరవ పల్లవ, కురిలి కరణ్‌వంటి దేశ దిమ్మరులు ఈ నృత్యాన్ని కర్నాటకలో చేస్తారు ఆరుగురు వ్యక్తులు వలపన్ని పిట్టల్ని పట్టుకొనే నృత్యాల్ని చూపెడతారు.

కరగ నృత్యంలో సాముగిరిడీ లుంటాయి నాలుగైదు చిన్న కుండలతో ఒకేసారి చమత్కారాలు చేయటం ఈ నృత్యంలో ప్రత్యేకత కుమ్మి (కోలాటం) అన్ని రాష్ట్రాలోనూ వుంది కొన్ని కోపులు (రకాలు) వేర్వేరుగా ఉన్నప టికీ అన్ని రాష్ట్రాల్లోనూ కుమ్మి కోలాటాం అనే పేర్లతో సమానంగా పల్లెల్లో ఈనాటికీ చూడవచ్చు

కథాకళి కేరళలో ప్రాధాన్యం ఒకే నర్తకుడు స్వయంగా పాడుతూ తానే అభినయిస్తాడు తోడుగా మద్దెం గంట మ్రోగుతుంది పులియన్లు యనే వారు పండగ దినాల్లో దేవాలయాల ముందు చేసే నృత్యం పులియన్ల నృత్యం. 'ఇరుల' అనే కొండజాతివారు మృగాలను వేటాడే విషయాన్ని తెలిపేది 'వివేల కరడి' నృత్యం రామాయణ భారత పురాణాలనుండి కథను గైకొని తప్పెట వాద్యాన్ని కనుగుణంగా 'జనం' పండగలో పులయాలు (హరిజనులు) చేసే నృత్యం పుయార్కలి నృత్యం మంచారు ప స్త్రీం చేసేది మోప్లాకలి నృత్యం చిన్న కర్రముక్కలు పట్టుకొని వలయాకారంగా తిరుగుతూ కొట్టటం కేరళ వీర సంప్రదాయాలకు సజీవంగా నిల్చిన నృత్యం 'వెలక్కలి'

కర్నాటక పంటకోతలోనూ, పండగల్లోనూ 'కుప్పా' అనే పొడుగాటి నల్లని కోటుకు, తెల్లని తలపాగా ధరించి పురుషులు చేసేది బాలకట్ నృత్యం

ఆంధ్రప్రదేశ్‌లో దండారియా నృత్యం పురుషులు మాత్రమే చేస్తారు. సిద్ధీ నృత్యాల్ని తెలుగునాట కన్పించే ఔత్తరాహ సంప్రదాయంలో వివరించటం జరుగుతుంది

## ఎ. ఔత్తరాహ సంప్రదాయ నృత్యాలు :

**అస్సాం** :- బగురుంబ నృత్యం, మెయగెన్‌యా నృత్యం, బిహునృత్యం ఖౌల్ల నృత్యం, వేటనృత్యం, లాహోనృత్యం, నాగానృత్యం మొ॥

బగురుంబ నృత్యాన్ని సాయంత్రం చేస్తారు ప్రేమ ఉత్సాహ వివశత మహోల్లాస గతులకు ఇది పేరుపొందింది ఖోదో సంగీతగాన వాద్యాల గానం ఈ నృత్య ఆకర్షణను ద్విగుణీకృతోత్సవం చేస్తుంది మెయ్‌గెన్‌య్ నృత్యం పంటకోతల నృత్యం బోదో జాతి వారు పంట కోతల సమయంలో దీన్ని ఆడతారు బహునృత్యం మిజో జాతి అతిథులకోసం చేసే నృత్యం వేట నృత్యాన్ని జైతులు అనే కొండజాతివారు చేస్తారు సుందరంగా చేసే నృత్యాలు లాహోనాగ నృత్యాలు [21]

**మణిపూర్ :-** రాసనృత్యం, లాయ్‌హరోబి, పుంగ్‌చోల నృత్యం, హెలాయ్‌నృత్యం, తైపోచోంగ నృత్యం, నాగజాతి నృత్యం, ఫైక్ నృత్యం, సుడిగాలి నృత్యం, టండన్ పెయ్‌బాక్.

మత సంబంధమైంది రాసనృత్యం శివపార్వతులకు సంబంధించింది లాయ్‌హరోబ ఒకరుగానీ అంతకంటె ఎక్కువమంది గుమికూడి చేసే బృంద నృత్యమే పుంగ్‌చోల నృత్యం మానవుని యొక్క సృష్టిగాథ ప్రదర్శన చూపెట్టేది వైపోచోంగా నృత్యం రీతిలోనూ, కథావస్తువులలోనూ చాలా విస్తారమైన వైవిధ్యం కలది నాగజాతి నృత్యాలు సుడిగాలి వేగాన్ని మహావేగంతో తిరుగుచున్న రథచక్రాన్ని అనుకరిస్తూ చేసే కేవలం ఆంగిక చలన నృత్యం పైచక్ నృత్యం ఆలుమగలు చేయిచేయి పట్టుకొని దేవతల్ని ప్రసన్నుల్ని చేసుకోవటానికనుగుణంగా చేసే నృత్యం టండన్‌ఫెయ్ చోక్ నృత్యం [22]

**ఈశాన్య సరిహద్దు ప్రాంతం :-** యాక్ నృత్యం, దుహినృత్యం సంగ్‌తం నృత్యం

ప్రజల జవసత్వాలకనుగుణంగా వుంటూ ప్రాచీన కథ బీజం కల్గింది తంత్రిచేత వెళ్ళకొట్టబడటం జడలబ్బరె (దూర్) ఎదురుపడటం వంటి అసాధారణ అనుభవాన్ని యాక్ నృత్యం ప్రదర్శిస్తుంది వేటకు సంబంధించింది దుప్పి నృత్యం సంగ్‌తం జాతివారు పులులవేటకు బయలుదేరే ముందు సంగ్‌తం నాగులు చేసే పనుల్ని సంగ్‌తం నృత్యం ప్రదర్శిస్తుంది [23]

**డార్జిలింగ్ ప్రాంతం -** లేపాచ్ నృత్యం, పాప్‌థో నృత్యం, లేపాచ్ నృత్యంలో స్త్రీ పురుషులుభయాలూ పాల్గొని నిదానంగా కదలికలు మొదలు

పెడతారు తర్వాత కదలిక మరింత దృఢతరమౌతుంది సిక్కిం నృత్యాల్లో పాప్‌ఢో నృత్యం ప్రసిద్ధం పాప్‌ఢో అంటే 'పాదగతి' అని అర్థం-స్త్రీ పురుషులు విడివిడిగా వేర్వేరుగా నృత్యం చేస్తూ వర్తులాకారంగా తిరుగుతారు [24]

**హిమాచల్ ప్రదేశ్ .-** రాసనృత్యం, ఛతోరి నృత్యం, దంగీ, దీపక్ ఝుంజర్, చంబానృత్యం, పాంగినృత్యం, ఖన్నినృత్యం, కొరకుక్ నృత్యం, కుమౌన్

శృంగారానికి సంబంధించింది రాసనృత్యం స్త్రీ పురుషులు రంగురంగుల బట్టలు ధరించి చేయిచేయి పట్టుకొని మధ్యలోనుండు వాద్యగాళ్ళ చుట్టూ నృత్యం చేస్తారు దంపతులు పాల్గొంటూ చేసే నృత్యం ఛత్రారి నృత్యం దీన్నే దంగి, దీపక్, ఝుంజర్ అని మూడు రకాలుగా చేస్తారు స్త్రీ పురుషులు కలిసి ఆడేది చంబానృత్యం చలికాలంలో సంతోషంతో పూర్ యాత్రకు వెళ్ళి చేసే నృత్యం పాంగినృత్యం మత సంబంధమైన సమావేశాలలో స్త్రీ పరుషులు చేయిచేయి పట్టుకొని అర్ధచంద్రాకారంగా తిరుగుతూ చేసేది ఖని నృత్యం. మోకాలితో చలనం ఎక్కువగా చేస్తూ చటుక్కున క్రిందికి కృంగటం, కాళ్ళు కత్తెరలాగా వెడుతూ స్త్రీ పురుషులు కలిసిచేసే నృత్యం కొరకున్ నృత్యం అనేక సాంఘిక ఉత్సవాల్లో చేసేది కునకాన్ నృత్యం [25]

**ఊ) ఉత్తరప్రదేశ్ -** బరాదినటి నృత్యం, చౌపలకేదార నృత్యం, పాండవ నృత్యం

మత సంబంధమైన నృత్యం బరాదినటి నృత్యం యువతీ యువకులు బాగా అలంకరించుకొని రెండు అర్ధచంద్రాకారాలుగా ఏర్పడి గిర్రుగిర్రున తిరుగుతారు ప్రేమగాథల్ని గానం చేస్తారు భక్తికి సంబంధించిన నృత్యం చౌపలకేదార నృత్యం పాండవ నృత్యంలో భారతగాథలుంటాయి నృత్యగాళ్ళంతా వీరంతా గదలు పట్టుకొంటారు ద్రౌపదిలాగా ఒక స్త్రీ వుంటుంది [26]

**ఋ) పంజాబ్ :-** భాంగ్రానృత్యం, ఝుమర్ నృత్యం, కత్రీ నృత్యం ధమ్నాల్ - పంజాబ్ పురుషులు చేసే జాతీయ సామాజిక నృత్యం 'భాంగ్రా' రైతుకు సంబంధించింది ఝుమర్ నృత్యం పంటకోతల తర్వాత కత్రీలోయలో చేసే నృత్యం 'కత్రీ' చేతులు చేతులు పట్టుకొని వలయాకారంగా ఏర్పడటంతో

ఆరంభమవుతుంది స్త్రీలు పాడే అనుసరణ గీతం వేగం పుంజుకొనే కొద్దీ చేతు లతో పాదాలతో తాళంవేస్తూ అన్నివైపులా తిరుగుతారు ధమానల్ నృత్యం రానున్న వసంతాన్ని గూర్చి సస్యసమృద్ధిని గూర్చి ఆనందాన్ని ప్రకటిస్తే-కొన్ని భక్తిభావాన్ని ప్రకటిస్తాయి ఇతి వృత్తాలు మిశ్రితాయి [27]

ఋ) కాశ్మీర్ :- కబ్రజీ నృత్యం, బండానృత్యం, బాలుర నృత్యాలు' గద్దీ నృత్యం స్త్రీలుమాత్రమే గుంపుగా పాట పాడుతూ ఒకరి చేతులొకరు పట్టు కొని ఒకరి చేతినొకరు చరుస్తారు ఇద్దరిద్దరు కలిసి గిర్రున తిరుగుతారు అప్పుడప్పుడు రెండు వరసలు ఏర్పడి జంటలుగా దూరివచ్చి ఒకరితో ఒకరు నృత్యం చేసేది 'కబ్రజీ' - కసరత్తులతో కూడుకొన్నవి బాలుర నృత్యాలు బాలుర మోకరించి సలాం చేయుట, శరీర అవయాల్ని సంచలింప చేయుట ముఖ్యం గద్దీ నృత్యంలో పిల్లన గ్రోవుల డొళ్ళు వాయిస్తుండగా ప్రశాంతగతుల్లో ప్రారం భమై వేగం పుంజుకొంటుంది చప్పట్లు కొడతారు [28]

ౠ) తూర్పు ప్రాంతం ఒరిస్సా - చౌనృత్యం, గరుద్వహన్, మాయా శబరి బృద నృత్యం, కరణ్ నృత్యం జదూర్ నృత్యం

ఒరిస్సా యొక్క విశిష్ట నృత్యరూపం చౌనృత్యం కళింగ యుద్ధానికి సంబంధించిన పురాణగాథ నృత్యానికి కేంద్రం పైక్ నృత్యంలో కర్షకసేవ సభ్యులు పాల్గొంటారు కిరాతార్జునీయం ఇతివృత్తం ఖడ్గాలను, డాలను అద్భు తంగా ఉపయోగించే గరుద్వహన్ నృత్యం బృంద నృత్యం మాయాశబరి నృత్యం శివసంబంధమైంది మయూర్‌భంజ్‌లోని భూమియాలు చేసేది కరణ్ నృత్యం భూమియాలు తమదేవుడైన 'బురుబాంగ' ప్రీతికోసం చేసేది జదూర్ నృత్యం [29]

ౡ) బెంగాల్ - సంతాల్ నృత్యం, కీర్తన్, స్త్రీలు చేసే నృత్యం సంతార్ నృత్యం అడవుల్లో నివసించే కల్పిత దేవతల్ని ప్రీతి పరచినట్లు భావి స్తారు కులప్రసక్తి లేకుండా ఆడే నృత్యం కీర్తన్ నృత్యం [30]

ఎ) బీహార్ :- జదూర్ నృత్యం, ఖరియాల నృత్యం, ఒరియా నృత్యం శృంగార యువకుడు, కన్య కలిసి పాడుతూ చేసేది జదూర్ నృత్యం రాంచి

ప్రాంతంలోని దుర్గమ పర్వతాలలో నివసించే ఖరియాలు చేసే నృత్యాలు ఖరియాల నృత్యాలు ప్రేమ భావ ప్రకటన నృత్యగతులు తెల్పేది జటియానృత్యం.[31]

**ఏ) మధ్యప్రదేశ్** - కర్మానృత్యం, కట్ పుట్లీ నృత్యం, లక్ష్మీజాగర్ నృత్యం, గోండుజాతి ప్రధాన నృత్యం కర్మా బొమ్మల నృత్య ప్రదర్శనం కట్ పుట్లీ నృత్యం లక్ష్మీదేవి విగ్రహాన్ని షేమాల్ వృక్షం క్రింద వుంచి యువతీ యువకులు రాత్రి సమయంలో నెం రోజులపాటు చేసే నృత్యం లక్ష్మీ సాగర్ నృత్యం (లక్ష్మీకై మేల్కొని వుండుట)[32]

**ఐ) రాజస్థాన్ .-** ఝురియా నృత్యం, తీర్ తల్వార్ నృత్యం, గౌర్ నృత్యం, గరసియాల వలార్ నృత్యం, తేరాతేవీ, కుచ్చియోరి (కీలుగుఱ్ఱం)

ఝురియాలంటే కొయ్యకర్ర అని అర్థం స్త్రీ పురుషులు వేర్వేరుగా వలయాకారంగా చుట్టుకొని డోలు, సన్నాయి నగారా ధ్వనుల కనుగుణంగా ఉల్లాసం వుట్టిపడేటట్లు నృత్యం చేస్తారు తీర్ తల్వార్ నృత్యంలో పురుషులు కత్తులు, విండ్లు అంబులు పట్టుకొని చేస్తారు వలయాకారంగా చేసే నృత్యం గౌర్ నృత్యం తేరాతేవీ నృత్యం బృందనృత్యం, ముగ్గురు పురుషులు మాత్రమే కలిసి చేస్తారు[33]

**ఒ) ఉత్తరప్రదేశ్** · కథక్ నృత్యం, రాసలీల, నౌతంకి నృత్యం, అహేరుల నృత్యం, చమార్ల నృత్యాలు

అహేరుల జాతిలో చేసే నృత్యం అహేరుల నృత్యం. కృష్ణుని జననం గూర్చి తెలిపేది పన్మకారులు చేసే హాస్యనృత్యాలు చమర్ల నృత్యాలు[34]

**ఓ) పశ్చిమ ప్రాంతం :-** సౌరాష్ట్ర-గుజరాత్-మహారాష్ట్ర !- రాసలీల దాండి యారాస నృత్యం, టిప్పని నృత్యం, భక్తి నృత్యాలు, పధర నృత్యాలు, నారికేళ దిననృత్యం, హోలీ నృత్యం, గర్బానృత్యం, దీపకనృత్యం, దీహాకళ్ (దహీఖంగి) నృత్యం సట్టానృత్యం, తమాషా నృత్యం, పావడారూపకం, కుంచి గుమ్మెట్ నృత్యం, పంటినృత్యం, దబ్బినృత్యం

శ్రీ కృష్ణుని జీవితగాథతో రాసలీల నృత్యాలు దాండియా రాసనృత్యంలో నృగాగా మువ్వలుకట్టిన కోలాటపు కర్రలు పట్టుకొని కోలాటమేస్తారు కోలాటపు కర్రలు ఒకదానిపై ఒకటి కొట్టినపుడల్లా గజ్జెలు గల్గలుమని మ్రోగుతుంటాయి రకరకాలుగా కోలాట వేస్తారు[35] శివునికి సంబంధించిన భక్తి నృత్యాలు పధరనృత్యంలో సముద్రమత్స్య పారిశ్రామికుల జీవితాల్ని తెలియజేసేవి వలయంగా, అరవలయంగా నృత్యం చేస్తారు నారికేళ నృత్యం, తొలకరి నృత్యం, దంపతులు చేసేది హోలీనృత్యం, నట్టానృత్యం హాస్యం శివుని వీరగాథలు తెలిపేది పావడా నృత్యం పుంగడి ఆటను ఇద్దరు కలిసి ఆడతారు భుజాలపై పాదాలు పట్టుకొని పురుషులు స్త్రీలు వారితో కలిసి నృత్యం చేసేది కుంచి గుమ్మోన్ నృత్యం పంటలకు సంబంధించిన పనుల్ని చూపించేది పంట నృత్యం [36]

## ఏ. తెలుగునాట కనిపించే ఔత్తరాహ సాంప్రదాయాలు :

**అ) సుగాలీ నృత్యం :-** ఈ నృత్యాన్ని లంబాడీ, బంజారా, తాండా నృత్యమనీ కూడా పిలుస్తారు ఆంధ్రప్రదేశ్‌లో గిరిజనులుగానే మిగిలారు పల్లెలకు దూరంగా కొండల్లో ఇల్లు స్వంతంగా నిర్మించుకొని కట్టెలు కొట్టుకుంటూ అమ్ముతూ జీవనం సాగిస్తున్నారు కూలీనాలీ చేయటం, వ్యవసాయం చేయటం వీరికి బాగా తెలుసు కష్టించి పనిచేయటం వీరి వృత్తి, పండుగలు పబ్బాలు చాలా సాంప్రదాయ పద్ధతిలో చేస్తారు స్త్రీలు ప్రత్యేకమైన దుస్తుల్ని ధరిస్తారు అద్దాలతో కుట్టిన రవిక, పైట, చీర ముక్కలు పొడుగాటి పాగంలు చేతులనిండా ఏనుగు దంతాలతో చేసిన గాజులు, వెంట్రుకలకు రకరకాల పూసలు కాళ్ళకు గజ్జెలు కట్టుకొని ఉంటారు అనంతపురం జిల్లా ధర్మవరం మండలంలో వీరి నృత్యం ప్రతి ఏటా 'కాముని పున్నమి' రోజున తప్పనిసరిగా చేస్తారు కల్లు సారాయి బాగా తాగి స్త్రీలుమాత్రం నృత్యం చేస్తారు

వీరి నృత్యంలో ముఖ్యంగా చేతుల నూపటం, గుండ్రాకారంగా తిరగటం, ముదుసలు, యవ్వనంలో వుండే స్త్రీలు నృత్యంలో పాల్గొంటారు వీరి మధ్యలో లేదా పక్కన ఒక పురుషుడు మాత్రం తప్పెటగతి కొడుతుంటాడు తప్పెట

గతుల కనుగుణంగా స్త్రీలు రకరకాల అడుగులు గుండ్రాకారంగా తిరుగుతూ చేస్తారు పాటలు వారి భాషలోనే పాడుతారు

నృత్యంలో సుమారు 10 మంది పాల్గొంటారు అందరు సాంప్రదాయంగ ధరించే సుగాలీ దుస్తుల్నే ధరిస్తారు కాళ్ళకు గజ్జెలు కట్టుకొంటారు గుండ్రాకారంగా తిరుగుతూ చేతుల చప్పట్లుకొడుతూ తప్పెట లేదా 'తట్టలతో' 'టకటక' అనే శబ్దాని కనుగుణంగా నృత్యంచేస్తారు స్త్రీలు చేతులను పైకెత్తుతూ వెనక్కి తిప్పుతూ ముందుకి వంచుతూ ఉంటారు ప్రతిసారి అందరూ, ఒకేసారి లయగా చప్పట్లు కొడతారు పాట ఒకరు పాడుతుండగా మిగిలిన వారంతా వంత పాడుతారు వీరి పాటలను వీరి గురువైన 'సేవలాక్' మీదనే ఎక్కువగా పాడుతారు మొదటిగా గుండ్రాకారంగా నిలబడి చేతులతో ముందరికి వంగి చప్పట్లు కొడుతూ పాడేపాట ఈ పాటలను వారికి యిష్టమున్న అడుగునే వేస్తూ పాడతారు పలానా అడుగులూ పలానా పాట పాడాలనే నియమం లేదు వారి పాటలు [illegible] వున్నాయి

కోయినారియే కోచళోసోసో
కోయినారియే కూణినచోడో
కోయినారియే శంక్రనచోడో
కోయినారియే కాయ్ ఆంకుదీవ
కోయినారియే రవియ్యదీచ
సమసోతిఠి జోర జానలిజో

వెంటనే గిర్రున తిరిగి శరీరాన్ని కిందికి పైకి వంచుతూ లేస్తూ చేతుల్ని పైకెత్తి చప్పట్లు కొడుతూ గుండ్రాకారంగా తిరుగతూ అదే సమయంలో పాడే పాటను ఒకరు పాడుతుండగా మిగిలినవారంతా వంత పాడతారు

బాలెపెంచనే వెంటాపర్ రెడి బోలిరీవ
రెడి బోల రీచక్ జినం దేకరేచ
సావుకార్ భీకి య్యార్ చోరలూట్ రేచ
బాయేపెంచనే వెంటాపర్ రెడి బోలిరేచ
రెడి బోలి రీచక్ జనం దేకరేవ
సావుకార్ హనుమంతరెడ్డిర్ చోరలూటరేవ

జాఏ పెంచనవెంటావర్ రెడి వోంఢీచ
రెడిబోల రీవక్ జనం దేకరేచ
సావుకార్ రంగార్ చోరటాటరేచ
జాఏ పెంచన వెంటాపర్ రెడి వోయిరేచ
రెడి బోలరేచక్ జనం రేకరేచ
సావుకార్ నాజిర్ చోర టాటరేచ

ఇంకా పాటలో ఒక్కోచరణం అయిపోగానే గుండ్రాకారంగా వుండే వారంతా విడిపోయి ఇద్దరూ ముగ్గురు చేరి వెంటనే ఇంకో చరణం పాడి తర్వాత అందరూ ఒకచోట గుమిగూడి గుండ్రాకారంగా తిరగటం, చప్పట్లు బిరబిరా కొట్టటం, నృత్యం బిరబిరా చేయటం వుంది అలాంటి పాట

రస్త రస్తగాయితే లిమిలిక్ బజ్జేయే
పైసా ఫోలింగ్ మేన జోకిటరాద
జాకిటి ఫాడవే ఆవే గీచ
ఒర మొలసగాద

రస్తరస్తగాయిలే లిమిలిక్ బుజ్జాయే
పైసాఫోలేంగ్ మన సోడోదరాద
సాడో ఫాటనే ఆవగోచ
ఓరమొలసగాద

రస్తరస్తగాయిలే లిమిలిక్ బజ్జాయే
పైసాఫోలింగ్ మన ఛంటియ్యాదరాద
చంటియ్యా ఫాటనే ఆవగోచ
ఓరమొలసగాద

రస్తరస్తగాయిరే లిమిలిక్ బజ్జాయే
పైసాఫోలింగ్ మన అడకాంట్ దరాద
అడకాంట్తూటనే ఆవగోచ
ఓర మొలసగాద

ర_స్తర_స్తగాయిలే లిమిలక్ జిజ్ఞాయే
పైఘో లేంగ్ మన కమ్మలదరాద
కమ్మల తూటనే అవగోచ
ఓరమొలసగాద

ర_స్తర_స్త గాయిలే లిమిలిక్ బజ్ఞాయే
పైసాపోలింగ్ మన గోలుసు దరాద
గొలుసు తూటానే ఆవగోచ
ఓరమొలసగాద

ర_స్తర_స్తగాయిలే అమిలిక్ జిజ్ఞాయే
పైసా ఫోలింగ్ మన పైనా దరాద
పైనా తూటోవే ఆవగోచ
ఓర మొలసగాద

ర_స్తర_స్తగాయిలే ఆమిలిక్ బజ్ఞాయే
పైసా పోలి గ్ మననత్తుదరాద
నత్తు తూటోనే అవగోచ
ఒరమొలసగాద

సుగాలీలు నివసించే స్థలానికి తండ (తాండా) అని పేరు, వీరిని 'లంబాడీలు' అని పిలుస్తారు వీరి నృత్యాల్లో పాడుకొనే మరికొన్ని పాటలు

ఖాళియా మావిలేక సోరి పోలేరిచ
ఖాళిమాయా వీలే సానేరి ఫీలేరిచ
పానకకు ఛరే పెంచిథారి మోటో
పెంచిథారి మోటో వోకడ ఒరచోటి

ఖాళియాకు ఏలే సపారి ఆఫోలేరిచ
ఖాళియాకు ఏలే సపారి ఫీఁరిచ
సపారికమ్ ఛరే పెంచి థాఁమొటో
పెంచిడాఁమొటో వో కడ ఒరచోటి

కాళగోడశేఎర్ బేబి ఏ
కాళలింగిళ మామా బేబిబేబి
మళాల్ మఆడారియే కాళంగళ మాయా
రతడ ఘోద శేపర్ బేబి ఏ
రతడ్ లింగళ మాయ బేబి బేఏ
వజా వజారియే రతడ్ అంగళమాయ
వేళ ఘాడశేపర్ వేవిఎ
వేళ అంగళముపం బేబిబెఎ
మ్యగ్గుఎడారియే వేళ అంగళ మాయ

ఇంకా సుగాలీల మీద ఇతరులు తెలుగులో పాడే పాటలుకూడా ఉన్నాయి ఈ పాటలు సుగాలీ నృత్యం ఇతరులు నేర్చుకొన్నపుడు పాడే పాటలు అవి-

1\. ఏమె సుగాల పాపిడి బాసతో బగలిదుదువు
బాసగోసా నాకు తెంవదు తెలుగులో తెగచెప్పము ॥ఏమె॥

ఏమె యఱ్ఱాగుం టాకుపోయి నేను యఱ్ఱపావడ తెచ్చితి
మఱ్ఱపావడ కట్టుకొని రైకకావా లంటివి ॥ఏమె॥

ఏమె రేగిగుంటాకుపోయి రైక వకటి తెచ్చితి
రైక ఏమో తొడుక్కొని పైట కావాలంటివి ॥ఏమె॥

ఏమె పొప్పూరికి పోయి నేను పైట వకటి తెస్తిని
పైట ఏమో వేసుకొని పూలు తెమ్మని చెప్పితివి ॥ఏమె॥

ఏమె పులివెందులకు పోయి నేను పూలు ఏమె తెచ్చితి
పూలు ఏమె పెట్టుకొని సబ్బు కావాలంటివి ॥ఏమె॥



**అ) సిద్దీ నృత్యం :-** హైదరాబాద్ ప్రాంతంలోని సిద్దీలు చేసేది సిద్దీ నృత్యం ఇది భారతీయేతరమైన జానపద నృత్యం పుట్టుకతో సిద్దీలు ఆఫ్రికన్లు 14వ శతాబ్దం మధ్య భాగంలో (అరబ్బులు, టర్కీలు, ఇరానీలు వంటి ఇతర ముస్లింలతోపాటు) హైదరాబాదుకు బానిసలుగా వలస వచ్చారు నవాబు సేనల్లో నియమితులై నిజాం ప్రత్యేక అంగరక్షక దళంగా ఏర్పాటయినారు అంతేగాక నిజాం సైన్యంలోని అద్వితీయ అశ్వదళాలుగా వారు పేరు గాంచారు వీరి నృత్యాల్లో వాటి పూర్వపు ఆఫ్రికారీతులు ఇంకా నిలచాయి అలాంటి యుద్ధ నృత్యాల్లో 'ఖడ్గనృత్యం' ఒకటి ఇది వివాహ సందర్భాల్లో చేస్తారు నృత్యగాళ్ళు రంగురంగుల లుంగీలు ధరించి నడుము పటకాలో బాకు బిగించి చేతిలో ఖడ్గం ధరించి నృత్యం చేస్తారు నృత్యగాళ్ళు అర్ధవలయాకృతిలో ఏర్పడి వెనక గానమాలపించగా రకరకాల ఖడ్గయుద్ధ రీతులు ప్రదర్శిస్తారు వేగం ఎక్కువయ్యే కొద్దీ నృత్యం పరాకాష్ఠనందుకోగా నృత్యగాళ్ళు బాకుల్ని నోట కరుచుకొని పైకెగురుతారు నవదంపతుల్ని ఆశీర్వదించే నినాదాలు చేస్తూ నృత్యంతో రంగం అవతలికి వెళ్తారు డప్పు వాద్యం సిద్దినృత్యానికి భిన్నంగా వుంటుంది దీని రీతి ఎక్కువ ప్రసన్నం నృత్యమనటం కంటే వాద్యగోష్ఠి అనవచ్చు [37]

**ఇ) బతకమ్మ :** బతకమ్మ నృత్యం తెలంగాణాలో ప్రాముఖ్యం ఇది స్త్రీలు వేసే నృత్యం అన్ని కులాలవారు ఈ నృత్యాన్ని వేస్తారు ఈ నృత్యం ప్రతి ఏడాది ఆశ్వయుజ మాసంలో చేస్తారు 'బతుకమ్మ'ను పూలతో పేరుస్తారు 'బతకమ్మ పండగ' అనే పేరుతో వైభవంగా జరుపుతారు ఇది తొమ్మిది రోజులు జరుగుతుంది చివరిరోజు 'సద్దుల బతకమ్మ' ఇది పెద్ద పండుగ మొదటి ఎనిమిది రోజులు చిన్న ఆడపిల్లలు, పెళ్లికెదిగిన అమ్మాయిలు ఆడుకుంటారు అంతా కలిసి బతుకమ్మను పూలతో పేరుస్తారు బతకమ్మ చుట్టూ చేరి సాయంత్రం చేతులతో లయాత్మకంగా చప్పట్లు చరుస్తూ గుండ్రాకారంగా తిరుగుతూ పాటలు పాడుతారు పాటల్లో చివరిగా ఊతపదం 'ఉయ్యాలో - వలలో - చందమామ' అనేవి ముఖ్యం చివరిరోజు నవమిరోజు 'బతకమ్మ'ను నదిలో లేదా బావిలో వేసి వస్తారు బతకమ్మను అలా చేస్తే పెళ్లిళ్లు తొందరగా అవుతాయని జానపద స్త్రీల నమ్మకం.

ఈ నృత్యంలో పాడే పాటలు ఇలా వున్నాయి

రామ రామ రామ ఉయ్యాలో
రామనే సీరామ ,,
అయ్యయ్యో సీరామ ,,
అయ్యయ్యో ఓరామ ,,
యుద్ధరక్క సెల్లెడ్లను ,,
పక్కూరికిచ్చి ,,
పక్కడే మాయన్న ,,
వచ్చిన్నపోడు ,,
యెట్లొద్దు సెల్లెలా ,,
వేరడ్డమాయె ,,

బతకమ్మకు సంబంధించిన జానపదకథలు రెండు ప్రచారంలో ఉన్నాయి శ్రీపాద గోపాలక్రిష్ణమూర్తిగారు సేకరించిన పాట ఇలా వుంది

శ్రీ లక్ష్మిదేవియూ చందమామ
సృష్టి బతుకమ్మయ్యె ,,
పుట్టినా రీతి చెప్పవే ,,
బట్టు నారసింహ్మ కవి ,,
ధర్మాంగుడను రాజు ,,
వా రాజు భార్యయు ,,
అతి సత్యవతియునూ ,,
నూరు నోములునోమి ,,
నూరు మందిని గాంచె ,,
వారి గురువులాయె ,,
వైరులచే అతమైరి ,,
తల్లిదండ్రులంపుడూ ,,
తరగని సోకంబున ,,
దన రాజ్యములను బాసి ,,
దాయాదులను బాసి ,,

వనితతో వా రాజు ,,
వనమందు నివసించె ,,
కలికి లక్ష్మిని గూర్చి ,,
గనతపం బొనరించె ,,
ప్రత్యక్షమై లక్ష్మి ,,
పలికెపర మడిగమని ,,
వినుతించె కాడుచు ,,
వెలసి గర్భమున ,,
పుట్టమని వేడగా ,,
పూబోని వరమిచ్చె ,,
సత్యవతి గర్భమున ,,
జన్మించె లక్ష్మి ,,
వంతలో మునులును ,,
అక్కడికి వచ్చిరి ,,
కపిల గాలవును ,,
కశ్య పాంగిరసులను ,,
అత్రివశిష్టులు ,,
ఆకన్నెయను జూచి ,,
బతుకనే యీ తల్లి ,,
బతు మ్మ యనురంటి ,,
పలుతరి వరమంచి ,,
ప్రేమగా తలిదండ్రి ,,
బతుకమ్మ యనుపేరు ,,
ప్రజలంతా అంటారు ,,
తాను ధన్యుడనుచు ,,
తను బిడ్డతో వా రాజు ,,
నిజ పట్టనమున వేగె ,,
నేల పాలించగా ,,
శ్రీమహా విష్ణువు ,,

చక్రాం కాడను పేర ,,
రాజు వేషంబున ,,
రాజు యింటికి వచ్చి ,,
యిల్లింట మనువుంది ,,
అతివ బతకమ్మను ,,
పెద్దాడి కొడుకులా ,,
పెక్కుమందిని గాంచె ,,
అరువేల మంది ,,
అతి సుందరాంగుడు ,,
ధర్మాంగుడను రాజు ,,
తన భార్య సత్యవతి ,,
సరిలేని సిరులతో ,,
సంతోష మొందిరీ ,,
టవేతిపై బ్రతకమ్మ ,,
శాశ్వితంబుగ వెలసె ,,

పై గేయం ప్రకారం బతకమ్మ శాశ్వితంగా వెలిసింది ఆమె పేరుమీదనే యీ పందగను జరుపుకొంటున్నారు ఈ కథలో బతకయ్య శ్రీ మహావిష్ణువు, బతకమ్మ శ్రీమహాలక్ష్మి

మరో కథ పౌరాణిక సంబంధం గౌరీదేవి మహిషాసురుని చంపి ఆ అలసటతో అశ్వయుజ శు। మొదటినాడు మూర్ఛపోయింది ఆమె మూర్ఛను తీర్చటానికి స్త్రీ లందరు గుమిగూడి పాటలు పాడారు పదవరోజు ఆమెకు తెలివి (స్పృహ) వచ్చింది మూర్ఛపోయిన మహిషాసుర మర్ధనిని 'బతుకమ్మా' అని తిరిగి జీవించమని ప్రార్థించారు. అపుడామె మరలా బతికింది.

బతుకమ్మ పండగ చేయటంలో ముఖ్యం లక్ష్మీపార్వతుల్ని పూజించడమే. పెళ్ళికాని యువతులు బతకమ్మ నోమునోమితే మంచి భర్తలు దొరుకుతారని తెలంగాణా జానపద స్త్రీల నమ్మకం.

# పాద సూచికలు

1. Alan Dundes – The study of Folk lore P – 2
2 ఇప్పటికి కూచిపూడి నాట్యానికి భరత నాట్యంతో సమానంగా శాస్త్ర గౌరవం పండితులు ఇవ్వలేకపోవటాన్ని ఈ సందర్భంలో స్మరించాలి
3 Walter Terry – Folk Dancing in America (PP 370–371)
4 Joann wheeler KealiinohomoKu–Folk Dance (PP 382–383)
5 ,, ,, ,, ,, (P 383)
6 Curt Sachs, world History of the Dance (P 216)
7 Arnold Haskell, The wonderful world of Drama (P 50)
8 Joann wheeler kealiinohomoku, Folk Dance, (P 384)
9 Marshall Stearns and Jeansteams, Jazz Dance, The story of American vernacular Dance (New Yark. Macmillanco Landon collier – Macmillan Ltd,, 1968)
10. Joann wheeler KealiinohomoKu, Folk Dance P 385
11. ,, ,, ,, ,, ,, P 386
12 ,, ,, ,, ,, ,, P, 386
13. ,, ,, ,, ,, ,, P. 386
14 ,, ,, , ,, ,, P 387
15 Frojesh Banerji, The folk dance of India P. 1
16 ,, ,, ,, P. 1, 2
17. ,, ,, ,, P. – 2
18. ,, ,, ,, P – 4
19. ,, ,, ,, P – 4
29 ,, ,, ,, P. – 6
21 ఊట్ల కొండయ్య (అనువాదం) భారతీయ జానపద నృత్యాలు పుట 27-40
(కపిలా వాత్స్యాయన్, సచ్చిదానంద వాత్స్యాయన్)
22 ,, ,, ,, పుట - 41 - 45

| | | | | |
|---|---|---|---|---|
| 23 | ,, | ,, | ,, | పుట - 57 - 59 |
| 24 | ,, | ,, | ,, | పుట - 59 - 61 |
| 25 | ,, | ,, | ,, | పుట - 61 - 67 |
| 26 | ,, | ,, | ,, | పుట - 67 - 74 |
| 27 | ,, | ,, | ,, | పుట - 75 - 81 |
| 28 | ,, | ,, | ,, | పుట - 81 - 83 |
| 29. | ,, | ,, | ,, | పుట - 85 - 93 |
| 30 | ,, | ,, | ,, | పుట - 93 - 97 |
| 31 | ,, | ,, | ,, | పుట - 97 -102 |
| 32 | ,, | ,, | ,, | పుట-103 - 106 |
| 33 | ,, | ,, | ,, | పుట - 106-119 |
| 34 | ,, | ,, | ,, | పుట- 119 - 123 |

35 చూ మూడవ అధ్యాయం కోలాట నృత్యం

36. ఊట్లకొండయ్య అనువాదం "భారతీయ" జానపద నృత్యాలు పుట - 124 - 141

37. ,, ,, ,, పుట - 147 - 148



# ఉపసంహారం

జానపద కళారీతుల్ని వివరించడానికే ప్రయత్నం చేశాను తప్ప శిష్ట నృత్య రీతుల్లో ప్రవహిస్తున్న జానపద నృత్య లక్షణాలను ప్రత్యేకించి పరిశీలించడానికి ప్రయత్నించలేకపోయాను ఈ పని అటు శిష్టనృత్యరీతులు తెలిసిన వారూ, ఇటు జానపద కళారీతులు తెలిసినవారు ముందు ముందు ప్రయత్నించవలసి ఉంటుంది

నృత్యకళాకారులు చేసే రంగస్థల నిర్మాణం, ఆహార్యం, సంగీతం మొదలైనవీ, ఆహారపు టలవాట్లు, వివాహ నియమాలు గాత్రపోషణ పద్ధతులు, నాటువైద్యం మొదలైన అంశాలు ఈ గ్రంథంలో చేర్చలేదు వీటిని ప్రత్యేకంగా పరిశోధించాల్సిన అవసరం కనిపిస్తున్నది

జానపద కళారూపాల్లో కనిపించే తాత్విక దృక్పథం ప్రాపంచిక జ్ఞానం కూడా పరిశీలించదగిన అంశాలు కళాకారులతో జరిపిన సంభాషణవల్ల ఇలాంటి అంశాలు చాలా ఉన్నాయని తెలుస్తుంది చివరిగా గుర్తించిన అతి ముఖ్యమైన అంశాన్ని విన్నవిస్తాను ప్రభుత్వపరంగా గానీ, విద్యా సంస్థల్లోగానీ జానపద కళాకారులమీద కన్పిస్తున్నంత అనురాగం ఆప్యాయత ఆ కళాకారుల మీద కనిపించటంలేదు నేను చర్చించిన నృత్యరీతుల్ని తమ జీవనోపాధికి వాడుకొంటూ కళే తమ జీవితపరమావధిగా, స్వధర్మంగా బ్రతుకుతున్న కళాకారులందరూ కడుపేదవారు వీళ్ళలో కొందరికి కొద్దిగానో వ్యవసాయం ఉండగా ఆసాదులు, గొరవయ్యలు, తప్పెట కళాకారులు, ఉరుమలోళ్లు మొదలగువారికి ఏ జీవనాధారమూ లేదు వీళ్ళ బొందెలోనే ఈ కళారూపాలు శాశ్వతంగా కనుమరుగయ్యే ప్రమాదముంది శిక్షణ శిబిరాల ద్వారా జీవనోపాధి కల్పించి ఈ కళాకారులను ప్రాచీనతా కళకి ప్రతిరూపంగా గౌరవించాల్సి ఉంటుంది వర్తమాన కాలంలో ఈ కళల్ని భద్రపరుచుకోవాలి కళాకారులకి చేయూతనివ్వాలి. ఇది మనందరి విధి

# ఆధార గ్రంథాలు

1 అన్నమాచార్యులు, తాళ్ళపాక 1976 - శృంగార సంకీర్తనలు సంపుటం - 12 తిరుమల తిరుపతి దేవస్థానం ప్రచురణ తిరుపతి

2. అనంతకృష్ణశర్మ, రాళ్ళపల్లి - నృత్తరత్నావళి జాయపసేనాని (అనువాదం), ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ప్రచురణ

3. ఆచార్య సి ఆర్. (1989) - కూచిపూడి ఆరాధనా నృత్యాలు - ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ

4. ఎఱ్ఱాప్రెగ్గడ, హరివంశం

5 ఎల్లోరా (1960) మన ప్రాచీన కళలు పుట్టుపూర్వోత్తరాలు

6 కుటుంబరావు, కొడవటిగంటి, కళలు - సారస్వతం ఎవరికోసం (మావో-సే-టుంగ్ అనువాదం)

7 కృష్ణకుమారి, నాయిని (1977) తెలుగు జానపదగేయ గాథలు

8 కృష్ణారెడ్డి చిగిచర్ల (1984) ధర్మవరం తాలూకా జానపద గేయాలు

1987 — గ్రామీణ సంస్కృతి [అనంతపురం జిల్లా జానపద గేయాలు

1989 — జానపద కళారూపం - చెక్కభజన జానపద యువకళాకారుల సంఘం రిజిష్టర్ 245/88 ప్రచురణ సుబ్బరావుపేట, ధర్మవరం మండలం, అనంతపురం జిల్లా.

9 గోపరాజు కొరవి, సింహాసన ద్వాత్రింశిక

10 జాగృతి (1984) దీపావళి ప్రత్యేక సంచిక

11 తిక్కనామాత్యుడు, ఆంధ్రమహాభారతం (విరాటపర్వం)

12 దొణప్ప, తూమాటి (1975) జానపదకళా సంపద నిర్మలా పబ్లికేషన్స్ విశాఖపట్నం

(1972) తెలుగులో కొత్తవెలుగులు రేడియో ప్రసంగాలు (సం 1)

13 దేవకి, యం కె (1983) తెలుగు బాలగేయ సాహిత్యం
14. నన్నయ - ఆంధ్ర మహాభారత (ఆది పర్వం)
15. నన్నెచోడుడు - కుమార సంభవం
16 నారాయణరెడ్డి, సి, (1988) కర్పూర వసంతరాయలు ఏమెస్కో ప్రచురణ.
17 నారాయణచార్యులు, పుట్టపర్తి, శివతాండవం
18. నాట్యకళ, మాసపత్రిక, జానపద, కళోత్సవ సంచిక (1970 ఫిబ్రవరి, మార్చి )
19 బ్రహ్మయ్య, భాస్కర, పరిష్కర్త బ్రహ్మానంద హెచ్ యస్, గుత్తి చరిత్ర (1988) (బుర్రకథ) రాయలకళాగోష్ఠి ప్రచురణ అనంతపురం
20. మాధవశర్మ జమ్మల మడక - నాట్యవేదం - అభినవ భారతి గుంటూరు (1957)
21. రఘుమారెడ్డి యెల్దండ - (1988) పల్లె పదాలలో ప్రజాజీవనం-స్వీయ ప్రచురణ
21 రామమూర్తి, జి - వి, (1982) నవరణ - దేశీబుక్ డిస్ట్రిబూటర్స్ విజయవాడ
22 రామరాజ భూషణుడు - వసుచరిత్ర
23 రామకృష్ణ, నటరాజ -
1964 - నర్తన కథ -
1968 - దాక్షిణాత్యుల నాట్యకళ
1970 - నృత్యజ్యోతి
1970 - నర్తనరాణి
1971 - నృత్యకళ
1984 - పేరిణి శివతాండవం
1984 - నవజనార్ధనం
1984 - ఆంధ్రనాట్యం
24 రామరాజు, బిరుదురాజు - (1958) తెలుగు జానపదగేయ సాహిత్యం స్వీయ ప్రచురణ

25 లింగారెడ్డి గోపు (1982) తెలంగాణా గ్రామిక గేయాలు -
26 లక్ష్మణన్ చెట్టియార్, ఎస్ ఎమ్ ఎన్ నరసింహానాయర్, ఎస్ - (1982) తమిళనాడు జానపద సాహిత్యం - సంస్కృతి
27 వాత్స్యాయన్, కపిలా (1980) భారతీయ జానపద నృత్యాలు వాత్స్యాయన్, సచ్చిదానందా అనువాదం ఊట్ల కొండయ్య
28 శ్రీకృష్ణదేవరాయలు - ఆముక్తమాల్యద
29 శ్రీరామ అప్పారావు, పొణంగి (1982) నాట్యశాస్త్రం (గుప్తభావ ప్రకాశ సహితం) ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ
30 శ్రీనాథుడు - కాశీఖండం, క్రీడాభిరామం, పల్నాటి వీరచరిత్ర
31 శ్రీనివాసులు కామిసెట్టి (కూర్పు) (1977) అన్నమాచార్య సంకీర్తనలు తిరుమల తిరుపతి దేవస్థానం తిరుపతి
32. సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశం - (సంపుటి - 4)
33 సత్యనారాయణ, కంభంపాటి - (1981) ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి (సంపుటి-1) హైదరాబాద్ బుక్ ట్రస్ట్
34 సత్యనారాయణ, విశ్వనాథ - కిన్నెరసాని పాటలు
35. సాంబశివరావు ఉ (1983) జానపద గేయాలు జనం పాటలు
36 సుందరం, ఆర్వీయస్ - (1983) ఆంధ్రుల జానపద విజ్ఞానం-ఆ సా అకాడమీ
1976 - జానపద సాహిత్య స్వరూపం
1978 - తెలుగు కన్నడ జానపదగేయాలు
37 సుబ్రహ్మణ్యం, పి యస్. (1977) ద్రావిడ భాషలు - సరస్వతీ ప్రచురణలు అణ్ణామలై నగర్
38 సోమనాథుడు - పాల్కురికి - బసవ పురాణం, పండితారాధ్య చరిత్ర

## కన్నడం

1 ఆద్యరంగా జేయస్ (1968) భారతీయ రంగభూమి - నేషనల్ బుక్ ట్రస్ట్ ఇండియా
2 చిదానందమూర్తి, ఎం. - 1968 కన్నడ శాసనగళ సాంస్కృతిక

# English

1 Anctote chuju and manchester, D W The Dance Encyle pedie (ed)

2. Banerji, Projesh - (1959) The Folk Dance of India - Kitabistan Allahabad

3 Dundes, Alan - (1965) The Study of Folklore - University of California.
Berkeley 1978 Essays in Folklori
stics Folklore Institute

4 Dorson Richard M - (1972) Folklore and Folklife (Ed) The University of chicago press

5 Haskell Arnold - The wonderful world of of Dance

6 Kealiinohomoku, Joann Wheeler - (1965) A Comparative Study of Dance as a consellation of motor Behaviors Among African and United States Negroes

7 Mary Clarke and clement Crip — The History of Dance

8 Ram Artar VIR - Indian Dances (First Steps)

9 Speen, Hildegard L - (1945) Folk Dances of South India

10 Sachs, curst - World History of the Dance

11 Terry, Walter - Folk Dancing in America

12 Vastsyayan Kapila - (1980) Traditional Indian theatre Multiple Streams
National Book Trust, India New Delhi

13 Hildegard L Spreen - (1945) Folk Dances of South India



# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | | అత్యుత్తకు | అత్యుత్తమ |
| 2 | 25 | తెలిపే | తెలిసే |
| 3 | 26 | అపయ గాలుగా | అవయవాలుగా |
| 3 | 7 | పజీవ | సజీవ |
| 9 | 5 | శిష్ట | శిష్ట |
| 11 | 7 | హొయసలుం | హొయసలుల |
| 11 | 13 | తంజావూరు గోని | వరంగల్లు జిల్లాలోని |
| 12 | 16 | జనాలయతో | జైనాలయముతో |
| 16 | 8 | ఇతల | ఇతర |
| 23 | 10 | శశిమౌశిన | శశిమౌళిని |
| 24 | 27 | మల్లి ణ | మల్లా ణ |
| 25 | 12 | ప్రచీన | ప్రాచీన |
| 26 | 5 | సొటలు | పాటలు |
| 32 | 18 | పిధుల్లో | విధుల్లో |
| 39 | 22 | నిరాకారస్వరూపు | నిరాకారస్వరూపుడు |
| 40 | 9 | నృత్తల | నృత్తం |
| 50 | 6 | అనారక | అనాగరిక |
| 62 | 29 | వేలెవేరే | వేరేవేరే |
| 65 | 15 | ఇత | ఇంత |
| 79 | 17 | పీరనృత్యం | వీరనృత్యం |
| 80 | 24 | పిల్లను | పుల్లను |
| 136 | 9 | మొదరి | మొదటి |
| 137 | 5 | పందిరి | పందరి |
| 144 | 20 | రెండు రూపయల | రెండు రూపాయల |
| 151 | 11 | ఉరిబయట | ఊరిబయట |
| 152 | 27 | చూడగగ్గది | చూడదగ్గది |
| 161 | 25 | చేసే కులంవారు | నేసే కులంవారు |
| 164 | 12 | ఆడుతువ్నాడు | ఆడుతున్నారు |